# అర్థశాస్త్రము.

శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారిచే

విరచితము.



ప్రకాశకులు:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే. ప్రకటితము.

1954

శ్రీరస్తు

# ఆంధ్రరాష్ట్రము.

శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారిచే

విరచితము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1951

# ఆంధ్ర రాష్ట్రము.

## 1-వ ప్రకరణము.

### జైనాశ్రమము

"ఆంధ్రరాష్ట్రమున కింత విరోధముగఁ బని సేయువారుందురని నేను స్వప్నమం దైన ననుకొనలేదు. ఈధూర్తవర్తనులకు శృంగభంగ మగు సుదిన మెన్నఁడో కదా! చిరకాలమునుండియు మాయాంధ్రసామ్రాజ్యమునకుఁ బ్రబల శత్రువులై యున్న యీకుతంత్రపరాయణులను జూచి పాపము దేవి దీర్ఘవిచారమున శుష్కించు చున్నది. వీరనారియు మహాపతివ్రతయు నగు నాసాధ్వీమణి పరిపాలనమునందుం డుట యీమాండలిక రాజమండలమునకుఁ దలవంపు కలుగుచున్న దఁట! సామ్రాజ్య మున నంతఃకలహాగ్ని యుద్భవించుట కిదియే కదా ముఖ్యకారణము. ఈకలహాగ్ని రుధిరధారలతోఁ గాని చల్లారదు. తమదేశక్షేమమును బ్రజాక్షేమమును లేశమును బాటింపక యన్యదేశీయులగు దేవగిరియాదవుల కుట్రలలోఁ జేరిన పాండ్యచోళాది సామంతభూకాంతులు నిరంతర దురాలోచనాయత్తచిత్తులై తమకొఱకుఁ దామే గోతులు త్రవ్వుకొనుచున్నారు. ఈయంతర్నాటక మెంతవఱకుఁ గొనసాగునో చూచెదఁగాక. ఈకపటనాటకమునకు సూత్రధారుఁడు జైనాచార్యుఁడు. పారిపార్శ్వకుఁడు ప్రతాపదేవుఁడు. కథానాయకుఁడు పాండ్యరాజు. ఆంధ్రదేశచక్రవర్తినియగు రుద్రమదేవి నీముగ్వురు హంతకులును హృదయశూలములవలె బాధించుచున్నవారు. ఈదుష్టత్రయము నంతమొనర్చి దేవికిఁ గలతాపత్రయమును దొలఁగించి, సర్వేశ్వరుండు రక్షించుఁగాక............అందునకు సందేహ మేమి! అప్రయత్నముగ నాకు లభించిన యీయుత్తర మప్రతిహతముగ బ్రహ్మాస్త్రము వంటిది కదా? మాయావియగు జైనాచార్యుఁడు పన్నుచుండిన కపటవ్యూహమును భేదించుట కింతకన్న నుత్తమసాధన మేమున్నది? అదిగో! ఆహవమల్లుఁడు చెప్పిన జైనాశ్రమోపాంత ప్రదేశచిహ్నములు కాన్పించుచున్నవి. నిర్మలవారిపూరమగు నీకాసారమును, దత్తీరమునందేకల మహోన్నతమగు నీవటవృక్షమును, ఒండొంటితో నంటి కడుదట్టముగ వ్యాపించిన యీకొండగుట్టలును, బాద మిడుటకైనఁ జోటీయక

కడుంజిక్కఁగ నల్లుకొనిన యీవెదురుపొదలును, నేను గమ్యస్థానమును సమీపించినట్లు తెలుపుచున్నయవి. అదిగో! ఈప్రక్కనుండిపోయి, కనుచూపుమేర గల యీ మామిడితోఁటలోఁ బ్రవేశించినచో జైనాశ్రమమునఁ బ్రవేశించినట్లులే?”

అని యనుకొనుచు, ఏకశిలానగరమున, కైదాఁరు క్రోసులదూరమున నున్నయడవులలో నుండి తురంగారూఢుఁడై యొకరాజభటుఁడుపోవుచుండెను. అది సాయంకాలము నాలుగుగంటలవేళ. మండువేసవి యయ్యు, రాజకార్యాతురుఁడై యారాజభటుఁడు మధ్యాహ్నమునుండియు నత్యంతవేగమునఁ బ్రయాణము సేయుచుండుటచే నాతఁడు ధరించిన సిపాయిదుస్తులు చెమటచేఁ దడిసి ముద్దయైనవి. ఆయువకుని ముఖపద్మమునఁ గ్రమ్మిన ఘర్మబిందువులు మకరందబిందువు లను భ్రాంతిఁ గొని, యాశ్రయించిన కొదమ తుమ్మెదలబారువలె నిగనిగలాడు చక్కని చిక్కని బుగ్గమీసములును, అదృష్టదేవతకు రంగస్థలమో యనువిశాల మగు ఫాలభాగమును, ఆరాజసేవకుఁడు కేవల సేవకమాత్రుఁడే కాక యున్నతవంశసంభూతుఁడగు నొకరాజకుమారుఁడై యుండనోపు నని భ్రాంతి గొలుపుచుండెను. స్వప్రాణరక్షణార్థమై యొరయం దిమిడ్చిన కరవాలమొక్కటి తప్ప వానియొద్ద నింకెట్టి యాయుధములును లేవు. ఇట్టి గంభీరాకారముతో నామామిడి తోఁటలోఁ బ్రవేశించి, యావీరపురుషుఁడు జైనాశ్రమమును సమీపించెను.

ఆయాశ్రమము మున్యాశ్రమమువలెఁ గాక పాడుపడిన యొకప్రాఁతదేవాలయమువలెఁ గళాహీనమై కనఁబడుచుండెను. ఆయాశ్రమగృహము కడుచిన్నదియై, యైదాఱుగజములకైవారములో నొకగదివలె నుండెను. నాలుగుప్రక్కల నిటికగోడలును, బైనఁ బెంకుటికప్పును జుట్టును దట్టముగ నావరించిన ముళ్లడొంకలును, ద్వారమునకుఁ గలశిథిలకవాటమును దప్ప వర్ణనార్హమగువిశేష మేమియు నందుఁ గనఁబడలేదు. ఆగుడియందు నట్టనడుమ జేగురుమయమగు నాంజనేయశిలావిగ్రహ మొకటి యున్నది. ఆవిగ్రహముపైఁ బీటలువాఱిన యొకబొక్కిగంట వ్రేలాడుచుండెను. ఆగుడియే జైనాశ్రమ మని యాహావమల్లుఁడు తన కెఱింగించియున్నందున నారాజవీరుఁ డచ్చటికి వచ్చి గుఱ్ఱమును డిగ్గి చెంతనున్నయొకమామిడిచెట్టునకుఁ గట్టి నిట్టూర్పులు విడుచుచు లోనఁ బ్రవేశించెను. నిర్మానుష్యమగు నాగుడియం దొక్కయాంజనేయవిగ్రహము తప్ప జైనాచార్యుఁడు కాని, వానిశిష్యులు గాని వానికంటికిఁ గానరాలేదు. అందుచే నతఁ డాశ్చర్య మభినయించుచు గుడినలువంకలఁ గలయఁ జూచి, వెలుపలికి వచ్చి గుడిచుట్టుఁ బ్రదక్షిణము చేయుచుఁ దనకనుచూపుమేరలో నొక యిల్లుగాని, జనసంచారచిహ్నములు గాని కానవచ్చునేమో యని చక్కఁగఁ బరీక్షించెను. అట్లు పరీక్షించి కొంతవర కిటు నటు సంచరించి, విసిగి, గుడిద్వారముకడకు వచ్చి నిశ్చేష్టుఁడై ముక్కుపై వ్రేలిడుకొని,

"ఓహో! ఎంత వింతగనున్నది? ఆహావమల్లునిమాటలు విని నేను సంపూర్ణముగ మోస పోయితిని. అతఁడు చెప్పినయీగుడియే జైనాశ్రమమని నమ్మికొని, వృథా ప్రయాస మొందితిని. నాబుద్ధిమాంద్యమునే నిందించుకొనవలెఁ గాని వాని ననవలసినపని లేదు. తన పేరు విన్నమాత్రముననే యాంధ్రదేశమును గడగడ లాడించుచు, దేవగిరి పాండ్యచోళాదిమహారాజుల నెల్ల నతిసూక్ష్మముగా వశపఱుచుకొని బంతులవలె నాడించుచు, నాఁటినందవంశమునకుఁ జాణక్యునివలెఁ గాకతీయరాజవంశమును నిర్మూలముఁగావించెదనని ప్రతిన వట్టినమహామాయావియగు నాజైనాచార్యుఁ డెక్కడ? ఊరును బేరును లేక యెక్కడనో పడియుండిన యీ చిన్నప్రాఁతగుడియందు నివసించుట యెక్కడ? దురాశచే వానిమాటలు నమ్మి నేను నిష్కారణముగ మోస పోయితిని. ఆంధ్రసామ్రాజ్యమునకును, గాకతీయరాజవంశమునకును బ్రబలశత్రువగు నాజైనాచార్యహతకుని బట్టితెచ్చిన వారికిఁ గోరినకోర్కె లీడేర్చెద నని దేవి యొనర్చినప్రతిజ్ఞ విని, యేకశిలానగరమందలి యనేకరాజోద్యోగస్థులును, రాజసేవకులును దత్ప్రయత్నము లతిదీక్షతో నొనర్చుచున్నారఁట. ఔను. నిజమే! అట్టి దీర్ఘ శత్రువును బట్టితెచ్చినవారికి దేవి యిది యది యనక కోరినయెడలఁ, దనప్రాణములు సైతము బహుమాన మొసంగునంతటిదానశీల యని యెవ్వ రెఱుంగరు? పంచభూతములు సాక్షిగ బహుమానాపేక్ష లేశమును లేక, కేవల దేశక్షేమముకొఱకే, యీజైనహతకుని మర్మగృహము కనిపెట్టవలయు నని యాఱుమాసములనుండి నే నొనర్చుచుండినప్రయత్నము లన్నియు వ్యర్థమై పోయినవి. సీతాదేవికాంజనేయునివలె రుద్రమదేవికి నేను మహోపకార మొనర్పఁ గల నని యనుకొంటిని. ఛీ! ఇంక నాబ్రదు కెందుకు?"

అని మెల్లఁగ లోనఁ బ్రవేశించి, యచ్చటిహనుమద్విగ్రహమునకుఁ గట్టెదుట నిలువంబడి, కన్నులు మూసి చేతులు మోడ్చి, తనలో నేమో కొంతసేపటివఱకు ధ్యానించి, పిదప మీఁద వ్రేలాడుచుండిన బొక్కిగంట నొక్కమాఱు బక్కుబక్కున మ్రోయించెను. అట్లు మ్రోయించి, యాతఁ డెందుచేతనో తనదృష్టియంతయు విగ్రహమునందే యుంచి, యూరక ఱెప్పవ్రాల్పక చూడ నారంభించెను. కొంతవఱ కట్లు చూచి చూచి, యొక్కమాఱు త్రుళ్లిపడి వెనుకకు జరిగి,

"ఆహా! ఎంతవింత? ఈశిలావిగ్రహమునకుఁ బ్రాణమున్నదా? లేక నాకు మతిభ్రమము కలుగుచున్నదా? ఈవిగ్రహము జరిగి నావైపున కెట్లు రాఁగలుగుచున్నది? అదిగో! ఎట్లు ప్రాఁకుచున్నదో? ఇది మతిభ్రమముగాదు. మాయాకిరాతవేషముతో నాఁటి

కిరీటిని బరీక్షింప నెంచిన త్రిపురాంతకదేవునివలె, నన్నుఁ బరీక్షింపవలె నని, శిలా విగ్రహరూపముతో నంజనీకుమారుఁ డిట్టులవతరించెను గాఁబోలు? అయినమాత్ర మేమిభయమున్నది? భయంకరము లగుయుద్ధరంగములయందు రిపుకంఠఖండనమున నారితేరినకరవాలము నాహస్తము నలంకరింప, దేవాసురుల కైన నన్నెదిరింప వచ్చునా?"

అని తటాలున నొరయందలిఖడ్గము నూడఁ బెఱికి,

"ఓయీ! దానవాన్వయారణ్యదావానలా! వాయుకుమారా! నీవు నిక్కముగ నన్నుఁ బరీక్షింప నెంచినయెడల నాయుధపాణివై నిల్వుము. నీ వెంతటిబలశాలి వైనను, నేను త్తమక్షత్రియపుత్రుఁడ నగుటచే నిరాయుధులతోఁ బోరాడఁజాలను. ఇంక నీ శిలావిగ్రహరూపమును విడిచి, ప్రత్యక్షముగ నాతో మాట్లాడుము."

అని పలికినంతనే "నీ వెవ్వరు? ఎచ్చటనుండి వచ్చుచుంటివి?" అనుమాట లాకస్మికముగ నావిగ్రహములోనుండి వెలువడి, యావీరపురుషునకు స్పష్టముగ వినఁబడియెను. తోడనే యతఁడు శరీర మంతయుఁ గంపమొంద, మఱింతధైర్యము వహించి, చేతనున్నకరవాలమును సవరించుచు, "ఓయీ! హనుమంతా! నే నెవ్వఁడనైన నేమి? రాజకార్యధురంధరుఁడనై జైనాచార్యునికొఱకు వచ్చుచున్నాఁడను." అని ప్రత్యుత్తర మిచ్చినంతనే యాశిలావిగ్రహము వెనుకనుండి, పదునెనిమిదేండ్లప్రాయము గల యొకజైనవిగ్రహము వచ్చి, వానికట్టెదుట నిలువఁబడి "అయ్యా! నీ వెచ్చటనుండి వచ్చుచుంటివి; నీతో నెవ రెవరు వచ్చిరి?" అని ప్రశ్నింప నారంభించెను. కోఁతివలె వికారాకారముతోఁ దనయెదుట నిలువఁబడిన యాజైనుని జూచి, యచ్చటి శిలావిగ్రహమునకు వెనుక నున్నసొరంగమును గనిపెట్టి, యారాజకుమారుఁ డిదివఱకుఁ దాను వహించి యున్నభ్రాంతి విడిచి, కడు విచిత్ర మగునాగుడియే జైనాశ్రమ మని గ్రహించి, వానితో నిట్లు ప్రసంగింపఁ దొడఁగెను.

"ఓయీ! నేను మధురానగరమునుండి వచ్చినాఁడను. నావెంట నెవ్వరును లేరు. ఆచార్యులవా రేమి చేయుచున్నారు?"

"జపము చేసికొనుచున్నారు. నీవు లోనికి రావచ్చును. కాని నాపేరు హనుమంతుఁ డని నీ కెవరు చెప్పిరి?"

"నీముఖసౌందర్యమే నీపేరు చెప్పుచున్నది. ఇంక నధికప్రసంగమును విడిచి నన్ను లోనికిఁ గొనిపొమ్ము."

ఆమాటలకు అతఁడు నవ్వుచు సొరంగమునఁ బ్రవేశించెను. ఆవీరపురుషుఁడును మెల్లగ వానివెంటనే లోనికి దిగ నారంభించెను. తోడనే యచ్చటిశిలావిగ్రహ మెప్పటి యట్ల గుహాద్వారమును మూసివేసెను.

---

(3)

## 2-వ ప్రకరణము

### రుద్రాంబ

ఆంధ్రదేశమును బరిపాలించినచక్రవర్తినులలో నొక్క రుద్రమదేవి తప్ప నామెకుఁ బూర్వులలోఁ గాని, తరువాత వారిలో గాని స్త్రీలెవ్వరును సింహాసనా రోహణ మొనర్చి యుండలేదు. అందుచే నొక్క రుద్రమదేవియే యాంధ్రదేశమునకుఁ బ్రథమచక్రవర్తిని. తనతండ్రి యగు గణపతిదేవునకుఁ బుత్త్రసంతతి లేకపోవుటచేతను, తాను రాజ్యసింహాసనము నలంకరింపకమున్నె తనభర్త పరలోకగతుం డగుటచేతను, తనకుఁగూడ "ఉమ్మక్క-రుయ్యమ్మ" లను నిరువురుకుమారికలు తప్ప కుమారకులు గలుగకపోవుటచేతను, రుద్రాంబయే తండ్రి మరణానంతరమున రాజ్యభారమును వహింపవలసి వచ్చెను. గణపతిదేవుఁడు తన యవసానసమయమున నాజ్ఞాపించినరీతిగా, శివదేవయ మొదలగు మంత్రిశేఖరులును, జన్నిగదేవమహారాజు మొదలగు సేనానాయకులును, ప్రసాదిత్యనాయఁడు మొదలుగాఁగల భృత్యవరులును, త్రిలింగరాజ్యమునకు రాజధాని యగు ఏకశిలానగరమున మహోత్సాహముతో రుద్రాంబను బట్టాభిషిక్తురాలి నొనర్చి రత్నసింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టిరి. అందుచే నాంధ్రసామ్రాజ్యపీఠము నలంకరించినయొక యాఁడుదాని పాదములకు మ్రొక్కుట వీరపురుషాగ్రగణ్యు లగు కొందఱు మాండలికరాజులకుఁ దలవంపుగా దోఁచెను. చక్రవర్తినియెడఁ గలభయముచేఁ బైకేమియు ననలేక, తామీయవమానమును భరింపలేక, యామె నెట్టులైన రాజ్యపీఠము నుండి తొలగింపవలయు నని దీక్ష వహించి, రాజద్రోహు లగు నా సామంతభూకాంతులు తెనుఁగుదేశమునకుఁ బ్రబలశత్రువులగు దేవగిరి ప్రభువులతో లోలోనఁ గుట్రలు సేయ నారంభించిరి.

ఇంతియె కాక, శైవమతాభిలాషియు, జైనమతప్రబలద్వేషియు నగు గణపతిదేవుఁడు, తనరాజధానియందు నివసించుచుండిన యనేక జైనులను మతద్వేషముచే నాశనము గావించెను. ముప్పదియాఱు జైనగ్రామముల నంత మొనరించెను. మఱియు జైనదేవాలయములఁ గూలఁ ద్రోయించి, తిరుగఁబడిన జైనుల నెల్లఁ జంపించుచుండుటచేత,

దిక్కులేనివారై, పాతశేషులు దేశమును విడిచి, కొండలయందును, నడవులయందును జేరుకొని, యజ్ఞాతవాస మొనరించుచుండిరి. ఇతరవిషయములయందు గణపతిదేవుఁ డెంతటి ప్రశంసనీయుఁడైనను, మతవిషయమునందు మాత్రము కేవలము ధూర్తవర్తనుఁ డని చెప్పక తీరదు. ఈమతద్వేషము క్రమక్రమముగా రాజకీయద్వేషముగా మారి నందున, నాంధ్రదేశమునకుఁ, గాకతీయరాజవంశమునకును ప్రబల శత్రువులై జైను లెల్లరుఁ దన్నాశనముఁ గోరి పగదీర్చుకొనుటకు లోలోనఁ బ్రయత్నించుచు, సమయము కొఱకు నిరీక్షించుచుండిరి. రుద్రాంబ పట్టాభిషేకానంతరము రాజ్యమునఁ గల్గిన యల్ల కల్లోలమువలన జైనులు తమపని ప్రారంభించి, రాజద్రోహులలో నేకీభవించి, తమ శత్రుత్వమును దీర్చుకొనసాగిరి.

పాపము రుద్రాంబ రత్నపీఠము నలంకరించి, నలువంకల శత్రుజనపూరిత మగు నాంధ్రదేశమును దిలకించి, స్త్రీజనసామాన్య మగు నధైర్యము వహింపక, వీరనారియై ఖడ్గపాణియై దేశకంటకుల సంహరించి రాజ్యమునం దంతట శాంతి నెలకొల్పవలయునని, తానును దగిన ప్రయత్నము లొనర్చుచుండెను. రుద్రమదేవినిఁ గూర్చియు, నామె శత్రువులను గూర్చియు మిగిలిన సంగతులు, చదువరులు ముందుముందు తెలిసికొనఁ గలరు.

ఒకనాఁటి సాయంకాలమున దేవి తనయంతఃపురమున మీఁది మేడయందుఁ గల డాబాపై జల్లగాలిలో సుచితాసనాసీనయై తనలో నేదో యొక యుత్తరమును జదువు కొనుచుండెను. ఆమె కిరువంకల నామె కుమార్తె లిర్వురును నిశ్శబ్దముగాఁ గూర్చుండి యుండిరి. ఆయుత్తరము చదువుచున్నంతసేపును దేవి ముఖలక్షణము లొకప్పుడు సంతోష మును మఱియొకప్పుడు రోషమును స్ఫురింపఁ జేయుచుండెను; ఆయుత్తరమందలి సంగతి యేమని కుమార్తెలు తల్లిని బ్రశ్నింపలేదు. చెప్పరాని రాజకీయరహస్యములను దేవి తన కుమార్తెలకు సైతమును దెలియనీక యతిగూఢముగా నుంచుట యామె స్వభావము. చెప్పఁదగిన విషయము లడుగ నక్కఱలేకయే యామె చెప్పుచుండును. అందుచేతనే యుమ్మక్కయు రుయ్యమ్మయుఁ, దల్లి నేమియుఁ బ్రశ్నింపక యూరకుండిరి. ఉత్తర మంతయు ముగించిన తరువాత దేవి యొక్క నిట్టూర్పు విడిచి ప్రక్కకుఁ జూచి, "ఏక వీరా! యిటురా!" అని సన్నని కంఠస్వరముతోఁ బిలిచెను. తోడనే సమీపమందేయున్న మేడగదిలోనుండిషోడశశరద్వయస్కయగు నొక జగన్మోహనాకారసుందరబాలికారత్నము నిలుకడగన్న మెఱుంగుతీవతెఱంగున చెంగునవచ్చి వినయవిధేయయై దేవికట్టెదుట నిలువం బడియెను. నల్లని శరీరచ్ఛాయగలిగి, తగుమాత్రము చక్కదనముతో నొప్పు నాస్త్రీలు

మువ్వురు నమిత లావణ్యరాశి యగు నేకవీర నూరక చెప్ప వ్రాల్పక చూడసాగిరి. అట్లు చూచి, దేవి—

"ఏకవీరా ! ఇంతవరకు నేమి చేయుచున్నావు?"

"దేవీ ! గంధము దీయుచున్నాను, నన్నేల పిలిచితిరి?"

"ఏమియును లేదు. నేటి మధ్యాహ్నమున మీయన్నయొద్దనుండి యుత్తరము వచ్చినది. ఇందులో నీయోగక్షేమములనుగూర్చి వ్రాసినాఁడు. నిన్ను దయతో నాదరింపవలె ననియుఁ దెలియక చేసిన తప్పులను మన్నింపవలయుననియు వ్రాసినందున నీసంగతి నీకుఁ జెప్పవలయునని రప్పించితిని."

"అమ్మా ! తక్కినసంగతులు నేను వినఁగూడదా?"

"వినవచ్చును. రహస్యములుకావు. జైనాచార్యుని వర్మగృహముఁ గనిపెట్టుటకై విశ్వ ప్రయత్నము లొనర్చుచున్నాఁడఁట. తనకుఁ దెలిసినశత్రురహస్యముల నెప్పటి వప్పుడు మనకుఁ దెలియఁ జేయుచుండునఁట ! ఇంక నేమేమో కొన్నిసంగతులు వ్రాసినాఁడు. పాప మతఁడు మారాజ్యమునుగూర్చి మిక్కిలి విశ్వాసముతోఁ బని సేయుచున్నాఁడు. వాని భక్తివిశ్వాసములును ధైర్యసాహసములును బ్రశంసనీయ ములు. ముందు ముందు వానికిఁ దగినప్రత్యుపకారము జరుపఁబడును."

ఆమాటలు విని యుమ్మక్క తల్లినిఁ జూచి,

"అమ్మా ! జైనులను బట్టుకొనుటకు, త్రిపురాంతకుఁ డెంతప్రయత్నించుచున్నాఁడో కాని, వానిపేరన్న మనశత్రువులకందఱికి సింహస్వప్నమైనది. నిజముగా నట్టివీరా గ్రేసరుఁడు మనపరివారములో లేఁడుసుమా—ఒక్కకుమారదేవుఁడుతప్ప—"

అది విని దేవి వెంటనే యేకవీరను జూచి,

"ఓసీ ! ఏకవీరా! కుమారదేవుఁ డన్న జ్ఞప్తికి వచ్చినది. నీవొక్కసారి వాని నిచ్చటికిఁ దీసికొని రమ్ము—ఆఁ—వలదు వలదు. కుమారదేవునికొఱకు నిన్నుఁ బంపరాదు. దాసీ లెవ్వరు నిచట కనఁబడ రేల?"

అని యడుగ నేకవీర చిఱునవ్వు నవ్వుచు,

అమ్మా ! నేనుమాత్రము మీదాసిని గానా? మీసెలవుప్రకార మిప్పుడే పోయి, యా సుందరవిగ్రహునిఁ దోడ్కొని వచ్చెదను."

"వలదు. కుమారదేవునికడకు నీవుపోయినయెడల ముప్పు వచ్చును. నీవు సామాన్యురాలవు కావు."

"దేవీ! మొదట మీరు సెలవిచ్చినకార్యమును నేను జేయక విడిచిపెట్టెదనా? ఇదిగో! ఇప్పుడే పోయి తీసికొని వచ్చెదను."

"ఓసీ గయ్యాళీ! ఎంతవడిదానవే? సెలవిచ్చినపని చేయక మానఁజాలవా? ఎంతభక్తి? ఈభక్తి నామీఁదనా? కుమారదేవునిమీఁదనా?"

అని పలుకుచుండ నేకవీర వినిపించుకొనక యచ్చటనుండి పరుగు పరుగునఁ బోయెను. అది చూచి వారు మువ్వురును దమలోఁ దాము నవ్వుకొన సాగిరి. అప్పు డుమ్మక్క తల్లినిఁ జూచి,

"అమ్మా! నీవు రహస్యము గనిపెట్టలేదు కాని, యేకవీర తనప్రాణములైదును మనకుమార దేవునకు ధారవోసి యున్నది. కుమారదేవుఁడుగూడ నట్టిస్థితియందే యున్నాఁడు. అంత యనురాగముతో నున్నవారికి మన మేల పెండ్లి చేయఁగూడదు?"

"అమ్మా! వారియన్యోన్యానురాగము నే నెఱుఁగనిదికాదు. కాని, ముందువెనుక లరయక, వారిదాంపత్యమునకు నే నిప్పు డంగీకరించినయెడల నిప్పటియల్లరులతోఁ బాటు బంధువిరోధములుఁగూడ మనకుఁ దటస్థింపఁగలవు. అందుచే—"

"అమ్మా! బంధువిరోధమా! నా కేమియు బోధపడలేదు."

"నీకెట్లు బోధపడఁగలదు? నిన్నగాక మొన్నపుట్టిన పసిబిడ్డవు! తెలియదని యూర కుండక ప్రతివిషయమునఁ బ్రవేశించుచుందువు. స్పష్టముగా విప్పి చెప్పినఁ గాని తెలిసికొన లేవు. ఇదిగో విను. నీచెల్లెలి పేరు రుయ్యమ్మ. ఆమెభర్త యన్నమ దేవుఁడు. అన్నమదేవునకుఁ దమ్ముఁడే యీకుమారదేవుఁడు. మగపిల్లలు లేక ముద్దు ముచ్చటలకొఱకు వానిని నేను జెంతనుంచుకొనినంతమాత్రమున స్వతంత్రించి, యే రాజకుమార్తెనైనఁదెచ్చి పెండ్లిసేయుటకు మారుగా, నూరును పేరును లేక మన యింటఁ జేరిన దరిద్రురాలగు నేకవీరను గూర్చినయెడల, నన్నమదేవునకును మనకును నింకఁ గలలో నైనఁ జుట్టపుఁజూపు లుండునా? ఇప్పుడు బోధపడినదా?"

అని పలుకఁ, దనతల్లికిఁ గోపము వచ్చినట్లు భావించి యుమ్మక్క మాఱుమాటా డక యూరకుండెను.

---

# 3-వ ప్రకరణము

## పరస్పరసంభాషణము

అంతఃపుర మంతయు నెంత వెదకినను బ్రియునిసందర్శన మేకవీరకు లభింపలేదు. కొంతసేపువఱకు నామె యచ్చటచ్చట నన్వేషించి, తుద కంతఃపురారామసీమఁ బ్రవేశించి, యచ్చటి లతాగృహములఁ బరీక్షింపసాగెను.

ఏకవీర వెలనాటిదేశపు రాజకన్యక. ఆమె పూర్వులు వెలనాటిరాజులకడ ముఖ్యమంత్రులుగను సేనానాయకులుగను బనిసేయుచుండుటచేత నాకుటుంబ మత్యైశ్వర్యశోభితమై రాజిల్లుచుండె నని చెప్ప నక్కఱలేదు. కాని చంచలలక్ష్మి యాకుటుంబమునం దెంతోకాలము నిలువలేదు.+ క్రీ. శ. 1228-వ సంవత్సరమున గణపతిదేవుఁడు తనకు వశులు గాని వెలనాటిరాజుల నెల్ల జయించి, యాయుద్ధములోఁ దనపైఁ దిరుగఁబడినవారి నెల్ల నాశనముగావించుచు నారాజ్య మంతయుఁ దనపరిపాలనముక్రిందికిఁ దెచ్చుకొనెను. ఆకలహమునందే యేకవీరపితామహుఁడు శత్రువులచేఁ జంపఁబడెను. పిదప గణపతిదేవుఁడు వెలనాటికి రాజధాని యైనధనదుపురమునందలి యైశ్వర్యమంతయుఁ జూఱఁగొని యేకశిలానగరమునకుఁ జేర్చుటచేతఁ బాప మేకవీరతండ్రి యాయుపద్రవములవలన నిరుద్యోగియై నిరుపేదయై కుటుంబపోషణముకొరకుఁ బడరానికష్టములు పడవలసివచ్చెను. వెలనాటిసీమ జయించినతరువాత గణపతిదేవుఁ డచ్చటిరాజబంధువులతోడను, సైన్యాధిపతులతోడను సంబంధబాంధవ్యములు జరిపి, యనేకుల కున్నతోద్యోగము లొసంగెను గాని, యేకవీరకుటుంబమువారు తన్నెదిరించినవారిలో ముఖ్యులైనందున వారి నించుకయైన సత్కరింపలేదు. ఏసంపదయు లేనప్పుడు సంతానసంపదకు లోప ముండదు కావున, నైశ్వర్యములో నున్నప్పుడు సంతానభాగ్యము లేదని విచారించుచుండిన తలిదండ్రులకు దరిద్రావస్థ తటస్థించినంతనే యాకొఱఁత పూర్తియైనది.

త్రిపురాంతకదేవుఁడును, ఏకవీరయు బాల్యావస్థయం దున్నప్పుడే తండ్రి పరలోకగతుం డైనందున నాకుటుంబదారిద్ర్యము మఱింత యధికమైనది. కన్నబిడ్డలకు వేళపట్టునఁ బట్టెఁడన్నమును బెట్టలేక, పాపము దీనురాలగుతల్లి వారినిఁ జూచి పుట్టెఁడు దుఃఖముతో నిరంతరము శుష్కించుచుండెను. ఇట్టి మహాకష్టములో దినములు గడుపుచు, ఏకభుక్తవ్రతములును, ఏకాదశీవ్రతములును జరుపుచు, జ్ఞానము వచ్చువఱకు నాపసిబిడ్డలను దల్లి కడుఁగారాబమునఁ బెంచి పెద్దలఁ జేసెను. రుద్రమదేవి తనపట్టాభిషేకానంతరమున నొకమారు వెలనాటిసీమను సందర్శింపవలయునని పోయినప్పు డావృద్ధురాలు

దేవిని దర్శించి; తనబిడ్డల నామెపాదములపైఁ బడవేసి వారిని రక్షింపవలయు నని ప్రార్థించెను. కరుణార్ద్రహృదయ యగురుద్రమదేవి యేకవీరను దనచెంత నుంచుకొని పోషించుచుఁ దగినవాని కిచ్చి పెండ్లిచేసెద నని వాగ్దానము చేసెను గాని, త్రిపురాంతకునకు మాత్ర ముద్యోగ మొసంగి తనకడ నుంచుకొనుట కంగీకరింపలేదు. తగినభక్తివిశ్వాసములు చూపువఱకు నాకుటుంబమువారి కుద్యోగము నొసంగుట యామె కిష్టము లేకపోయినను, జాలిగుండె గలదేవి తగినంతధన మొసంగి, వారిదారిద్ర్యమును దొలగించి, శత్రువులతో నేకీభవింపక, తనపక్షమున నిలిచి పనిచేసినయెడలఁ ద్రిపురాంతకునకు గొప్ప యుద్యోగ మొసంగునట్లు ఖరారు చేసి, యేకవీరను దనవెంటఁ దీసికొని పోయెను. ఇంక నీప్రసంగ మింతటితోఁ జాలించి, మనము ప్రస్తుతకథాభాగము ననుసరింతము.

నాఁటిసాయంసమయమున నయ్యుద్యానవనవాటికయం దొకనెలరాల తిన్నెపైఁ గూర్చుండి, దీర్ఘాలోచనానిమగ్నుఁడై యున్నకుమారదేవుని మారసుందరవిగ్రహమును గన్నులారఁ జూచి, యేకవీర బ్రహ్మానందభరితయై, నిశ్శబ్దముగ వెనుకనుండి వానిని సమీపించి, మెల్లఁగఁ దన రెండుచేతులును జాచి, వానికన్నులను మూసి, కంఠస్వరమును మార్చి, "నే నెవరో పోల్చుకొనవలయు" నని ప్రశ్నించెను. అంతవఱకును దీర్ఘవిచారమున మునిఁగియున్న కుమారదేవుఁ డొక్కమారు త్రుళ్లిపడి కన్నులు మూయఁబడి యున్నందున నిటునటుఁ జూడలేక, చిఱునవ్వు నవ్వుచు,

"ఎవరా? నాకన్నులు మూసినవారు, రుయ్యమ్మవదినగారు కాఁబోలు !"

"కాదు."

"ఉమ్మక్క వదినగారు కాఁబోలు ?"

"కాదు."

"కానియెడల రుద్రమ్మత్తగారై యుండవలయును."

"కాదు."

"సరే! మీ రెవ్వరును గానియెడల నింకఁ జెప్పవలసిన దేమున్నది? నీ వేకవీరవు."

"ఔను."

అని పకపక నవ్వుచు నేకవీర వానికన్నులను విప్పి కట్టెదుటకుఁ బోయి నిలుపంబడెను. తోడనే యొడలంతయు ఝల్లుమన సాక్షాత్కరించిన వనలక్ష్మివలెఁ దనకట్టెదుట నిలువఁబడినయేకవీరను జూచి, భయసంభ్రమములు చిత్తమున వెల్లడిగొన నామెతో నిట్లు ప్రసంగించెను.

"ప్రియా! నీ వింతసాహస మొనర్తు వని నే నెన్నఁడు ననుకొనలేదు సుమా!"

"ఏమీ? ఏమిసాహసము చేసితిని?"

"మన మీరుపురము నీ సుందరోద్యానవనమందలి యీనెలరాలతిన్నెపైఁ గూర్చుండి, యీచల్లగాలిలో హాయిగ ముచ్చటించుకొనుచున్నా మని తెలిసినయెడల దేవి నిన్నును నన్నును బ్రదుకనిచ్చునా? నీ విచ్చటి కేల వచ్చితివి?"

"ఓహో! ఇదియేనా సాహసము? పోనిమ్ము. నీతో మాటాడిరావలసినదని దేవియే నన్నిచ్చటికిఁ బంపించినయెడల నీ కీభయ మవసరము లేదు కదా?"

"నిజమే కాని, యట్లెన్నఁడును జరుగనేరదు. మనపరస్పరానురాగమును లేశము నిష్టపడకున్న దేవి, నాతో మాటాడి రమ్మని నిన్నుఁ బంపించునా? ఇది నేను నమ్మఁజాలను."

"మనోహరా! మాయన్నగారు వ్రాసినయుత్తరమును జదువుచుఁ గూర్చుండి, దేవియే నన్నుఁ బిలిచి, నిన్నుఁ దోడ్కొని రమ్మని పంపించినది. యబద్ధము గాదు."

"అలాగా? సరే! ఆయుత్తరము నాకు వినిపింపవలయునని కాఁబోలు! అదియును గాక, దేవి తీర్థయాత్రకుఁ గూడ బయలుదేర నున్నది. ఆవిషయమై సావకాశముగ నాలోచింపవలయునని నిన్ననే నాకు సెల విచ్చినది."

"మనోహరా! ఏమి తీర్థయాత్ర? ఎప్పుడు ప్రయాణము?"

"ప్రయాణ మెప్పుడో యింకను నిశ్చయము కాలేదు. ఉమ్మక్కవదినగారికిఁ బుత్రసంతానము లభించుటకయి బుద్ధగణపతి నారాధింపఁగోరి వడ్లెపల్లెకును, అచ్చటినుండి యేకవీరామహాదేవినిఁ గొలుచుటకయి మొగిలిచెర్లకును దేవి బయలుదేరును."

"అలాగా? ఏకవీరామహాదేవిని దర్శించినవారి కొక్క పుత్త్రసంతానభాగ్యమే కలుగునా? లేక యెట్టిమనోభీష్ట మున్నను నెఱవేఱునా?"

"అదంతయుఁ నాకుఁ దెలియదు కాని యీదేవత నారాధించువారికిఁ బుత్త్రలాభము కలుగునని యనేకుల నమ్మకము."

"ఔను, నిజమై యుండవచ్చును. మనోహరా! దేవిగారితో నీవుఁ గూడ బయలుదేరవలయునా?"

"అట్లే తోఁచుచున్నది. దేవి నన్ను రమ్మని నిర్బంధించుచున్నందువఁ బోవక తప్పదు."

"బాగున్నది. ఏకవీరారాధనమువలన నీకుఁ గూడఁ బుత్త్రలాభము కలుగుఁ గాక."

"సుందరీ! నీచమత్కారోక్తులు నాకుఁ గ్రొత్తవికావుకదా? ఇంక నీపరిహాసములు గట్టిపెట్టి మనము పోవుదము పద అలస్యమైనచో దేవి యాగ్రహించును."

## 4-వ ప్రకరణము.

### మోహాంకురము

"స్త్రీ యైన నేమి ? పురుషుఁ డైన నేమి ? నైశ్వర్యమున్న నేమి ? లేకున్న నేమి ? లోక జ్ఞానము కావలయును. బంధుప్రీతియుండవలయును. తనభర్తకు నేను పినతండ్రి కుమారుఁడను గాని పరుఁడను గాను కదా ? ఆపాపాత్మురాలు నన్నుఁ దగినట్లు గౌరవింపవలదా ? కన్నులు నెత్తి కెక్కి మిన్నును మన్నును గానక, యిట్లు మిట్టిపడుచుండుట కీపాటియైశ్వర్యము కలవారు లోకములో లేరా ? తనకు మఱఁదినై రాజకుటుంబములోఁ జేరినవాఁడ నగునన్నుఁగూడ సాటిసేనానాయకులందఱితోఁబాటు, తప్పు చేసినప్పుడు శిక్షించుచుండుట న్యాయమేనా ? ఇదియేనా నాయందలి గౌరవభావము ? నన్ను గౌరవింపక పోవుటయే కాక, యొకనాఁడైన రాజకీయవిషయములనుగూర్చి నాతో నాలోచించెనా ? పట్టాభిషేకమునాఁడు, రాజకుటుంబములోనివా రగుకుమారసింహుఁడు మొదలగువారికి లభించిన బహుమానములే నాకుఁ గూడ లభించు నని యనుకొంటిని; కాని, ముద్దకొఱకే చేరుకొనినట్లు సైన్యాధిపతుల కొసంగినదుస్తులును బహుమానములును నా కొసంగుట నన్నెంత పరాభవించుట ? నన్నింత పరిభవించిన యీ మదాంధురాలికిఁ దగినప్రాయశ్చిత్తము నేను జేయవలదా ? అందుకుఁ దగిన తరుణ మిదియే కదా ! జైనులును బౌద్ధులు మొదలగుప్రముఖు లందఱును గత్తికట్టి, రాజ్యమునుండి యీముండ నీడ్చివేయుటకుఁ బ్రయత్నించుచున్నారుకదా ! ఇందేమి తప్పున్నది ? మగఁడు చచ్చినంతనే తానుఁ గూడఁ జచ్చిన ట్లొకమూలఁ బడియుండక తగుదు నని గద్దెపై కెక్కుట యెంత వింత ? ఎంతనవ్వుఁబాటు ? వీరపురుషాగ్రగణ్యుల మగు మాయట్టివారి కెంత తలవంపు ? మొదలే యుక్తాయుక్తవిచక్షణజ్ఞానము లేని యొకసామాన్యస్త్రీ. అందులో విధవ. ఆపైని సామ్రాజ్యగర్వముచే విఱ్ఱవీగుచుండినదుష్టచిత్త. ఎంత సామంతులైనను మహారాజులమని చెప్పుకొనుచున్నమాండలిక ప్రభువు లీముండ పాదముల కెట్లు నమస్కరింపఁగలరు ? గాలిచే నెగిరి, యెంగిలివిస్తరి పడినమేడవలె, శునకము వసించిన కనకాసనమువలె నీచండాలురాలిసంపర్కముచే విఖ్యాతి వహించిన యాంధ్రసామ్రాజ్యపీఠ మెంత యపవిత్ర మైనది? ఇట్టి మహాపాపములు నివారింపకున్నయెడ మాబోంటి మహాపురుషులజన్మ మెందుకు ? నాకార్యక్రమము సానుకూలముగఁ గొనసాగుటకై జైనాచార్యుఁ డొకఁడు నాకుఁ గుడిభుజమువలెఁ బని సేయుచున్నవాఁడు కదా ? వానిని బట్టుకొనుటకై త్రిపురాంతకదేవుఁ డను నొక కుట్టిఁ ఘూరక

మిట్టిపడుచున్నాఁడట! కాని మహామాయావి యగు జైనాచార్యుని మర్మగృహము దేవతలైనఁ గనిపెట్టఁ గలరా? ఇది వట్టిభ్రాంతి; ఎందుకైన మంచిదని చెప్పి, చిన్న పాము నైనఁ బెద్దకఱ్ఱతోనె కొట్టవలయును గావున నా త్రిపురాంతకహతకుని వెదకి పట్టి, వెంటనే కడతేర్చవలయునని మొన్ననే జైనాచార్యునితోఁ జెప్పి తగిన యేర్పాటు గావించితిని. ఇంక స్వయముగా నాచేతులతో నేనే కడతేర్పవలసిన రెండవవాఁడు నాకుమారుఁడు—ఆఁ—కాదు కాదు. కుమారదేవుఁడు ?—ఏమిది? నానోటనుండి యిట్టియమంగళవాక్య మేల వెడలినది? కార్యతత్పరుఁడనై యుండుటచే మనసునకు నిలుకడ లేనందున నిట్లు పొరఁబడితినిగాని, నాకుమారునే నేను గడతేర్చుకొందునా? ఇంతకుఁ గార్గ్యవేదు లిట్టిశుభాశుభసూచకములఁ బాటింపరుగదా? కుమారదేవునిఁ గడతేర్చుటకై నే నిదివరకే యొకయుక్తి పన్నియుంటిని. ఆమందభాగ్యుఁడు గతప్రాణము లైదును నేకవీరకు ధారవోసి యున్నవాఁడుకదా? అందుచే నేకవీర కెట్టులైన వానియందసహ్యము బుట్టించి, యామె నాకుమారునిఁ బెండ్లియాడునట్లు చేసినయెడల, వాఁడు మోహాతిశయమున శుష్కించి శుష్కించి, తుదకు గతింపక మానడు. అల్పాయువగుటచేతనే యకాలమరణమునకై దైవము వాని నిచ్చటఁ జేర్చినాడు. ఈవిధముగాఁ గుమారదేవుఁడు గతించిన యెడల వానియన్నయు, రాజమహేంద్రవరప్రాంతాధికారియునగు అన్నమదేవునకు, దేనిపైఁ బట్టరానియాగ్రహము జనింపకమానదు. అట్లుఁ డైనయన్నమదేవుఁడుఁ గూడ శత్రువుఁ డైనయెడల నింక రుద్రమదేవి వలలోఁ జిక్కిన దిక్కుమాలినపక్షియే కదా!

"వాహ్వా! నాబుద్ధికుశలత యెంత ప్రశంసనీయ మైనది? నాసూక్ష్మగ్రహణశక్తియు, నాదురాలోచనమును, నాకే యాశ్చర్యమును బుట్టించుచున్నవి. ఇంతటిమహానీయుఁడ నగు నాతో విరోధముఁ దెచ్చుకొనినదేవి వట్టి నిర్భాగ్యురాలుగదా? కొండపై నున్నకోఁతిని గొనివచ్చినట్లు, ఎచ్చటనో యున్నకుమారదేవునిఁ దెచ్చుటకన్న,' మాముద్దులనాగరాజును జెంతనుంచుకొని పెంచుకొను మని చెవి నిల్లుగట్టుకొని బోధించితిని. ఇంతకు యోగము బాగు లేనప్పుడు, బుద్ధిమంతుల యాలోచనము నెత్తికెక్కదుకదా! ఇంక నీసంగతు లిట్లుంచి, ప్రస్తుతము నేను జేయవలసినదేమో యోచింపవలయును. నాకుమారుఁడు నాగరాజు మిక్కిలి సుందరాంగుఁడే కాని, మంచిబుద్ధిమంతుఁడే కాని, వట్టి సోమరిపోతు. లోకజ్ఞానహీనుఁడు. స్త్రీలను వలలో వేసికొనుటకుఁ దగినంతచతురుఁడు కాఁడు. కేవలము త్వాష్ట్రమువంటివాఁడు. కుక్కతోఁకను బట్టి గోదావరియీఁదినట్లు వీని నాధారముఁ జేసికొని నే నీయంతర్నాటక మాడింపవలసియున్నది. అందుచే మిక్కిలి జాణ యగు నేకవీరను వశము

చేసికొనుటకుఁ దగినంతచతురమతిని జేసి, యీామెపై మోహమును బుట్టించి, నా కుమారుని రాజోద్యానవనములోఁ బ్రవేశపెట్టెదను. పాఠశాలలోఁ బ్రవేశించి పనికిరాకపోయినను, ఉద్యానవనములోఁ బ్రవేశించిన కొంతవఱకైన లోకజ్ఞానము సంపాదింపకపోఁడు—"

అని యొకనాఁటిమధ్యాహ్నమునఁ దనమందిరమునఁ గూర్చుండి, రుద్రమదేవి సేనానాయకుఁడును గృహశత్రువు నగు ప్రతాపదేవుఁడు కుతంత్రపరాయణుఁడై దురాలోచనము లొనర్చుచుండెను. వాని క్రూరస్వభావము వాని చెడుతలంపులవలననే కాక, యాకారమువలనఁ గూడ మనము గ్రహింపవచ్చును. వికారాకారము గలయానల్లని మోటువిగ్రహమునకు దాదాపుగ నలువదిర్యైదేం డ్లుండకపోవు. చాలకాలమునుండియు నతఁడు కాకతీయులకొలువునందే పని చేయుచుండెను. మొదటినుండియు నాతఁడు దుస్స్వభావము కలవాఁడే యైనను, రాజకుటుంబమునకుఁ గొంచెము సంబంధించినవాఁడగుటచే గణపతిదేవుఁడుగాని, రుద్రమదేవిగాని, వాని నుద్యోగమునుండి తొలగింపలేదు. రుద్రమదేవి రాజ్యమునకు వచ్చినంతనే యీాదుష్టుని దూరముగా నుంచవలసినదని, శివదేవయ మొదలగుమంత్రిశేఖరు లామెకు బోధించిరిగాని, యట్లు చేసినయెడల నాతఁడు పోయి శత్రువులలో నేకీభవించు ననియు, నందువలన రాజ్యములోని యల్లకల్లోలము మఱింత యధిక మగు ననియుఁ జెప్పి, దేవి యందుకు సమ్మతింపలేదు. ఆనాఁటిమధ్యాహ్నమునఁ బ్రతాపదేవుఁడు చావడిగదిలోఁ గూర్చుండి, కపటచింతన మొనర్చుచుఁ బ్రక్కనున్న గదివైపు చూచి, "నాయనా! నాగరాజా! నీ వొకమారిటు రమ్ము." అని తనకుమారునిఁ బిలిచెను. తోడనే రూపురేఖలకుఁ దండ్రికిఁ దక్కువకాని నాగరాజు, ఏనాఁడును దైలసంపర్క మెఱుంగని చింపిరిజుట్టు మొగముపైఁ గ్రమ్ముచుండఁ, దెల్లనిమిడిగ్రుడ్లును నల్లనిదాకమొగమును జూపరుల నవ్వించుచుండ నీటిలో ముంచినను, అగ్నిలోఁ బడవేసినను జెక్కుచెదరని నల్లనిమలినవస్త్రములు ధరించి, నిద్దురమత్తుచేఁ గన్నులు నులుముకొనుచు జ్యేష్ఠాదేవి ముద్దుకుమారునివలెఁ దండ్రియెదుట బ్రత్యక్షమయ్యెను. తోడనే ప్రతాపదేవుఁ డత్యాదరమున వానిని జేరఁదీసి, చెంతఁ గూర్చుండఁబెట్టి, మెల్లఁగా నిట్లు ప్రసంగించెను.

"నాయనా! నాబంగారుకొండా! నాముద్దులమూటా! ఇంతవరకు నేమిసేయుచున్నావోయి? ప్రొద్దున నుండియు నిన్నుఁజూడకుండుటచే నాకన్నులు కాయలు గాచినవి. ఏదీ ఒక్కముద్దు."

అని ముద్దు పెట్టుకొని,

"కుమారా! నీకొక పరమరహస్య మెఱింగింపవలయునని పిలిచితిని"

"తండ్రీ! వద్దు. వద్దు. అంతపరమరహస్య మైనయెడల నాతోఁ జెప్పవద్దు. రహస్యమును నేను దాచి యుంచలేను."

"పోనిమ్ము. అది కేవలమును రహస్యము గాదు. నీ కొకచక్కనినీతి యుపదేశింపవలె నని నేను పిలిచితిని."

"నాయనా! నీతి యుపదేశించుటకు నే నవినీతుఁడనుగానే? కడుపునిండఁ దినుటకుఁ గాని, మెత్తగాఁ బరుండుటకుఁ గాని, పనికిరాని యీవట్టినీతులతో నాకేమి పని యున్నది? నాకెప్పలు మూసికొని పోవుచున్నవి. నన్ను విడిచిపెట్టుము. పోయిగాఁ బోయి పరుండెదను."

"ఓరీ నిర్భాగ్యుఁడా! నీనెత్తిమీద నాయినుపగజ్జెలతల్లి యాజ్యేష్ఠాదేవి తాండవమాడు చున్నదిరా? కుమారా యిటు చూడుము. ఒక్కసంగతి చెప్పెదను వినుము. నీవు వయోవంతుఁడ వైతివి కదా! వివాహమాడుట నీకిష్టము లేదా?"

"నాకిష్టము లేదు."

"నాయనా! ఎందుచేత?"

"ఇష్టము లేకపోవుటచేత"

"కుమారా! అటు గాదు. నామాట విను. నీవంటి వయోవంతులు విలువగల సన్ననివలువలు ధరించి యువతీమణులహృదయము లాకర్షించు శృంగారవేషములతో, శృంగార చేష్టలతో సన్ననికూనిరాగములతో వెన్నెలరాత్రులలో వీథులయందుఁ దిరుగుచు సకలసుఖభోగములు ననుభవించుచుండ, నీ వేల యిట్లు పట్టిపనికిమాలినమొద్దు వైతివి? కుమారా! సంసారసౌఖ్యములకు నీవు విముఖుఁడ వైయున్నయెడల, మన వంశ మెట్లు వృద్ధి కాఁగలదు? ఏసౌఖ్యమునకైన మితి యున్నదికాని, సుందరీ సౌఖ్యమునకుమాత్రము పరిమితి లేదు సుమా! నీకుఁ గావలసినయెడల నప్సరస్త్రీల నైనఁ దెప్పింపఁగలను. రంభాసంభోగమైన నొనఁగూర్పఁ గలను. అందుకు సిద్ధముగా నుండుము."

"నాయనా! రంభాసంభోగ మనుచున్నావు. నన్నుఁ గడతేర్చెదవా యేమి?"

"పాపము శాంతించుఁ గాక. కుమారా! యట్టియమంగళము లుచ్చరింపకుము. అప్సరసల కప్సరసయై రంభకు రంభయై, ప్రత్యేకముగ నీకొఱకే సృజింపఁబడినమోహినీ విగ్రహ మైనయేకవీరను నీ వెన్నడైనఁ జూచితివా?"

"చూచితిని."

"నిండుజవ్వనమును బై కుబికించుచున్న యాయంగసౌష్ఠవమును బాగుగఁ గనిపెట్టితివా?"

"కనిపెట్టితిని."

"వయోవంతులకుఁ జుఱుకుచుఱుకు మను నాలేఁడికన్నుల వెడలు బెళుకుచూపులయందలి మోహప్రభావమును గుర్తెఱింగితివా?"

"గుర్తెఱింగితిని."

"రాకాశరచ్చంద్రసన్నిభం బైనయామందహాససుందరవనము నెన్నఁడైన ముద్దాడఁ గోరితివా?"

"కోరితిని."

"అట్టి లావణ్యరాశి, యట్టిజగన్మోహిని, యాబంగారుబొమ్మ భార్య యగుటకన్న వేఱు భాగ్య మున్నదా?"

"లేదు."

'అందుచేత నోవెఱ్ఱినాయనా! నాచిన్నినాగన్నా! నీ వింక నీపాడునిద్రను గట్టిపెట్టి ప్రతిదినమును సాయంకాలములయందు గాబోద్యానవనమున కేఁగుచు, నచ్చటికిఁ బూలు గోయుటకై వచ్చునేకవీరను సందర్శించుచు,నీచతురవచనరచనానైపుణ్యము చేతను, దాపసాంగనల నైన మోహింపఁజేయు నీసుందరముఖమందహాసముల చేతను, నీలమేఘచ్ఛాయల నవహళించు నీశరీరలావణ్యాతిశయము చేతను, ఆమెహృదయ మును గరగించి, వలచి, వలపించి, మెచ్చి, మెప్పించి, యమితలావణ్యనిధాన మగు నా సుందరియౌవనమును నీ వేల యనుభవింపరాదు?"

"సాధ్య మైనయెడల ననుభవింపవచ్చును."

"ఓరిపిచ్చినాగన్నా! పనిఁ బూని ప్రయత్నించినయెడలఁ బురుషునకు సాధ్యము కాని కార్య మొకటి యున్నదఁటోయి? ఆచక్కనిచుక్క, యామెహంపుఁదునుక, యాబంగారుబొమ్మ కడుసూక్ష్మముగ నీకు లభించునట్లు చేసెదను. ఆమెతో సకల సౌఖ్యములు ననుభవించుచు నాకుఁ గన్నులపండు వొనర్పుము. నావెఱ్ఱితండ్రీ! నేను జెప్పినట్లు నడుచుకొనుము. ఈపూట కింతతోఁ జాలును. రాత్రి భోజనమైన తరువాత నీకు కొన్ని క్రొత్తపాఠములను బోధించెదను. ఇంకఁ బోయి నీపని చూచుకొనుము."



# 5.వ ప్రకరణము

## ఉన్మాదము

ప్రతాపదేవునిబోధనలవలనఁ గ్రమక్రమముగ నేకవీరపై మోహమంకురించి, నాగరాజుహృదయ మామెవంకకుఁ బరుగెత్త నారంభించెను. ఆరీతినే యతఁడు ప్రతిదినమును దనకుమారునకు బోధించుచుండుటచేత నామోహప్రసంగ మంతయుఁ దలకెక్కి, తొలుత నేపాప మెఱుఁగనినాగరా జిప్పుడు మదనతాపపీడితుఁడై నిరంతరము నేకవీరను సంస్మరించుకొనుచుఁ గాలము గడపుచుండెను. తండ్రి చెప్పినయాలోచనము ప్రకారము అతఁడు ప్రతిదినమునందును సాయంకాలముల రాజోద్యానవనమున కేఁగుచు నేకవీరనిమిత్త మచ్చట నిరీక్షించుచు వచ్చెను; గాని, పాప మొకసారైన వాని కామెదర్శనభాగ్యము లభింపలేదు. ఇట్లెన్నోదినములు వ్యర్థముగాఁ దిరిగి తిరిగి, పాప మామందభాగ్యుఁడు విఫలమనోరథుఁడై, తనతండ్రి తన పైకి విడిచిన మోహపిశాచము తనకు నిద్రాహారములు లేకుండఁ జేయ, దీర్ఘవిచారమున నిరంతరమును శుష్కింప నారంభించెను. తండ్రిబోధించిన క్రొత్తపాఠములవలన, సుగంధతైలములతోఁ జక్కఁగఁ దల దువ్వుకొనుటయుఁ, జలువ చేసినసన్నని జరీదుస్తుల నొయ్యారముగ ధరింపఁ గల్గుటయుఁ, బూలమాలికలచేఁ గంఠసీమ నలంకరించుకొనుటయు, సుగంధద్రవ్యములతో విటాగ్రేసరునివలె నిరంతరము రాజవీథులయందుఁ దిరుగుచుండుటయుఁ, గానవచ్చినప్రతికాంతను మోహబుద్ధిచేఁ దేరిపారఁ జూచుచుండుటయు, మొదలగువిద్యలను నాగరా జామూలాగ్రముగ నేర్చుకొని, తనతండ్రి పడిన ప్రయాసమును గొంత సార్థకము చేసెను. ఎన్నిదినములు ప్రయత్నించినను, ముచ్చటకైన నేకవీరదర్శనము వానికి లభింపకపోవుటచేత వానిపిచ్చి మోహము దినదినాభివృద్ధియై, మితిమీరి, నిద్దురలోసైతము నేకవీరనే స్మరింపఁజేయుచుండెను. ఆఁకలియు దప్పియు మాని, యామోహపిశాచ మొక్కొక్కనాఁడు పాపము నాగరాజు నుద్యానవనమునకుఁ గొనిపోయి, యుదయము మొదలు సాయంకాలము చీఁకటిపడువఱకు నచ్చటనే చరింపఁజేయుచుండెను. నాగరాజు హృదయక్షేత్రమునఁ బ్రతాపదేవుఁడు నాటిన మోహబీజము మొలచి, మొలకలెత్తి, చిగిర్చి, పుష్పించి, ఫలోన్ముఖమునకురాక మారతాపఝుంఝూమారుతముచే నిలుకడ లేక కొట్టుకొనుచుఁ గుదుళ్లతోఁగూడఁ గూలిపోవుటకు సిద్ధముగా నుండెను.

తీర్థయాత్రాకుతూహలచిత్తయై రుద్రమదేవి, ప్రయాణసన్నాహములో నున్న సంగతి చదువరు లిదివరలో వినియే యున్నారు. శత్రువుల యార్భాటములు కొంత

కాంతించుకొఱకు, నీ ప్రయాణము నిలుపు చేయవలయుననియు, సాహసించి బయలు దేరినచోఁ బ్రమాదములు తటస్థింపవచ్చుననియుఁ, గుమారదేవుఁడు మొదలగువారలు దేవికి బోధించిరి; కాని, యామె వినక, కొంతపరివారమును దోడుగాఁ గొని, తన కొమార్తెలతోడను, గుమారసింహునితోడను, నొకసుముహూర్తమున బయలుదేరుటకు నిశ్చయించెను. కుమారదేవుని వియోగము సహింపలేక, యేకవీర తానుగూడఁ బ్రయాణ మగుటకుఁ బ్రయత్నించెను గాని, కార్యము లేకపోయినది. ఆ ప్రయాణములోఁ దన ప్రియురాలిని వెంట నిడుకొనవలయు నని, కుమారసింహుఁడు గూడ పీలైనన్నివిధ ముల యత్నించెను. ఏకవీర ముచ్చటపడుచున్న దని యనేకులచే దేవికిఁ జెప్పించెను. ఏకవీరను మేము చెంత నుంచుకొనెద మని కుమార్తెలుసైతము దల్లిని వేడుకొనిరి. కాని, యెందఱెన్నివిధములఁ బ్రార్థించినను దేవి యేకవీరరాకకు లేశమును సమ్మతింపలేదు. కడకు వారందఱును బ్రయాణసిద్ధులై బయలుదేరుచున్నప్పుడు పాప మేకవీర దీన వదనయై సాహసించి, స్వయముగానే దేవిని బ్రార్థించెను. అందువలనఁగూడ లేశమును లాభము లేకపోయినది. ప్రియవియోగవిచారమున నేమియుఁ దోఁపక, పాప మేకవీర ఖిన్నవదనయై, నాఁటిసాయంకాలమున నొంటరిగ నుద్యానవనములో నొకమూలఁ గూర్చుండి, తనమనోహరునిదర్శనభాగ్యము మరల నెప్పటికిఁ బ్రాప్త మగునో యని చింతించుచుండెను.

ప్రతిదినము నాయారామసీమలో రెండువేళల ఫహారా యిచ్చుచుండిన నాగ రాజు, తనయదృష్టవశమున, నాఁటిసాయంకాలమున నేకవీరను సందర్శింపఁ గలిగెను. పెన్నిధిఁ గన్న పేదవలె నామె కంటఁబడినంతనే యామందభాగ్యుఁడు మోహాతిశయ మునఁ బిచ్చివానివలె గంతులు వేయుచు, సంతోషమును బట్టలేక, కేరుచుఁ బరుగు పరుగున వచ్చి, యామెయెదుట నిలిచి,

"ఆహా! ఏకవీరా! నీదర్శనభాగ్య మెన్నాళ్లకుఁ గల్గినదే? నీనిమిత్తము తిరుగలేక తిరుగ లేక నాకాళ్లు పట్లు పట్టినవి. నీకొఱకు నేనెంత పరితపించుచుంటినో దైవ మెఱుఁ గును. ఏదీ ఒక్కమాఱు నీముద్దుమొగ మెత్తి కన్నులార నన్ను వీక్షింపుము."

అని తండ్రిచెప్పినపాఠము నచ్చట నప్పగించుచుండ, నావికారాకారునిఁ జూచి, యేకవీర.

"ఓరీ! నీవు ప్రతాపదేవునికుమారుఁడవు కావా? నీపేరు నాగరాజేనా?"

"ఔను, నాపేరు నాగరాజే! నాసౌందర్యాతిశయమున నన్ను రతిరాజనికూడ నీ వంటికన్యకలు పిలుచుచుందురు. సుందరీ! ఏదీ? ఒక్కముద్దు!"

'ఛీ! మూర్ఖుఁడా! మొద్దువలెనున్న నీకు ముద్దుగూడఁ గావలయునా? నీముద్దు ముక్కలై నట్టులే యున్నది. ఇచ్చటినుండి పొమ్ము!"

"ప్రేయసీ! ప్రియా! ముద్దుగుమ్మా! చిలుకలకొలికీ!............తరువాత?......... ఆఁ—జ్ఞాపకము వచ్చినది. ఓవిరిబోఁడీ! ఓననబోఁడీ! నన్ను రక్షింపుము. నీపాదములను బట్టుకొనెదను. నీవే యింక దిక్కు"—

"దురాత్మా! నీవు నేఁడు త్రాగి వచ్చితివా యేమి? నోటికి వచ్చినట్టు ప్రేలుచున్నావు: నీగతి యేమగునో చూచుకొనుము."

"ఓసీ! దుష్టచిత్తా! మంచిమాటలచే నన్నుఁ జేపట్టెదవా లేదా? లేనిచో నిదిగో కత్తి! ఎంతపాదుగుగా నున్నదో చూడు. జాగ్రత్త!"

'ఓహో! నీ బ్రతుకునకుఁ గత్తికూడ నున్నదా? ఏదీ చూచెదను."

అని తటాలున వానిచేతిలోని ఖడ్గము లాగికొని,

"దురాత్మా! ఏమనిరా ప్రేలుచున్నావు? మరల నోరెత్తు, నీపని యేమగునో?"

ఆమాటలకు నాగరాజు గడగడలాడుచు,

"ఏకవీరా! ఏకవీరా! వద్దువద్దు! నన్నుఁ జంపివేయకుము. నీబిడ్డఁడను. నీవు పెంచిన కుక్కను. నన్ను బ్రాణములతో నుండనిమ్ము. నావలన నేమియుఁ దప్పు లేదు. నాతండ్రి నీయొద్ద నప్పగింపు మన్నపాత్రము నప్పగించుచున్నాను."

"అలాగా? సరే! అట్టు లైనయెడల నోరెత్తక, చల్లఁగ వచ్చినదారినే యింటికిఁ బోయి ప్రాణములను దక్కించుకొనుము."

"పోయెదను గాని, నామాట నేమి చేసితివి? నన్నుఁ బెండ్లాడవా? ఈమాత్ర ముప కారము చేయఁ గూడదా? నీకు శత్రువుఁడను గానుగదా? ఏకవీరా! నీకు నమస్కారము! పదివేలనమస్కారములు. నన్ను విడిచి పెట్టకు. దగ్గరకు రమ్ము! నన్నుఁ గౌఁగిలించుకొనుము. ముద్దాడుము. అబ్బబ్బా! ఇంక భరింపలేను. ఇదిగో సాష్టాంగ నమస్కారము."

అని యామె పాదములపైఁ బడెను. అతికోమలములగు నామె పాదముల స్పృశించినంతనే, లేశమును జ్ఞానములేక వానిశరీరముపై స్మృతి తప్పిపోయెను. అది కనిపెట్టి యేకవీర యిదియే సమయమని, యెంచి మెల్లఁగ నచ్చటనుండి తప్పించుకొని యంతఃపురమునకుఁ బాఱిపోయెను.

తరువాత నానిర్భాగ్యుఁడు కొంతసేపునకుఁ దెలివితెచ్చుకొని, లేచి, యిటునటుఁ జూచి—

"ఏకవీరా! ఏకవీరా! ఎచ్చట నున్నావు? అయ్యో! మాటాడవేమి? నన్నొంటరిగ విడిచి నీవేల పాఱిపోయితివి? నీకు నేనేమి యపరాధము చేసితిని? అయ్యయ్యో! నా కింకేది దిక్కు? నిన్ను విడిచి నేనెట్లు బ్రతుకఁగలను? అబ్బబ్బా! ఏకవీరా! రక్షింపుము! రక్షింపుము! నాప్రాణములు పోవుచున్నవి. నీకొఱకేడ్వలేక నానోరెండి పోవుచున్నది? నీకు నమస్కారము. నన్నుఁ జేపట్టుము. నీవు చెప్పినట్లు విందును. నీ పాదము లొత్తెదను. ప్రాణము పోవుచున్నది. రావేమి? రావేమి? హా తండ్రీ! నా గొంతుక యెంతకోసితివోయి? నాకింకేది దిక్కు? నేనెట్లు బ్రదుకఁగలను? అయ్యయ్యయ్యయ్యయ్యయ్యో!"

అని తటాలున నేలపైఁ బడి మూర్ఛపోయెను.

అహా! పాపము నాగరాజు గతి యెంతకు వచ్చినది! అట్లు మూర్ఛిల్లి, కొంత సేపునకుఁ దటాలున లేచి, గంతులు వేయుచుఁ జప్పట్లు చఱచుచుఁ బాటలం బాడుచు—

"ఏదీ ఏకవీర? నాముద్దులమూట, నాబంగారు బొమ్మ, నాచక్కనిచుక్క. అదిగో! అదిగో! పాఱిపోవుచున్నది. అవిగో చిలుకలు. ఆపిట్ట లెందు కెగురుచున్నవి? చెట్లకు నాకులకు నేమి సంబంధ మున్నది? ఏమిసంబంధమా? ఏకవీర. ఏకవీరకు నాకు నేమి సంబంధము? అది యాకాశము. ఇదిభూమి. అదిగో యేకవీర. అదిగో మాతండ్రి వచ్చుచున్నాఁడు. రా! రా! నీవు వచ్చి నన్నేమి చేయఁగలవు? వాహ్వా! వాహ్వా! ఓహోహో! హీహీహీహీ! ఏకవీరా! ఏకవీరా! అబ్బబ్బా! నన్ను గట్టిగాఁ గౌఁగిలించుకొనకుము. ఆఁ—ఆఁ—వద్దు, వద్దు. క త్తియె త్తకు. చూడు. చూడు. నే నెంత చక్కనివాఁడనో, ఊఁ—ఊఁ—ఎక్కడికిఁ బాఱిపోయెదవు? పదపద. నిన్ను వెంటఁ దరిమెదను."

అని పరుగుపరుగున నెచ్చటికో పరుగెత్తసాగెను.



# 6-వ ప్రకరణము.

## ఆచార్యుని కార్యస్థానము

నాఁటి సాయంకాలమున నాగుడిసొరంగములోఁ బ్రవేశించిన వీరపురుషునిసంగతి యేమయ్యెనో మన మీప్రకరణములోఁ గనుఁగొనవలసియున్నది. మెట్లు దిగుచు నంధకారమయ మగు నా సొరంగములోఁ బ్రవేశించి, యాపురుషుఁడు జైనునివెంట లోనికిఁ బోవుచుండెను. ఆసోపాన పంక్తి తిన్నఁగాఁ గట్టఁబడక, మూఁడు నాలుగు స్థలములయందు, వంపులుదిరిగి యుండుటచేత, నభ్యాస మున్నవారు తప్ప, నితరు లాచీఁకటిలోఁ బోవుట కష్టసాధ్యము. అందుచే జైనుఁడు మెల్లఁగ వానిచేయి పట్టుకొని జాగ్రత్తతోఁ దీసికొనిపోవుచు, మఱపు వచ్చినప్పు డెల్లఁ బ్రక్కకుఁ దిరుగుమని వానికిఁ జెప్పుచుండెను ఆదిగునప్పుడు గ్రహాచారవశమువలన మెట్టు దప్పి, కాలు జాఱిపడినయెడలఁ గ్రిందఁ బడినవాఁడు, కలికములోనికైనఁ గానరాకుండఁ జితికి ముద్ద యగును. ఆ సొరంగములో రాతితోఁ గట్టఁబడిన యిఱువదిసోపానము లున్నవి. ఆసోపానము లన్నియుఁ గడచి, క్రిందికిఁ బోయినంతనే యారాజపురుషునకు గొంచెము వెలుతురు కానరా నారంభించెను. మెట్లు దాఁటిన తరువాత నున్ననిగచ్చుచీడీపైఁ బ్రవేశించి, పదిగజములదూరము నడచినంతనే, దీపములకాంతితోఁ బ్రకాశించుచున్న యొక పెద్ద చావడి వారికిఁ గనంబడెను. సొరంగములో బ్రవేశించినప్పటినుండియు, నిరువంకల నున్న విచిత్రములును, లోపలిభాగమందలి విశేషములును గనిపెట్టవలయునని యిటు నటుఁ జూచుచు, నారాజకుమారుఁ డెంతయో ప్రయత్నించెను; గాని, యయ్యంతర్భాగమున వలసినంత వెలుతురు లేకపోవుటచేత వానిప్రయత్నము వ్యర్థమైనది.

ఇరువది గజముల పొడవును, బదిగజముల వెడల్పును గలిగి, పాలగచ్చుతో నిర్మింపఁబడిన యాచావడిలోఁ బ్రవేశించి, యారాజపురుషుఁడు వెఱ్ఱివానివలె నిటునటుఁ జూడ నారంభించెను.

ఎచ్చటఁ జూచినను విచ్చలవిడిగఁ గానవచ్చుచుండిన దీపస్తంభముల కాంతిలో వందలకొలఁది జైనులు వానికంటఁబడ నారంభించిరి. కొందఱు తళతళ మెఱయుఖడ్గములకు మఱింతసాన పట్టుచుండిరి. దృఢకాయు లగు కొంద ఱచ్చటచ్చట నొండొరులతో మల్లయుద్ధ మొనర్చుచుండిరి. కొందఱు విలువిద్య నభ్యసించుచుండిరి. మరికొంద ఱతిదీర్ఘము లగు తమకోదండములకు సరియగుకోలలు చెక్కుకొనుచుండిరి. వేలకొలఁది గట్టలుగాఁ గట్టఁబడిన యీటెలు శూలములు బాకులు పరశువులు మొదలగు నాయుధ విశేషములను గొందఱచ్చటికి మోసికొని పోవుచుండిరి. ఈవింత లన్నియుఁ జూచుచుఁ

జూడనియట్లు నటించుచు, ఆవీరపురుఁడు, చావడిలో నొకవ్యాఘ్రాసనముపైఁ గూర్చుండి దీర్ఘాలోచనమున మునిఁగియున్న జైనాచార్యుని సందర్శించెను. కాషాయాంబరములును, రుద్రాక్షమాలికలును, దెల్లగఁ బండిపోయిన గడ్డమును, అల్లిబిల్లిగ నల్లుకొనిన దీర్ఘములగు జడలును గలిగి, తాపసవేషమున నున్నయాజైనాచార్యునకు డెబ్బది సంవత్సరముల వయసుండును. ఆనూతనపురుషుని వెంటఁగొనివచ్చిన జైనుఁడు గురువుగారికి నమస్కరించి "ఆర్యా! ఈతఁడు మధురానగరమునుండి పాండ్యరాజు సందేశమును గొనివచ్చినాఁడు." అని చెప్పి యచ్చటినుండి వెంటనే వెడలిపోయెను. ఆమాటలు విని, జైనముఖ్యుఁ డావీరపురుషుని గంభీరాకారమును దేరిపారఁ జూచి, తనవ్యాఘ్రాజినముపైఁ గూర్చుండఁ బెట్టి, "వత్సా! నీపేరేమి! పాండ్యరాజు నిన్నెందుకొఱ కిచ్చటికిఁ బంపించెను?" అని యడుగ, నతఁడు "స్వామీ! నాపేరు, ఆహవమల్లుఁ డందురు. నేను పాండ్యసైన్యములకు నాయకుఁడను. మాప్రభువుగారిచ్చినయుత్తరముఁ గొని తమకడకు వచ్చినాఁడను" అని చెప్పి యొకయుత్తరమును దీసి వాని కొసంగెను. జైనస్వామి యాయుత్తర మందుకొని చెంతనున్న దీపపుఁగాంతిలో నిట్లు చదువ నారంభించెను.

"దేవతాంశసంభూతు లగు శ్రీజైనాచార్యులవారిపాదముల కభివందనము లొనర్చుచుఁ బాండ్యభూపతి వ్రాసికొనిన వినయపూర్వక విజ్ఞాపనము. దేవా!

తమయనుగ్రహమువలనఁ జోళరాజులు మనకుఁ బ్రాణమిత్రులై సర్వవిధముల మన కార్యములకుఁ దోడ్పడుచున్నారు. దేవగిరి ప్రభువులు మనకన్న వేయిరెట్లధికాతురులై యుండుటచేత, వారిసాహాయ్యముకొఱకు మనము లేశమును బ్రయత్నింపవలసిన యవసరము లేదు. రుద్రమదేవి సామంతులలోఁ గొందఱు లోలోపల నామెకు శత్రువులే యయ్యు, బహిరంగముగా మనలోఁ గలియుటకు వెనుదీయుచున్నారు. మఱికొందఱు సంగ్రామరంగమున మీపక్షముననే పనిచేసెదమని రాయబారము లంపుచున్నారు. అందుచే నిశ్చయముగా మనము కార్యక్రమమునకు దిగినప్పు డెవరెవరు మనకుఁ దోడయ్యెదరో యిప్పుడు నిర్ణయించుట కష్టము. ఏది యెట్లులున్నను రుద్రమదేవితో ధర్మయుద్ధ మొనర్చి గెలుపొందుట కలలోని వార్త. అందుచేఁ దగిన కుతంత్రములు పన్ని, రహస్యముగఁ గోటను ముట్టడించి, మోసము చేసియే మనము కార్యమును సాధించుకొనవలసియున్నది. ఆకుతంత్రములను గూర్చి, మీరును బ్రతాపదేవుఁడును గలిసి యాలోచించుట నాసమ్మతము. ఏకశిలానగరమందలి యుద్ధప్రయత్నములను, గోటలోని సమాచారములును, సైన్యములసంఖ్యావిశేషమును మొదలగు రహస్యములు ప్రతాపదేవునివలన సంపాదించి, మాకుఁ దెలియ

జేసినయెడల మాయుద్ధప్రయత్నములకుఁ గొంత లాభకరముగా నుండును. ఎవఁడో త్రిపురాంతకదేవుఁ డనువాఁడు మిమ్ము వెదకిపట్టి దేవి కప్పఁ జెప్పవలయు నని, యతి దీక్షతోఁ బనిసేయుచున్నవాఁడట! కావునఁ దమరు జాగ్రత్తతో నుండవలయును. వానిజాడలను గుర్తెఱిఁగి పట్టికొనిరావలయునని నాచారుల నిదివఱకే పంపించి, వెదకించుచున్నాఁడను. ఈయుత్తరము తెచ్చినమా సేనాని యగు నాహవమల్లుఁడు మిగిలినసంగతులను మీకెఱింగింపఁగలఁడు. సర్వేశ్వరుఁడు మన కార్యములకుఁ దోడగుఁగాక. విశేషములులేవు. దయయుంచవలెను. చిత్తగింపవలెను.

విధేయుఁడు,

జటవర్మ సుందరపాండ్యమహారాజు."

అని యుత్తరమంతయుఁ జదివి, కొంతసేపువఱకుఁ దనలో నేమో యాలోచించి, రెండుమూఁడుసారులు తల పంకించి, యారాజవీరునితో నిట్లు ప్రసంగించెను.

"అహవమల్లా! నీవెక్కివచ్చినగుఱ్ఱము బైటనుండిపోయినది కాఁబోలు! దానిసంరక్షణమునకై నాచారులను బంపించెదను. మధురానగరములో యుద్ధప్రయత్నములేమైన నారంభింపఁబడినవా? నీ వొకసేనానాయకుఁడవై యుండియు, సామాన్యసేవకునివలె నీయుత్తరమును గొనివచ్చుట కేమి కారణము?"

"దేవా! త్రిపురాంతకుఁడు మిమ్ముఁ బట్టుకొనుట కెంతప్రయత్నించుచున్నవాఁడో, వానినిఁ బట్టి పాండ్యరాజున కప్పఁజెప్పవలయునని నే నంత ప్రయత్నించుచున్నాను. అందుచే నాప్రయత్నము కొనసాగించుకొనుటకును, మీ కీయుత్తరమును సమర్పించుకొనుటకును, నేనే స్వయముగా బయలుదేరవలసివచ్చినది."

"అలాగా! ఆత్రిపురాంతకుఁడు నన్నుఁ బట్టుకొనఁగల్గునను మాట కలలోని వార్త. కాని వానిచాకచక్యమును, బుద్ధివిశేషమును మాత్రము కొనియాడక తప్పదు."

"స్వామీ! ఎందుచేత ?"

"ఎందుచేతనా? వాఁ డెవఁడో, ఎంతవయస్సుకలవాఁడో, ఎట్టిమూకారమువాఁడో యెఱిఁగినవా రెవ్వరును లేరు. వానియం దెట్టిగొప్పశక్తి యున్నదోకాని, నేనతి రహస్యముగా వ్రాసి పంపిన కొన్నియుత్తరములు చేతఁ జిక్కించుకొని కొన్నివిషయములలో నాప్రయత్నములకు భంగము గల్గించినాఁడు. అతిరహస్యముగ మనము చేయుచున్నప్రయత్నముల నాతఁ డెట్లు తెలిసికొనఁగలుగుచున్నాఁడో వింతగానున్నది.

నేనుగూడఁ గొందఱు గూఢచారులను బంపించి, వానిని బట్టించుటకై ప్రయత్నించుచున్నాను."

"దేవా! యాత్రిపురాంతకుఁడు మన చేఁ జిక్కువఱకు మన ప్రయత్నములు నిర్విఘ్నముగఁ గొనసాగుట దుర్లభము. అందుచే నిరంతరమును వానికొఱకు నే నతిదీక్షతో వెదకుచున్నాఁడను. ఈవిషయములోఁ దమరు ప్రయాసపడ నవసరము లేదు."

"మేలు వత్సా! మేలు మీయట్టివయోవంతు లెల్లరును సర్వవిధముల నాకుఁ దోడ్పడెదరని యెంచియే వృద్ధుఁడ నయ్యు నేనింతటిమహాకార్యమును దలపెట్టుకొంటిని. నిష్కారణముగ మాజైనమతమును నాశన మొనర్చి, మాజైనులకొంపలను గూల్చి మమ్మింత బాధపెట్టిన యాగణపతిదేవునివంశమును నిర్మూలము చేసి, యాతనిరాజ్యమును, వీరిపై నన్నివిధముల విధ్వంస మొనర్పకున్నయెడల మాబ్రదుకు లెందుకు? ఎందఱో సామంతులు నాయాజ్ఞకు బద్ధులై నేను జెప్పినట్లు ప్రవర్తింప వాగ్దానములు చేసియున్నారు. వాగ్దానములే కాక క్రియలు గూడ జరుపుచున్నారు. అయినను..."

"స్వామీ! ఈవిషయము లన్నియు నే నెఱుంగనివి కావు. మనమందఱము గలిసి, క్షణమాత్రములో రుద్రమదేవి నోడించి, యాంధ్రసామ్రాజ్యమును వశపఱుచుకొనఁగలమని నాకు ధైర్య మున్నది. కాని యట్లు వశపఱుచుకొనినతరువాత రాజ్యపీఠముపై నధివసించువా రెవరో యని నాకు సందేహముగా నున్నది."

"కుమారా! ఎవరును గారు. మన ప్రయత్నములకు శక్తివంచన లేక తోడ్పడుచు, యుద్ధరంగములో మనకు సాహాయ్యము చేసినసామంతరాజుల కందఱికిని, వారువారు చేసినయుపకారములను బట్టి, యీరాజ్యమంతయు భాగించి పంచిపెట్టెదను."

"స్వామీ! మీరు చక్కఁగా నాలోచించితిరి. ఇందువలన మొదటినుండియుఁ గష్టపడి పనిచేసినవారి కందఱికిని దగినప్రతిఫలములు ముట్టఁగలవు. భోగములు మూడుచుకొనక యందఱును సంతసించెదరు; కాని, యన్నివంతులలో మాపాండ్యరాజువంతు పెద్దదై యుండుట న్యాయ్యమని నేను దలంచెదను."

"అందుకు సందేహ మేమి? నేను నిష్పక్షపాతముగనే పంచిపెట్టెదను. ఇందులో నన్యాయ్యము జరుగనేరదు."

"దేవా! నేనిప్పటినుండియు మీ కాశ్రితుఁడను. నన్నుఁ గూడ నొకచిన్న జాగీరునకు నాయకునిగాఁ జేసినయెడల మీపేరు చెప్పుకొని బ్రదుకుచుందును."

"నాయనా! తప్పక యట్లే చేసెదను. నీతో నింకను మఱికొన్నిరహస్యములు మాటడ వలసియున్నవి. మన యేకాంతస్థలమునకుఁ బోయి, హాయిగాఁ బ్రసంగించు కొందము. రా."

అని చెప్పి, వాని నచ్చటికి తీసికొనిపోయెను.

---

## 7-వ ప్రకరణము

### ఇంకొకయుపాయము

"మొదట నే ననుకొనిన దొకటి-ఇప్పుడు జరిగిన దొకటి. ఏయుద్దేశముతో నాగ రాజున కేకవీరయందు మోహము పుట్టించితినో యాయుద్దేశము సంపూర్ణముగా విఫలమైనది. ఛీ! ఎందుకును బనికిరాని యిట్టిమూర్ఖునిఁ దనయునిగాఁ బడయుటకు నే నెంతపాపము చేసియుంటినో? అనేక జన్మములనుండి నేను జేయుచున్న మహా పాపమంతయు నిట్లు మూర్తీభవించి పుత్త్రాకారముతో నన్ను బాధించుచున్నది. పొట్ట చీల్చి పట్టపగలు కాగడాలతో వెదకినను నొక్క యక్కరమైనఁ గానరాని, యిట్టి మూర్ఖుఁడు తనయుండై యున్న నేమి? చన్న నేమి? లోకముతోఁ బాటుగ నాకుఁగూడ, నొకచక్కని—చతురత గల—చదువుకొనిన—చెప్పుచేఁతలకు లొంగిన—ఒక్కకుమారుఁ డున్నయెడల నీకుమారదేవు నేకశిలానగరమునఁ బ్రవే శింప నిత్తునా? సౌందర్యవతి నని విఱ్ఱవీగుచున్న యాయేకవీర ముప్పొద్దులఁ గుక్క వలె నాయింటిచుట్టును దిరుగునట్లు చేయకుందునా?—ఆరుద్రమదేవి నాపాదము లపైఁ బడి, నన్నుఁ బ్రార్థించి, నాకుమారునిఁ బెంచుకొనునట్లు చేసి, యాంధ్రరాష్ట్ర మంతయు నేకచ్ఛత్రముగ నేనే పరిపాలింప కుందునా? ఎందుకు? ఈగొంతెమ్మకోరి కలతో నిప్పు డేమి లాభమున్నది? శనిగ్రహమువలె నీశుద్ధమూర్ఖుఁడు నాకు దాప రించుటచేత నేను బన్నినవ్యూహ మంతయు గంగలోఁ గలిసిపోయినది. ఇంక గతిం చినదానినిఁ గూర్చి విచారించిన నేమి ప్రయోజన మున్నది? ఒక విషయమును గూర్చి, యనేకవిధములఁ బ్రయత్నింపవలయును. ఒకప్రయత్నము వ్యర్థమైనంత మాత్రమున నిరుత్సాహ మూనుట బుద్ధిమంతులలక్షణము గాదు. కుమారదేవుఁడు కడతేరుటకే కదా ఏకవీరను వశముచేసికొనవలయు నని ప్రయత్నించితిని? అంత మాత్రము కింతప్రయాస మేల? ఏకవీర నంతమొనర్చినయెడలఁ గుమారదేవుఁడుఁ గూడ వెంటనే యంతరించును. మొదటనే నా కీయుపాయముతోఁచియుండినచో, నీపాటికి నాప్రయత్నము సఫల మయియేయుండును. పోనిమ్ము. ఇప్పుడైన నేనైన

నది! ఒకటి, రెండుదినములలో—విషప్రయోగమునఁ గాని—ఖడ్గప్రయోగమునఁ గాని, యేకవీరను దుదముట్టించి—అబ్బబ్బా! ఎంతఘోర మొనర్పవలసివచ్చినది? నిండుయౌవనమున నున్న యట్టిజగన్మోహనవిగ్రహము ప్రపంచములో నెవ్వరికి నుపచరింపకుండ, వ్యర్థముగా నంతరించుచున్న దని నేను విచారించుచున్నాను. నిష్కారణముగఁ జంపించుటకన్న నేనే యామెను పెండ్లాడుట కేల ప్రయత్నింపరాదు? నేను జక్కఁనివాఁడనుగానా? రసజ్ఞుఁడనుగానా? వార్ధక మింకను నన్ను దొంగిలితోం? చూచుచున్నది కాని యావేశింపలేదే? ఏకవీర నన్నేల పెండ్లాడదు? ఈస్వల్ప విషయమును గూర్చి యింతదూర మాలోచింపవలసినపని లేదు. ఎట్లు చేసినను జేయ వచ్చును. కాని, తీర్థయాత్రకై బయలుదేఱిన రుద్రమదేవి.........ఆఁ— బాగున్నది. ఈయుపాయమువలనఁ గాఁగలకార్యము గంధర్వులే చేసి రనునట్లు నా కెట్టిప్రయాసమును గలుగకుండ నాయత్నము ఫలింపఁగలదు. ఇప్పుడే యుత్తరమువ్రాసి పాండ్యరాజునకుఁ బంపెదను. ఆఁ—పాండ్యరాజునకా? నాయుత్తర మాతని కందుసరికిఁ గార్యము మించిపోదా? ఔను. నిజమే! ఈకార్యభారము జైనాచార్యునిమీఁదనే యుంచవలసి యున్నది. ఇంకను జాముప్రొద్దున్నది కదా! సాయంకాలమగుసరికి నాయుత్తరము వాని కందఁగలదు..............బలే! రుద్రమా! నీవు నీకుమార్తెలతోఁ గూడ మరల క్షేమముగా నగరులోఁ బ్రవేశించినచో మిక్కిలి యదృష్టవంతురాలవే! కాని నీ కీగండము గడచునని నాకు ధైర్యము లేదు. కైలాసపర్వతమునుండి డిగ్గి, యాత్రిపురాంతకదేవుఁడు ప్రత్యక్షముగవచ్చి నిన్ను రక్షించినచోఁ జెప్పలేను గాని, లేకున్నచో నీకుఁ గుటుంబమరణము తప్పదు. నీజాతకములో నిట్టి చెడుయోగ ముండుటచేతనే పెనుభూతమువలె నీ కీతీర్థయాత్ర సంఘటించినది.........

అని యనుకొనుచు, రుద్రమదేవి తీర్థయాత్రకు బయలుదేరిన మఱునాఁటి సాయంకాలమునఁ బ్రతాపదేవుఁడు తనచావడిగదిలోఁ గూర్చుండి, జైనాచార్యుని పేర నుత్తరమువ్రాయుటకు నారంభించెను. వ్రాయవలసిన సంగతు లన్నియుఁ గడుదూరముగ నాలోచించి, వ్రాయుచు, వ్రాసినసంగతులెయే మరలఁ దనలోఁ దాను జదువుకొనుచు, నొకగంటసేపున కాయుత్తరమును బూర్తి చేసెను. అట్లు పూర్తి చేసి, యాయుత్తరమును బల్లపై నుంచి, చావడిలోనికి వచ్చి 'భిజ్జలా! భిజ్జలా!' అని రెండుమూఁడు సారులు గట్టిగాఁ బిలిచెను. కాని .వానికెవ్వరును బ్రత్యుత్తర మీయలేదు. బిజ్జలుఁడు జైనాచార్యుఁ డొప్పగించిన ప్రతాపదేవుని సేవకుఁడు. ప్రతాపదేవుఁ డతిరహస్యములైనయుత్తరములను వ్రాసి వానిచేతనే జైనాచార్యున కందఁజేయుచుండును. ప్రతాప

దేవుఁడు వానికొఱకిటునటు వెదకి తిన్నఁగఁ బెరటిలోనికేఁగి, యచ్చట నొకచీఁడీపై నిద్రించుచుండినబిజ్జలుని లేపి, తనవెంట నిడికొని మరల వచ్చి తనగదిలోఁ బ్రవేశించెను. ప్రవేశించినతోడనే బల్లపై నాతఁ డుంచినయంత్రము వానికిఁ గానరాలేదు. రెండు నిముసముల క్రిందటబల్లపైనుంచినయంత్రమింతలో నేమైనదని యాశ్చర్యపడుచు,గాలిచే నెగిరిపోయి యుండునని తలంచి, యాగదిలో నాలుగుమూలల నతిశ్రద్ధతో వెదకెను. బిజ్జలునిచేఁ గూడ వెదకించెను; కాని కార్యము లేకపోయినది. అతిరహస్యమగు నాజాబు పరులచేతిలోఁ బడినచోఁ దన కింకనూఱేండ్లను నిండుటకు సందియములేదని యనుకొనుచు, నోట మాటలేక, యొడలంతయుఁ జెమటలు గ్రమ్మ గద్గదస్వరముతో “బిజ్జలా! బిజ్జలా! ఏమిసాధనము? నాకొంపమునుఁగును గాఁబోలు? పద. పద. వీథిలోని కెగిరి పోయినదేమో చూతము.” అని ప్రతాపదేవుఁడు గుమ్మము దాఁటి పైకివచ్చి యరుగుచివర నిలువఁబడియుండిన నాగరాజును జూచెను. ఆ యంత్రము వానిచేతిలోనే యున్నది. అది కనిపెట్టి ప్రతాపదేవుఁడు మెల్లఁగ వానిని సమీపించి, మంచి మాటలతో—

“నాయనా! నాగరాజా! ఆయంత్రము నిటు తెమ్ము! నీకు మంచివస్తు విచ్చెదను!”

“ఏమివస్తు విచ్చెదవు? ఈయంత్ర మెవరికి? ఏకవీరకా? ఏదీ ఏకవీర యెచ్చట నున్నది? నాప్రియురా లేమి చేయుచున్నది? లేదు. లేదు. లేదు. ఇంక రాదు. ఛీఛీ! పో! నాతో మాటాడకు”

“కుమారా! ఆయంత్రము నాకిచ్చివేసినయెడల నీ కేకవీర నిప్పించెదను. కావున నిటు తెమ్ము.”

“ఏకవీర నిప్పించెదవా? ఆహాహా! ఏదీ? ఎచ్చట నున్నది? ఉద్యానవనములో నున్నదా? ఇదిగో పోయెదను.”

అని పరుత్తెంబోవుచుండఁ బ్రతాపదేవుఁడును బిజ్జలుఁడును వాని నడ్డగించి, యాయంత్రమును బలవంతముగఁ దీసికొనవలయునని ప్రయత్నించిరి! కాని యాపిచ్చి వాఁ డాయంత్రమును వారికి స్వాధీనముగానీక రెండు చేతులతో గట్టిగఁ బట్టుకొని, మెల్లఁగ నందలి యక్షరములను జదువుచు

“ఆఁ— ఆఁ—అమ్మయ్యో! అమ్మయో! రుద్రమదేవినే? రుద్రమదేవినే? పాప మామె యేమి చేసినది? అయ్యయ్యో! దేవినే చంపించెదవా? తండ్రీ! నన్నింత మోసపుచ్చిన యేకవీరను జంపింపరాదా?

అని యాయంత్రములోని రహస్యములను వెడలఁగ్రక్కుచుండఁ బ్రతాప దేవుఁడు గడగడ వడకుచు, నెవరైన వచ్చుచుండిరేమో యని యిటు నటు చూచుచు,

"నాయనా! నామాట వినుము. ఆయుత్తరము నిటు తెమ్ము. నిన్నింత మోసపుచ్చిన యాయేకవీరను దప్పక చంపించెదను."

అని పలికినంతనే నాగరాజు తటాలున నాయుత్తరము నచ్చటఁ బాఱవేసి యరుగుపై నుండి చెంగున వీధిలోని కుఱికి, వీధులవెంటఁ బరుగెత్తుచు

'ఏకవీరా! నీపనిసరి. కాచుకో! కాచుకో! మాతండ్రి నిన్నుఁ జంపక మానఁడు. ఎచ్చట నున్నావు? రా! రా! ఇదిగో కత్తి! అదుగో మాతండ్రి! పో! పో! పాఱిపో! రా! రా! యిటు రా! లే! లే! యింకలే!..."

అని కేకలువేయ నారంభించెను. అందుచేఁ బ్రతాపదేవుఁ డేకవీరను జంపు నున్నాఁ డనువదంతి యతిస్వల్పకాలములోనే పట్టణమునం దంతట వ్యాపించెను.

---

## 8-వ ప్రకరణము.

### ఏకవీరాదేవియాలయము

వడ్డెపల్లెలో యుద్ధగణపతిని అర్చించి, రుద్రమదేవి తనపరివారముతో నచ్చటినుండి మొగిలిచెర్లకు బయలుదేరెను. అచ్చట నవతరించిన యేకవీరాదేవి ప్రత్యక్ష దేవత యని యానాఁటి యాంధ్రులచే మిక్కిలి భక్తివైభవములతోఁ గొల్వఁబడుచుండెను. జమదగ్నిమహామునిభార్యయుఁ, బరశురామునకుఁ దల్లియు నగు రేణుకాదేవియే యీయేకవీరాదేవియై యవతరించెనఁట! ఈదేవత యాదిశక్తియపరావతారమేయఁట! ఆకాలములో నుత్సవదినములయం దేకవీరామహాదేవియెదుట బవనీలు పరశురాముని కథలు శ్రవణానందముగఁ బాడుచుండుట యాచారమై యున్నది. ఈదేవత సంతానహీనుల మనోరథముల నెఱవేర్చు కల్పవల్లి యను నమ్మకమున దూరదేశములనుండిసైతము వచ్చి భక్తిపూర్వకముగ సేవించి, యర్థులు మనోగతార్థముల నాదేవికి విన్నవించుకొని పోవుచుందురు. ఎడతెరిపిలేకుండ యాత్రికు లచ్చటికి వచ్చి పోవుచుండుటచేఁ బ్రతిదినము నాయేకవీరాలయములో నాదేవతయెదుట నిత్యకల్యాణములును, నిత్యోత్సవములు నవిచ్ఛిన్నముగా జరుగుచుఁ గన్నులపండువుగా నుండుచుండును.

మొగిలిచెర్లలో నిర్మింపఁబడిన యేకవీరాలయము దాదాపుగ నేవైపు చూచినను మూఁడునాలుగు ఫర్లాంగుల కైవారముగలిగి చుట్టును, బలిష్ఠమును నత్యున్నతమును నగు గొప్పప్రాకారముతో నొకచిన్న దుర్గమువలె నొప్పుచుండెను. ఆప్రాకారమునకుఁ దూర్పు దిక్కునఁ గలముఖద్వారము, రెండువైపుల నతిభయంకరము లగు రాతిసింహముల

తోడను, జూపఱులహృదయము లాకర్షించు చెక్కడపుఁబనులతోడను మిక్కిలి మనోహరముగా నుండెను. వందలకొలఁది యినుపమేకులతోఁ గడుదృఢములై యున్న తద్ద్వారకవాటములు రాత్రులయందు పదిగంటలవఱకుఁ దెఱువఁబడి యుండును. కాని, పూజారులును గోవెలతో సంబంధించిన తదితరదాసదాసీజనములును, దఱచుగాఁ దిరుగుచుండుటకై రెండుమూఁడు చిన్నచిన్న ద్వారము లచ్చటచ్చట నున్నవి. ఆప్రాకారములో నట్టనడుమనే మహోన్నతశిఖరములతో నొప్పుచు, నల్లరాతితోఁ గట్టఁబడిన దేవియాలయము ప్రకాశించుచుండును. ఆదేవికోవెలకు నలువంకలఁ గలచిన్నచిన్నగుళ్లలో, భైరవేశ్వరుఁడు, వీరభద్రేశ్వరుఁడు, కేశవస్వామి, మైలారదేవుఁడు మొదలగుదైవములు సదాభక్తులచే నారాధింపఁ బడుచుందురు. ఆయాలయములో వరుసతోఁ బ్రాకారకుడ్యమునకు నంటి, పూవులు, ఫలములు, మిఠాయీలు, తమలపాకులు, ఆటవస్తువులు మొదలగు సామగ్రులతో సదా పెక్కుదుకాణములు పేర్చఁబడియుండును. ఆలయమునకు వెనుకభాగమున యాత్రస్థులబసలనిమిత్తము వరుసగాఁ జిన్నచిన్న నలువదిగదులుకట్టఁబడినవి. కాని, యాగదులన్నియు నివాసయోగ్యములు కాకపోవుటచేతను, వర్ణవిచక్షణత లేకుండ నన్నిజాతులవారు వానిలో బసచేయుచుండుటచేతను క్రమక్రమముగ యాత్రస్థులు వాని నుపయోగించుట మానివేసిరి. అందుచే నవి యన్నియుఁ దదితరోపయోగముల కొఱకు జనులచే వినియోగింపఁబడు చున్నవి.

కేవలము పట్టణమును గాక పల్లెయుఁ గాక, సామాన్యగ్రామ మగు మొగిలిచెర్లయందుఁ బ్రవేశించి, యాలయమునం దొకప్రక్క గుడారములు వేయించి, యందుఁ దనపరివారముతో రుద్రమదేవి యైదుదినములవఱకు నివసించెను. ఆయైదుదినములును దేవి గొప్పయుత్సవములు చేయించి, యతివైభవముతో నాదేవత నారాధించెను. అనేకులగు నిరుపేదలను సత్కరించి, యఖండ మగునన్నదానమును జేయించెను. ఆదినములలో రెండుపూటలును దేవి తనకుమార్తెలతోడను, గుమారదేవునితోడను బాదచారియై పోయి యేకవీరాదేవిని దర్శించుచుండెను. అట్లే యైదవనాఁటిసాయంకాలమునఁ గూడ నామె యాలయములోనికి వచ్చెను. అప్పుడప్పుడే చీఁకటు లారంభించుచుండినందున నాలయమునం దంతట దీపములు వెలిగింపఁబడినవి. చుట్టుప్రక్కలఁ గల యాలయములయందలి జేగంటలమ్రోఁతలు చెవుల బ్రద్దలు సేయుచుండెను. కర్పూరహారతులు గలపళ్లెరములు గొని పూజారు లిటునటుఁ దిరుగుచుండిరి. పలువిధము లగుపూలమాలికలను గైకొని, మాలాకారులు భక్తులకు విక్రయించుచుండిరి. అది కృష్ణపక్ష మగుటచే నాయాలయప్రాంతమునందు జనసంచారము గల భాగములు తప్ప నితరస్థలములు దట్టముగఁ జీకటులతో నిండియుండెను. అట్టిసమయమున

రుద్రమదేవి యేకవీరాదేవికి భోగరాగములు చేయించుచుఁ దనకుటుంబముతోఁగూడ నామెను గొల్చుచుండెను.

గర్భాలయములో నొకనెలరాలతిన్నెపై నమర్పఁబడిన యతిమనోహరమగు నేక వీరాదేవి విగ్రహమును జూచి, భక్తు లెల్లరు నాసుందర విగ్రహసందర్శనమువలనఁ దమజన్మములు సార్థకము లయ్యెనని సంతసించుచుందురు. ఏమరుపాటునఁ జూచినవారు తద్విగ్రహస్వాభావికసౌందర్యమువలన నెనిమిదేండ్లప్రాయము గలయొకబాలిక యా తిన్నెపై నిలువఁబడియున్నదని భ్రమయుచుందు రని వ్రాయుటకన్నఁ దదంగసౌష్టవ మును వేరుగ వర్ణింప నక్కరలేదు. సత్కవీశ్వరునికృతివలె స్వభావము చెడకుండ నా విగ్రహమునకుఁ గలయవయవము లన్నియు నాయాభాగములకుఁ దగిన వర్ణములతోఁ జిత్రింపఁబడి, యపరబ్రహ్మ యనఁదగునావిగ్రహకారుని సృష్టివైచిత్ర్యమును వెల్లడి సేయుచుండెను. స్త్రీలు ధరింపవలసినయలంకారవిశేషము లెన్ని యున్నవో యన్నియు నావిగ్రహమును నలంకరించి యుండెను. దొండపండువంటిపెదవియు గుంటలుపడిన చక్కనిపాలబుగ్గలును, మందహాసమును స్ఫురింపఁజేయు నాముఖలావణ్యమును, భక్తులతోఁ బ్రత్యక్షముగ నాదేవత మాటాడుచుండినట్టులే తోఁపించుచుండెను.

నలువంకల నఖండముగఁ బ్రకాశించుచుండినదీపములకాంతిలో నాఁటిరాత్రి గర్భాలయమునందు దేవికట్టెదుట నిలువంబడి రుద్రాంబ తనకొమార్తెలచేతను, కుమార దేవునిచేతను నాదేవతకు మ్రొక్కించి, భక్తిపూర్వకములగు పెక్కుమ్రొక్కులు తానును మ్రొక్కి, ముకుళితకరకమలయై, నిమీలితలోచనయై, "ఓజగదంబా! కాత్యాయనీ! భగ వతీ! ఏకవీరా! నిరంతరమును నీ చరణారవిందధ్యానామృతపానానందుల మగుమమ్ముఁ గృతార్థుల నొనర్పుము. నాకుమారికలకుఁ బుత్రసంతానభాగ్యమును గటాక్షించి మావంశము నుద్ధరింపుము. మాయాంధ్రరాష్ట్రపీఠమున నుచిత మగు పుత్రభిక్షమును బెట్టి నిశ్శత్రుకముగ మాసామ్రాజ్యమును బరిపాలింపుము" అని పలువిధములఁ బ్రార్థించెను. అట్లు ప్రార్థించి, పిమ్మట రుద్రాంబ వారందఱితో నాలయమునకుఁ బ్రదక్షిణ మొనర్పవలయు నని వెలుపలికి వచ్చి ద్వారము కడ వేచియున్న తనపరివారములోని కొందఱు భటులను వెనుక నిడుకొని ప్రక్కనుండి బయలుదేరెను. కరదీపికలతో మొదట నిరువురురాజభటులునడచుచుండ, వారివెనుక రుద్రాంబయు, నామెవెనుక నుమ్మక్కయుఁ బ్రక్కనే రుయ్యమ్మయుఁ బిట్టచివరఁ గొంతపరివారముతోఁ గుమారదేవుఁడును నడచు చుండిరి. అప్పు డుమ్మక్క తనవెనుక నున్న కుమారదేవునిఁ జూచి, "కుమారదేవా! నీమనోరథమును నెఱవేర్పు మని యేకవీరను భక్తిపూర్వకముగఁ బ్రార్థించితివా లేదా!"

అని పరిహాసింప నది విని రుయ్యమ్మ "అక్కా! ఇప్పుడే కాదు. మనోరథసిద్ధికై కుమార దేవుఁ డేకవీర నాశ్రయించి చాలకాలమైనది." అని వానిని మఱింత హెచ్చరించెను. ఆమాటలకుఁ బ్రత్యుత్తర మీయక కుమారదేవుఁడు తనలోఁ దానే చిఱునవ్వు నవ్వు కొని యూరకుండెను. ఇట్టిపరిహాసప్రసంగములతోఁ బ్రదక్షిణము సేయుచుఁ, దుదకు వారందఱు నొకసన్నని సందులోనుండి పోవలసివచ్చినది.

ఏకవీరాలయమునకును దానివెనుక నున్న కేశవస్వామియాలయమునకును మధ్య నున్నసందు కడుసన్ననిదై యిద్దరుమనుష్యులు విశాలముగా నడచుటకుఁ దగినంతవెడల్పు మాత్రము కలిగి యుండెను. రమారమి నలువదిగజములపొడవుగల యాసందు నతిక్ర మించినఁ గాని మరల విశాల మగు ప్రదేశము గోచరము గాదు. పగటివేళలయందు బిచ్చకాండ్రు కొందఱాసందు నాశ్రయించి, ప్రదక్షిణము సేయుటకై వచ్చుభక్తుల నడ్డగించి, తమకు బిచ్చము పెట్టువఱకు మార్గమీయక యల్లరిపెట్టుచుందురు. రాత్రు లయందా ప్రక్క జనసంచార మంతగా నుండనందున నాప్రాంతమునందు దీపములు పెట్టవలసినయవసరము లేదు. ముందు కరదీపికలతో నడచుచుండిన రాజభటుల వెనుక రుద్రాంబ పోవుచుఁ దనపరిచార మంతటితో నాసందులోఁ బ్రవేశించెను. అట్లు ప్రవేశించి కొన్నియడుగులదూరము నడచినంతనే యాకస్మికముగ నాసందులో ముందు వైపునుండి భయంకరాకారులగుకొందఱు ధూర్తు లాయుధపాణులై పరుగుపరుగున వచ్చి తటాలున నాయిరువురిరాజభటులపైఁ బడి, తళతళ లాడుఖడ్గములతోఁ ద్రుళ్లిపడునట్లు వారిశిరములను రెప్పపాటున ఖండించి పాఱవేసి, రుద్రమదేవిని బట్టుకొని యీడ్చుకొని పోవు చుండిరి.

---

(5)

## 9-వ ప్రకరణము

### ఆపద

క్రిందటిప్రకరణములో వర్ణించినప్రకార మాకస్మికముగ శత్రువులు పైఁబడి రుద్రమదేవి నీడ్చుకొని పోవుచుండ, నిరాయుధయై యుండుటచే నామె యేమియుఁ జేయలేక పోయెను. వెనుక నున్నకుమారదేవుఁడును దత్పరివారమును బరుగుపరుగున వచ్చి శత్రువులపైఁ బడుట కాసన్ననిసందులో నవకాశము కలుగలేదు. రుద్రమదేవి పెద్దపెట్టునఁ గేకలు వేయుచుఁ గుమారదేవుని బరివారమును బిల్చుచుండ, నాధూర్తులు మాటాడకుండ నామెదౌడలు దగ్గరగా నొక్కి, తల్లిదురవస్థకై యేడ్చుచుండిన కుమార్తె లనుగూడఁ బట్టుకొనిరి. ఇంతలోఁ గుమారదేవుఁడును రాజభటులునుగూడఁ బ్రక్క

నున్న కేశవస్వామి యాలయము చుట్టు తిరిగి, పరుగుపరుగున వచ్చి సందుమొగనున్న ధూర్తకోటిపైఁ బడిరి. తోడనే యప్పు డిరుతెగలవారికిని బోరు ఘోరముగా జరుగ నారంభించెను. కుమారవిక్రముం డగుకుమారదేవుఁడు నిజపాణితలము నలంకరించిన చండాసిచే నాచండాలుర నెల్ల ఖండించుచు, "భయము లేదు. భయము లేదు. ధైర్యముతో నుండుఁడు" అని రుద్రమదేవినిఁ దత్కుమారికలను హెచ్చరించెను. ఆవీరాగ్రేసరునికంఠస్వరము వినినంతనే, యెక్కుడిలేని ధైర్యము వహించి, యాదుష్టులమధ్యఁ జిక్కియున్న దేవి వానికొఱ కిటునటుఁ జూడసాగెను. అట్లు చూచుచుండఁగనే నిజఖడ్గకలాకౌశలమునఁ దనకడ్డముగ నున్న శత్రువీరులఁ గడతేర్చుచు నిమిషమాత్రములోఁ గుమారదేవుఁ డామెకు బ్రత్యక్షమై "దేవీ! నీసేవకుఁ డిచ్చటనే యున్నాఁడు. కంఠమునఁ బ్రాణ మున్నంతవఱకు నీ కెట్టియాపదయుఁ రానీయఁడు." అని బిగ్గరఁగఁ బలుకుచు వెంటనే యావీరాగ్రేసరుఁడు రుద్రాంబ రెండుచేతులును వెనుకకు విఱిచికట్టి పట్టుకొనిన జైనవిగ్రహమును రెప్పపట్టున రెండుతునియలుగాఁ దెగనఱికి వానిచేతిలో నున్న కరవాలమును గైకొని, తటాలున దేవి కందిచ్చెను. నిరాయుధ యగుటయే కాక, యస్వాధీనహస్తయై యంతవఱకు వెలవెలఁబోవుచుండిన యాదీనురాలు కుమారదేవుని యనుగ్రహమ్మున ఖడ్గపాణియగుటయే తడవుగఁ దనచుట్టు నావరించిన శత్రుసేనపై దుమికి, యావీరనారి, తాను నిల్చిన ప్రదేశము నిశ్శత్రుకముగాఁ జేసికొనియెను. అంతతో విడువక తటాలున సందులోఁ బ్రవేశించి, యచ్చటఁ దనకుమార్తెలను బట్టుకొనిన ధూర్తవర్తనుల నెల్ల మహాకాళియై వారి నంత మొనరించి, కొందఱు రాజభటులసాహాయ్యముతో వారి నిరువురను క్షేమముగా గుడారములోనికిఁ బంపివేసి, యాశూరకాంత మరల రంగస్థలమునఁ బ్రవేశించెను.

అతిస్వల్పకాలముననే యీవైపరీత్యము నలువంకల వ్యాపించెను. గుడారములందును దదితరప్రదేశములయందును నాఁటిరాత్రి స్వేచ్ఛగాసంచరించుచుండిన పరివారజనులందఱును దద్వార్త వినుటయే తడవుగ బిరబిర నాయుధపాణులై పరుగుపరుగున వచ్చి రుద్రాంబను గలిసికొనిరి. దేవి కాపద జనించిన దని విని తక్షణము తమతమయంగళ్లు మూసివేసి, చేపాటికఱ్ఱలతో వర్తకులును, జేగంటలతోఁ బూజారులును, దటాలునఁ జేతికి దొరకిన సాధనములను గైకొని ధైర్యవంతు లగుకొందఱు గ్రామస్థులును, గుంపుగుంపులుగ వచ్చి యాప్రదేశము నలంకరించిరి. ముసుఁగులో గ్రుద్దులాటవలె నాకటికి చీఁకటిలో నాఁటిరాత్రి ఘోరసంగ్రామ మారంభించి, యిరుతెగలవారు వందలకొలఁది గడతేరుచుండిరి. ఆసందుప్రక్క నున్న ప్రదేశ మంతయుఁ బ్రాకారకుడ్యమువఱకు మిక్కిలి విశాలమై యుద్ధరంగముగా నుండుటకనుకూలముగనే యుండెను. తగిన రణ

కౌశలము గాని, తగినసాధనసామగ్రి గాని, లేకపోయినను, కేవల భక్తివిశ్వాసములచే దేవికిఁ దోడ్పడవచ్చిన గ్రామస్థులెల్లరు రణనిపుణు లగు శత్రువుల యార్భాటముల కోర్వలేక, కొలఁది నిముసములలోనే యనేకులు హతులై హతశేషులు పలాయితు లైరి. వడగండ్లవానవలె నెడతెఱపి లేనియమ్ముల వాన వర్షించుచుండుటచేఁ బరివార మంతయు నల్లకల్లోలమై కుమారదేవ రుద్రాంబలవెనుక శరణుఁ జొచ్చెను. దక్షయాగవిధ్వంసము నాఁటి వీరభద్రునివలె భయంకరాకారుఁడై కన్నులనుండి వెడలు క్రోధానలజ్వాలలు, శత్రుకోటిపైఁ బ్రజ్వలింపఁజేయుచుఁ, బరివారమును బురికొల్పుచు, దేవికి ధైర్యము గలుపుచుఁ, గుమారదేవుఁ డప్పు డత్యద్భుతముగ నొక్కమారుచెలరేగి, రిపుసేనపైఁబడి కదళీకాంతారవిచ్ఛేదముగతి ఛేదించి, శత్రుతతిని బీనుంగులపెంట గావించి, క్షణమాత్రమున నారణరంగము భూతబేతాళాద్యుగ్రపిశాచగణములకు నాట్యశాలగా నొనర్చెను. లేళ్లమందలపై నమందరయమ్మున లంఘించుకొదమసింగము తెఱంగున నారాచసింగ మట్టు విజృంభించినంతనే తదార్భాటమును భరింపలేక ఝంఝామారుతవిదళితమేఘమండలము వలె గతశేష మగురిపుసేన నలువంకలకుఁ జెదరి, హాహాకారములతో "మురారిదేవా! హరిహరదేవా!" అని కేకలు వేయసాగెను. తోడనే తద్వాహినీపతులగుహరిహరదేవ మురారిదేవు లిరువురును జెదరినసేనలఁ బ్రోవుసేసికొని ప్రాణములకుఁ దెగించి, పైఁబడి యాక్రోధావేశమున దేవి పరివారమును మూఁడువంతులు నాశనము గావించిరి. మరల రుద్రమదేవినిఁ బట్టుకొనవలయునని కొందఱుధూర్తు లావంకకుఁ బరువెత్తుచుండఁ గుమారదేవుఁడు వారల నడ్డగించి, శత్రువులకుఁ గాలపాశమువంటి తనదక్షిణబాహుదండమును బైకెత్తినంతనే కోపాతిశయమున వానికంఠమునకు గుఱి చూచి, మురారిదేవుఁడు తన ఖడ్గమును రివ్వున వానిపైకి విసరెను; కాని యాకరవాలము గుఱితప్పి, కంఠముప్రక్కనుండి వానికుడిభుజమును సగమువఱకుఁ దెగనఱికి, పాపము మనకుమారదేవునిఁ బ్రాణమాత్రావశిష్టు నొనర్చెను. గాయమునుండి ప్రవహించు రుధిరధారలతోడనే, తనశక్తి యంతయు నశింప గద్గదస్వరములో "దేవీ! నాపని ముగిసినది. నీవు జాగ్రత్త" అని యఱచుచు నేలపైఁబడి మూర్ఛిల్లెను.

అయ్యాక్రందనధ్వని చెవులఁ బడినంతనే రుద్రాంబ కెవ్వునఁ గేకవేసి, శరీరమును మఱచి, మహిషాసురమర్దనివలె శత్రుచ్ఛేదన మొనర్చుచుఁ దన మేనల్లునకుఁ దోడ్పడవలె నని ముందునకుఁ ద్రోవచేసికొనఁ జొచ్చెను; కాని పాప మింకెక్కడిత్రోవ? ఖడ్గమును గిరగిరఁ ద్రిప్పుచు నామె నాలుగైదడుగులిడునరికి మిక్కిలిదృఢమగు నొకచేపాటి కఱ్ఱతో నామె మోకాళ్లపై బలవత్తర మగునొకదెబ్బ తగుల నావీరనారి చప్పున నేలఁ బలికిలఁబడి "హరహరా!" యని నిట్టూర్పులు విడువఁ జొచ్చెను. తోడనే హరిహర

దేవుఁడు "మేలు మురారిదేవా! మేలు! ఇదియే సమయము. కరచరణములు బంధించి యామెను ప్రాణములతోఁ గూడ మన ప్రభువున కప్పగింతము" అని కేకలు వేయుచుఁ జెప్పెను. అట్లు చెప్పుటయె తడవుగ హరిహరునిశిరముపై వెనుకనుండి యాకస్మికముగ, పిడుగువంటి యొకమహాఘాతము పడినంతనే, యీ మందభాగ్యుఁడు కపాలము పగిలి, "చచ్చితిని. చచ్చితిని. మురారిదేవా! రక్షింపుము" అని యఱచుచు నేలపైఁ బడి కొట్టుకొనసాగెను.

ఆయుపద్రవ మెట్టిదియో యని మురారిదేవుఁడు తనపరివారముతో నించుక కదలినంతనే, యేనుఁగుతుండములవంటి యినుపదండములతో నుద్దండబలశాలు రగు కొందఱువీరాగ్రేసరులతో నొకనూతనపురుషుఁ డాశత్రుసేనపైఁ బడి, యడ్డమువచ్చిన వారికెల్లఁ గపాలమోక్షప్రాప్తి కలిగింప నారంభించెను. ఒక్కొక్క యినుపదండపు ప్రేఁతతో గుంపుగుంపులుగాఁ గూడినశత్రువు లెల్లరు రూపురేఖలు గానరాకుండఁ జిలికి ముద్దలై విపరీతముగ నాశనము గావింపఁబడుచుండ నావైపరీత్యమునకు భయపడి హతశేషు లెల్లరుఁ దక్షిణమునఁ గాందిశీకులై మాయమైరి. ఆనూతనవీరాగ్రేసరుఁడు వారిని వెంట దఱుముచు, నెంతవెదకినను, మురారిదేవుఁడు మచ్చుటకైనను గానరాఁ డయ్యె. ఆవింత చూచి, రుద్రమదేవి బ్రహ్మానందభరితయై "నాయనా! కుమారదేవుఁడు, కుమారదేవుఁడు, చూడు, తండ్రీ! చూడు!" అని కేకలు వేయసాగెను. కాని యా యల్లకల్లోలములో నాకేకలు వానిచెవిని బడలేదు. అందుచే దేవి తానే మెల్లఁగ లేచి, కుమారదేవునికై యారణస్థల మంతయు నన్వేషింప నారంభించెను; కాని కుమారదేవుఁ డెచ్చట నామె దృష్టిపథమునఁ బడలేదు. శత్రులను గొంతవఱకు వెంటఁ దఱిమి యానూతనవీరుఁడు తనపరివారముతో మరల వచ్చి దేవినిఁ గలసికొనెను. వారందఱుఁ గూడి తదాలయప్రాంతమునఁ గుమారదేవునకై మిక్కిలి శ్రమపడిరి. ఆశ్రమ వ్యర్థమైనందున దేవిసంతాపమునకు మేరలేకపోయెను.

---

## 10-వ ప్రకరణము

### ప్రయాణప్రయత్నము

మధురానగరమున కుత్తరముగాఁ గావేరీనదీప్రాంతస్థితారణ్యములలో నొకపర్వత ప్రదేశమునఁ గల తాటియాకులయింటి యరుగులపైఁ గూర్చుండి, యొకనాటియుదయమునఁ గొందఱుకాపులు తమలోఁ దాము మాటాడుకొనుచుండిరి. ఆయింటిముందరఁ గల చింతచెట్లమధ్య నుండియే, మధురానగరిబాటసారులు రాకపోకలు జరుపుచుందురు. ఆ

ప్రాంతమునం దచ్చటచ్చటఁ గలకొండగుట్టలవలనఁ దురంగారూఢులును బాదచారులు మాత్రమే యామార్గమునుండి వచ్చుచుఁ బోవుచుండిరి. బండిప్రయాణము సేయువారికి వేఱొకమార్గ మేర్పడియున్నది. ఏగ్రామమున కేఁగువారికైనను నామార్గము మిక్కిలి చేరువ యగుటచే, మార్గమధ్యమున నచ్చటచ్చటఁ గొండగట్టు లున్నను సాధారణముగ బాటసారు లాదారినే ప్రయాణ మొనర్చుచుందురు.

మీఁద వివరించినట్టు లామార్గమునకుఁ బ్రక్కనే కట్టఁబడిన యిల్లు మంటిగోడలును దాటియాకులనేఁతయుం లేకుండినయెడల నొకపెద్ద దివాణ మని చెప్పవచ్చును; కాని, యా యింటిచుట్టును బ్రాకారకుడ్యప్రాయముగఁ బెరిఁగిన కొండగుట్టలును, ఆ కొండగుట్టలమధ్య నత్యున్నతముగ బలిసిన వెదురు డొంకలును దద్గృహావరణమును లేశమును బైకిఁ గానరానీయక, మార్గస్థులకంటికి నొకచిన్నపాకవలె మాత్రము తోఁపించుచుండెను. లోనఁ బ్రవేశించి పరిశీలించినయెడలఁ దదంతర్భాగమునఁ బెద్దపెద్దచావడులును, ననేకమంటపములును, లెక్కలేనన్ని గదులును, జూపఱులకు మిక్కిలి యక్కజమును గల్గించును. ఇవి యన్నియుం దాఁటినవెనుక, చిట్టచివర రమారమి రెండువందలగుఱ్ఱములతో నొకగుఱ్ఱపుశాలయుం, దానిప్రక్కనే, యపరిమిత మగు యుద్ధసామగ్రితో నిండిన యొక యాయుధాగారమును, మఱింత యాశ్చర్యమును బుట్టించును. ఆ గృహాంతర్భాగ మించుమించుగ నైదాఱువందలు సంఖ్యగల వీరపురుషుల కాధారమై యుండుచుండెను. అన్నిగుఱ్ఱములతోడను నంతటియుద్ధ సామగ్రితోడను, నా వీరులందఱు నా పర్వతప్రాంతమునఁ బ్రమాదకర మగు నా తాటియాకులయింటిలో నేల నివసించుచుండిరో యని చదువరులు ప్రశ్నింపవచ్చును; కాని యావీరుల కా గృహము, స్వకార్యార్థనిర్మిత తాత్కాలికగృహము గాని, శాశ్వతావాసము గాదు. అదియునుగాక, యందలివీరవరు లెల్లరు నెలకు నాలుగైదుదినములు తప్పఁ దక్కిన దినములలోఁ దమ వాహనములతోడను, యుద్ధసామగ్రులతోడను నెచ్చటికో పోయి తిరుగుచునే యుందురు.

ఆ నాఁటియుదయమున నా యింటి యరుఁగుపైఁ గూర్చుండి సంభాషించుచుండిన కాపు లెల్లరును రణనిపుణు లగువీరభటులే. ఇరువదిదినముల క్రిందట వారందఱును రణసన్నద్ధులై, తమతమ సాధనసామగ్రులతో బయలుదేరి యెచ్చటికో పోయి, రెండు దినముల క్రిందటనే తిరిగి వచ్చి యిల్లు చేరుకొనిరి. ఇల్లు చేరినంతనే తమ ప్రభు వొకటి రెండుదినములలో వచ్చెద నని చెప్పి మరల నెచ్చటికో వెడలిపోయినందున నాఁటి యుదయమున వారందఱును వానికొఱకే యెదురుచూచుచు, వానినిఁ గూర్చియే ముచ్చ

టించుకొను చుండిరి. ఇంతలో జాముప్రొద్దెక్కినది. అప్పు డా పరివారములోని యొక
పురుషుడు తనచెంత నున్నవానినిఁ జూచుచు, "రంగా! మన వెంకన్న యుదయము
నుండియు నెచ్చటను గానరాఁడేమి!" యని ప్రశ్నించెను. తోడనే రంగఁడు వాని
వీక్షించి, "కొంతదూరము పోయి, మన ప్రభువు వచ్చుచుండు నేమో చూచి రమ్మని
వెంకన్నను బంపించితిని. వాఁడుగూడ నెందుచేతనో యింకను దిరిగి రాలేదు." అని
బదులు చెప్పి యూరకుండెను. ఆపరివారమున కంతకును రంగఁడే నాయకుఁడుగా నియ
మింపఁబడినందునఁ బ్రభువు లేనప్పు డాతఁడే చేయవలసినయేర్పాటు లన్నియుఁ జేయు
చుండును. వా రట్లు మాటాడుకొనుచుండ నరుగుచివరఁ గూర్చుండి ప్రక్క కతిదీక్షతో
నిదానించి చూచుచున్న యొకపురుషుఁడు తటాలున లేచి, "అదిగో మన ప్రభువుగారు
తురంగారూఢులై వచ్చుచున్నారు. వాని ప్రక్కనే నడచుచు నధికప్రసంగప్రీతుఁ డగు
మన శెట్టివెంకన్న యెడతెరపి లేకుండ నెట్లు మాటాడుచున్నాఁడో చూడుఁడు" అని
కేకలు వేసి చెప్పెను. తోడనే వారందఱును ముందునకుఁ బోయి యత్యాతురతతో
నావంకఁ జూడసాగిరి. ఆశ్రితులకుఁ బ్రభుసందర్శన మతిసంభ్రమము గదా?

అప్పుడు చెఱకువిల్లును జిలుకవాహనమును జైకొని భూలోకమున నవతరించిన
లక్ష్మీకుమారునివలె హయారూఢుఁడగు నొక సుందరరాజకుమారుఁ డేతెంచి, తనవాహన
మును డిగి, వారికట్టెదుట నిలువంబడియెను. ఆపాద మస్తకమును దెల్లనిసిపాయిదుస్తులు
ధరించిన యా రాజకుమారున కచ్చటిపరివార మంతయుఁ నమస్కరింప, నాతఁ డేకారణ
ముననో యూరక వెలవెలఁ బోవఁ జొచ్చెను. ఆ పరివార మంతయుఁ నది కనిపెట్టెను గాని,
యందుకుఁ గారణము మాత్ర మూహింపలేదు. ఆ రాజకుమారుని ముఖలక్షణములను గని
పెట్టి, తమప్రభువున కిట్టిక్రొత్తమార్పు లేల సంభవించెనో యని యాశ్చర్యమొందుచు,
రాజకార్యాతురుఁడై మనసు స్వస్థత లేకయుండుటచే శుష్కించి, యిట్టి నూతనముఖ
లక్షణముల వహించె నని మరలఁ దమలోఁ దామె వా రందఱును సమర్థించుకొనిరి.
అధికప్రసంగవినోదుఁ డగు వెంకన్న ముందునకు వచ్చి, "రంగా! రంగా! పాపము మన
ప్రభువుగా రెంతవెదకినను గుమారసింహునిజాడలు గానరాలేదఁట." అని చెప్పుచుండ
రంగఁడు వానిని మందలించి, "వెంకన్నా నిన్ను నేనేమియుఁ నడుగ లేదు. నీయధిక
ప్రసంగ మింకఁ గట్టిపెట్టు. మార్గస్థులెవరైన నీ శెట్టిమాటలు వినినచో మాకొంప మునుఁ
గును." అని పలికి, యా రాజకుమారునిఁ జూచి, "దేవా! ఏ కారణముచేతనో నేఁడు
మీరు మాకుఁ గ్రొత్తపురుషులవలెఁ గన్పించుచున్నారు. మీ నోట నొకమాటయుఁ వెలువడ
కున్నయది. ఇంతకును గుమారసింహునిఁ గూర్చినవిచారమే ప్రబలకారణమని నా యుద్దే
శము. తమరు లోనికి దయచేసినయెడల సావధానముగఁ గూర్చుండి నాలుగుసంగతులు

నాలోచింతము. ఇట్లు విచారించిన నేమిలాభము!" అని పలికి, రంగడు వానిని లోనికిఁ గొనిపోయెను. వారి వెంటనే తక్కినవారును లోనఁ బ్రవేశించి, యా యిరువురిరహస్య ప్రసంగమున కభ్యంతరము గలుగకుండ నెవరిపనిమీఁద వారు చల్లఁగా సాగిపోయిరి.

కొండగుహావలె నెంత నడచినను దరుగని యాయింటిలోఁ బ్రవేశించిపోవుచు, నా రాజకుమారుఁ డిటు నటుఁ జూచుచు వెఱ్ఱివానివలె నటింపసాగెను. ఆ యింటిలో లేశమును బరిచయము లేని క్రొత్తపురుషునివలె నాతఁడు లోనికేఁగుచుండ, ముందుఁ బోవుచున్నరంగఁడు వానినడతను లేశమును గనిపెట్టలేదు. అట్లు పోయిపోయి, సాధారణముగాఁ దన ప్రభువుతో నత్యంతరహస్యములగు రాజకీయవిషయములను బ్రసంగించుటకు వాడుచుండిన యొకచీఁకటిగదిలోఁ బ్రవేశింప, వానివెంటనే యా రాజకుమారుఁడును లోనఁ బ్రవేశించెను. అచ్చట నున్న తాటియాకులచాపపై నిరువురును గూర్చుండి యీ విధముగా సంభాషింపఁ దొడఁగిరి.

"దేవా! కుమారదేవునిఁ దమ రెచ్చటెచ్చట వెదకితిరి? వానిజాడ లేశమైనఁ గానరాలేదా? పాపము శత్రువులు వానిని బలవంతముగఁ జంపివేసియుండరుకదా?"

"రంగా! నే నెచ్చటెచ్చట వెదకితినో, యేయేప్రదేశముల సంచరించితినో యా గతించినసంగతులు న న్నింక నడుగవలదు. కుమారదేవుని కెట్టియాపద సంభవించియుండునో, వానికొఱకు మనము ముందు చేయవలసినయేర్పాటు లేవో బుద్ధిమంతుఁడవు గావున నాలోచించి చెప్పుము."

"స్వామీ! యాకుమారదేవుఁడు బలవంతముగ మధురానగరమునకే కొనిపోఁబడియుండు నని నా నమ్మకము. దేవాలయములలో, రుద్రమదేవి నెదిరించినధూర్తులలో ననేకులు పాండ్యరాజసైనికులే యని మనము వినియుంటిమి కదా? అందుచే జైనాచార్యుఁడు పాండ్యరాజునకు వ్రాసియిచ్చిన ప్రత్యుత్తరము మనకు గొప్పయాధారమై యున్నది. కావున దానిని గైకొని తమరు మధురానగరమునకు——"

"రంగా! జైనాచార్యుఁ డన్న జ్ఞప్తికి వచ్చినది. ఈమధ్య జరిగిన యీ యల్లరులలో నాయుత్తర మేమి చేసితినో జ్ఞాపకము రాకున్నది. నీచెంత కీయలేదా?"

"స్వామీ! ఆ యుత్తరము నాయొద్దనే యున్నది. పోలేదు."

"సరే! సంతోషమే! రంగా! నిజముగా నాకు మతి పోయినది సుమా! నాయాకారము నాకే క్రొత్తగాఁ దోఁచుచుండ మీయందఱికి వింతగా నుండుట యాశ్చ

ర్యమా ? ఏది యెట్లు లయినను నేఁటిమధ్యాహ్నమునసే నేను మధురానగరమునకుఁ ప్రయాణ మయ్యెదను."

"దేవా! కార్యతత్పరతచే మీరు ముందు వెనుక లాలోచింపక తొందరపడుచున్నారు. ఆ యుత్తరములో మనము కొన్నిసంగతులు సవరణచేసి, యత్యవసరము లగు మఱి కొన్ని సంగతులను గూర్చి దీర్ఘముగా నాలోచింప వలసియున్నది. అందుచే సావకాశముగా మీరు రేపుదయమున బయలుదేఱినచో సాయంకాలమునకు మధురానగరమును జేరుకొనఁగలరు."

"రంగా! అట్లు లైనయెడల మధ్యాహ్నము భోజనానంతరమునఁ గూర్చుండి మన మన్ని సంగతులు జాగ్రత్తగా విమర్శింతము."

## 11-వ ప్రకరణము

### పాండ్యరాజు

మనకథాకాలమునాఁటికి దక్షిణహిందూదేశమునఁ గల రాజ్యములలోఁ బాండ్య రాజ్యమే మిక్కిలి ప్రబలమైనది. కాకతీయులపైఁ గక్ష వహించినవారిలోఁ బాండ్య రాజులే ప్రముఖులు. మనపురాణములలోఁ బ్రసిద్ధికెక్కిన మధురానగరమే యీ రాజ్యమునకు రాజధాని. రుద్రమదేవినాఁడే కాక, చాలకాలమునుండియు నీ వంశమువారికిఁ బాండ్యరాజులు ప్రబలశత్రువులై యుండుచుండిరి. గణపతిదేవుని పరిపాలనమునం దీ రెండువంశములవారికిని గలశత్రుత్వము మఱింత యధికమై ప్రబలినది. ఒకప్పుడు పాండ్యరాజులు మొదలగు దాక్షిణాత్యప్రభువులందఱును గూడి, కాంచీపురమున నున్న తెలుఁగుచోడులను బాఱఁదోలి యాపట్టణము నాక్రమించుకొన నిరాధారు లగుచోడ రాజులు గణపతిదేవుని శరణు వేఁడుకొనిరి. అప్పు డాచక్రవర్తి యపరిమితవాహినీయుతుఁడై దక్షిణదేశముపై దండెత్తివచ్చి, దాక్షిణాత్యుల నెల్ల రణరంగమున శిక్షించి, కాంచీపురమును మరలఁ జోడరాజుల కిప్పించెను. విక్రమసింహపుర మనునామాంతరము గల నెల్లూరు నాక్రమించుటకై జోడరాజు లెల్లరుఁ దమలోఁ దాము పోరాడుచు, నొక సమువారు పాండ్యరాజులసాహాయ్యము కోరినందున జటవర్మ సుందరపాండ్యమహా రాజు, మనుమసిద్ధితండ్రి యగుతిక్క రాజుమరణానంతరమున ననేకపర్యాయములు కాంచీపురమును విక్రమసింహపురమును నాక్రమించి, యాయాస్థలములయందుఁ దనయధికారమును స్థిరముగా నెలకొల్పుటకై పెక్కుప్రయత్నము లాచరించెను. కాని, రెండవపక్షము

వా రగుచోడరాజులప్రార్థనముపై గణపతిదేవుఁడు ప్రతిపర్యాయమును పాండ్య రాజు నోడించుచు నెల్లూరునుండియుఁ గాంచీపురమునుండియు వానిని పారఁదోలుచు వచ్చెను.

పైని వివరించిన కారణములచేఁ గాకతీయపాండ్యరాజులకుఁ దరుచుగాఁ బోరాట ములు జరుగుచునే యుండెను. అందు వైరిజనభీకరుం డగుగణపతిదేవుఁడు గతించుటయు, నాంధ్రరాజ్యపీఠముపై నొకసామాన్యస్త్రీ యగురుద్రాంబ యధివసించుటయు, ననేక మాండలికప్రభువు లామెపరిపాలనమునకు సమ్మతింపక విరోధముగాఁ బనిసేయుచుండు టయు, సంభవించినందున జటవర్మ బ్రహ్మానందభరితుఁడై యదియే తగినయదను అని తన శత్రుత్వమును దీర్చుకొనుటకు విశ్వప్రయత్న మొనర్పసాగెను.

ఒకనాఁటిమధ్యాహ్నమునఁ బాండ్యరాజు, తన కార్యస్థానమునందు నొక పచ్చని పట్టుసోఫాపైఁ గూర్చుండి, క్రోధారుణవదనుఁడై దీర్ఘాలోచన మొనర్చుచుండెను. అప్పు డతఁడు సామాన్యమగు తెల్లనియంగీయును, తెల్లనివస్త్రమును మాత్రము ధరించి యుండెను. గుండెలవఱకు వ్రేలాడుచుండిన చిక్కనిగడ్డమును, బొడవైనకోరమీసమును, పెద్దతలకట్టును, నాతఁడు వార్ధకారంభుఁడని చెప్పుచున్నవి. అజానుబాహుఁడే యైనను గడు నల్లనిచాయ గలవానిశరీరమున కందుకుఁ దగిన లావుమాత్రము లేదు. ఆచావడిలో నాతఁడు కూర్చుండినయాసనమునకుఁ గట్టెదుటనే యున్న స్తంభమునకుఁ జేరఁబడి, యొక పురుషుఁడు భయకంపితశరీరుఁడై చేతులు జోడించి నిలువఁబడి యుండెను. పలువిధము లగునాసనములతోడను రత్నపుఁగంబళులతోడను, చిత్రపటములతోడను గడుమనోహర ముగా నున్నయాచావడిలో వారిరువురును దప్ప మఱెవ్వా రెవ్వరును లేరు. కొంత సేపువరకు నట్లు జటవర్మ తనలో దీర్ఘాలోచన మొనర్చి యొకనిట్టూర్పు విడిచి తన యెదుటనున్న పురుషుని, గ్రూరదృష్టితోఁ జూచుచు "ఓరీ! మూర్ఖా! నీవింకను నాయెదు టనే నిలిచియున్నావా? చాలుచాలు! నీప్రతాపమునకు సంతసించితిని. ఇంకనిచ్చటనుండి దయచేయవచ్చును. మీయట్టి వట్టియప్రయోజకులను నమ్ముకొని నేనుమిక్కిలి మోసపోయి తిని. నేను దలపెట్టినకార్యములన్నియు నిట్టులే వ్యర్థములై పోవుచున్నవి. ఛీ! పశువా! హరిహరదేవునివలెనీవుఁగూడఁ గడతేరియుండినచో నాకీవిచారము లేకపోయియుండును. ఏమిమహాకార్యము చేసితివని ప్రాణములతో నాయెదుటకు రాఁగలిగితివి? కుమారదేవునిఁ బట్టి తెచ్చుటయా? ఇంతకన్నఁ జేతఁ జిక్కిన యారుద్రమదేవినిఁ బట్టి తెచ్చినయెడల నే నెంత సంతసించియుందును? నాకార్యక్రమ మంతయు నెంత జయప్రదముగఁ గొన సాగియుండును? నిరంతరమును దనతపస్సంతయు నాకొఱకే ధారవోయుచున్న యా శైవాచార్యుఁ డెంత యుబ్బొంగి యుండును? ఈసంగతి వినినచో నాతఁడు నాయం

దెట్టి విరక్తిభావము వహించునో యని మిక్కిలి సందేహించుచున్నాను. వానికడకు నా యుత్తరము గొనిపోయిన యాహవమల్లుఁడుఁ గూడ నేఁటివరకుఁ దిరిగిరాలేదు. ఓరి నిర్భాగ్యుఁడా! నాయెదుట నుండకపో! నీ వదృష్టవంతుఁడ వగుటచే నేఁడు నీప్రాణములు దక్కినవి. చెరలో నున్నకుమారదేవునికడకుఁబోయి నేను చెప్పినట్లు వానికి బోధింపుము. రెండుమూఁడుదినములలో నెట్లు లైన వానిని నీ వొప్పింపలేనియెడల నీయుద్యోగము గాని నీప్రాణములు గాని నీకు దక్కవు. పో! ఇచ్చట నుండకు."

అని కఠినముగాఁ బలుక మురారిదేవుఁ డచ్చట నుండక సెలవుఁగైకొని మెల్లఁగ నావలకు సాగిపోయెను. తరువాత జటవర్మ కొన్నినిముసములవరకు నచ్చటనే చింతానిమగ్నుఁడై కూర్చుండి యంతఃపురమున కేఁగవలయునని కాఁబోలు మెల్లఁగా లేచెను. లేచినంతనే పరుగుపరుగున నొకసేవకుఁ డచ్చటికరుదెంచి వినయవిధేయుండై నమస్కరించి "దేవా! జైనాచార్యుని ప్రత్యుత్తరముఁ గొని యొకరాజకుమారుఁడు వచ్చినాఁడు. సెలవైనచో"—అని చెప్పుచుండ నాతురతతో నారాజు, "ఏమేమి? ఒకరాజకుమారుఁడా వచ్చినాఁడు? ఎవఁడా రాజకుమారుఁడు? మనయాహవమల్లుఁడు రాలేదా? సరే! వెంటనే వాని నిచ్చటకుఁ దోడ్కొని రమ్ము" అని పలికి, యతఁడు మరలఁ దనయాసనముపైఁ గూర్చుండెను. ప్రభువాజ్ఞ ననుసరించి యాసేవకుఁడు వెంటనే పోయి, కొంతసేపున కొకనూతనపురుషునితో మరల నచ్చటఁ బ్రత్యక్షమయ్యెను. తోడనే యాసుందరాకారునిసహజలావణ్యాతిశయమున కచ్చెరువొందుచు, వెఱ్ఱివానివలె వాని నాపాదమస్తకము రెప్పవ్రాల్పక చూచుచు, నాతఁడు మ్రొక్కిన మ్రొక్కు లందుకొనుచు, నారాజకుమారుఁ డొసంగిన యుత్తరమును గైకొని పాండ్యరాజు తనలో నిట్లు చదువుకొన సాగెను.

"శ్రీరస్తు చిరంజీవియైన జటవర్మసుందర పాండ్యమహారాజును బుత్రపౌత్రాభివృద్ధియుం, మనోరథసిద్ధియుం గలుగునట్లు దీవించి, జైనాచార్యుఁడు వ్రాసినసంగతు లేమనఁగా—

కుమారా!

నీవు వ్రాసినయుత్తరమును జూచి, కార్యక్రమమునందు నీకుఁ గల పట్టుదలకెఱింగి బ్రహ్మానందభరితుఁడ నైనాఁడను. నీయుత్తరమును బ్రతాపదేవునకుఁ గూడ వినిపించి, నీవు చెప్పినసంగతు లన్నియు వానికిఁ జక్కఁగా బోధించితిని. రుద్రమదేవి తీర్థయాత్రకు బయలుదేఱినసంగతి వానియుత్తరమువలననే నాకుఁ దెలిసినది. ఇందుతోఁ బ్రతాపదేవుఁడు నీకుఁ గూడ నీవృత్తాంతము పంపినాఁడఁట. ఈవార్త వినినతోడనే నాయొద్దనున్న జైనభటులను యుద్ధసన్నాహముల నొనర్చి పంపించితిని. [illegible]గొంత

సైన్యమును బంపియుండు పని తలంచెదను. మన యదృష్టవశమున నీప్రయాణసందర్భములో రుద్రమదేవి మనకుఁ జిక్కినయెడల నన్నివిధముల నదృష్టవంతుల మగుదుము. ఏది యెట్లయినను నిశ్చితకార్యక్రమమునందు లేశమైనను వెనుదీయక యింతకన్న నెక్కుడు పట్టుదలతోఁ బనిసేయవలయునని నాయుద్దేశము. ఆరంభించినకార్యమునకు నడుమనడుమ నెన్నివిఘ్నములు వచ్చుచుండినను గార్యవేదులు తమపూనిక లేశమును విడిచిపెట్టరు. ఈసంగతి బుద్ధిమంతుఁడ వగు నీ వెఱుఁగనిది కాదు. కాకతీయవంశమును రూపుమాపి, యాంధ్రరాష్ట్రవైభవమును మీరందఱు ననుభవించుచుండఁ గన్నులారఁ జూచుభాగ్యము నాకెన్నఁడు కలుగునో తెలియదు.

ఏకశిలానగరమున యుద్ధప్రయత్నము లేమియు నిప్పటికి జరుగలేదు. ఒకప్పుడు దేవి ప్రాణముతో మరల నింటఁ జేరుకొనఁగల్గినయెడ నేమైన జరుగవచ్చును. దెలిసికొన వలసినసంగతు లన్నియుఁ గ్రమక్రమముగాఁ దెలిసికొని నీ పేర వ్రాసెదను. మనమిప్పుడు లోలోపుల సర్వవిధములఁ బ్రయత్నించుటతప్ప తొందరపడవలసిన యవసరము లేదు. సమయము వచ్చినప్పుడు దేవగిరిసైన్యములుమాత్రము మనలోఁ గలియునట్లు తగిన యేర్పాటు గావింపవలయును. నీయుత్తరము దెచ్చినయాహావమల్లుఁడు మిక్కిలి చాకచక్యము గలవాఁ డగుటచేఁ ద్రిపురాంతకదేవుని వెదకి పట్టుకొనుటయందును, నాయొద్ద నున్నజైనవీరులకు యుద్ధక్రమము నేర్చుటయందును, వానిని నేను నియోగించితిని గావునఁ గొన్ని దినములవరకు నాతఁడు నాయొద్దనే యుండును. ఈయుత్తరము నీకిచ్చిన దేవదేవుఁడు నాముద్దుశిష్యుఁడు. మిక్కిలి పరాక్రమశాలి. ఉన్నతవంశసంభూతుఁ డగుటచే నతిసుకుమారుఁడు. వీని నతిగౌరవముతో నాదరించుచు నిష్టము వచ్చినంత కాలమున చెంతనుంచుకొని, పిదప నాయొద్దకుఁ బంపివేయవచ్చును. భగవంతుఁడు మన ప్రయత్నములను ద్వరలోనే కొనసాగించి జయ మొసంగుఁగాక.

గ్రహించవలెను.

ఇట్లు,

జైనాచార్యుఁడు,"

## 12-వ ప్రకరణము

### నాకది యేచాలును

ఉత్తరమంతయుం జూచినతరువాత నందలి యొకటిరెండుసంగతులకు మాత్రము విచారించి, పాండ్యరాజు తక్కినయంశములకు మిక్కిలి యానందించి, కొంతసేపు తనలో నేమో యాలోచించి యాలోచించి, రెండుమూఁడుసారులు శిరమును బంకించి తన దృష్టి యంతయుం నెదుటనున్న దేవదేవునిపైఁ బ్రసరింపఁజేయ నారంభించెను. ఆదీర్ఘ దృష్టి యొక్కచోటనే నిలువక, యారాజకుమారునిశరీరము నాపాదమస్తకమును బరీక్షింపసాగెను. పరీక్షించుచున్న కొలఁది నారాజు ముఖలక్షణములు క్షణమున కొక మార్పుచెందుచు వచ్చెను. ఆమార్పులయం దవ్యాజానుగ్రహము ప్రవహించు చుండెను. ఆ యనుగ్రహప్రవాహమునందలి యుత్తుంగమోహాతరంగము లారాజ కుమారుని వదనమండలముపై కుప్పించుచుండెను. ఆదివ్యమంగళవిగ్రహమును దనివి తీరఁ గనుఁగొనఁ జూచి చూచి, తదానందాతిశయమునఁ గొంతవఱకు మైమఱచి, యను రాగస్ఫురితము లగుముద్దుపల్కులతో "దేవ దేవా! ఈయాసనముపై నధివసింపుము. నీ వాచార్యులవారి ముద్దుశిష్యుఁడవఁట. ఉన్నతవంశసంభూతుఁడవఁట. మిక్కిలి పరాక్రమవంతుఁడవఁట. ఇన్నిసద్గుణములుగల నీ వెచ్చటనైనను గౌరవార్హుఁడవే! ఇన్నింటి కన్నను సౌందర్యాకర మగునీయాకారమునం దొకవిధ మైనయాకర్షణశక్తి యున్నది. అందుచే లోకసామాన్యపురుషులలో నీవు గణింపఁబడవు. లావణ్యవతుల మని విఱ్ఱవీగు రంభామేనకాతిలోత్తమాద్యఖిలగీర్వాణకీరవాణుల గర్వ మడంగించు నొకజగన్మోహినిని సృజింప నెంచి, విరించి ప్రారంభించి, జడమతి యగుటచే నిన్ను మఱచి మగవానినిఁగా గావించియుండును. లేనియెడల లోకములో సుందరపురుషు లెందఱు లేరు? వారియం దీయాకర్షణ శక్తి యేల యుండరాదు? దేవదేవా! తమగ్రంథములయందు సుందర పురుషు లగుకథానాయకులను మతిలేనికవులు మితిమీరి వర్ణింతురు; కాని నేనే దేవి నగునెడ, నిన్నుఁబోలినలోకైకసుందరపురుషు నీక్షించినపుడు పురుషులకుసైతము మోహా వికారము జనించునని నాగ్రంథమున వర్ణించియుందును. ఇట్టి పరాకర్షణశక్తి గల నీ యట్టి రాజకుమారుని నాకొసంగిన జైనాచార్యునిఋణము నేను దీర్చుకొనలేను. రాజ కీయాంశములలో నీవలన గొప్పలాభమును బొందఁగలనని నాకుఁ దోఁచుచున్నది. కుమారా! నీవు నాయొద్దఁ గొంతకాల ముండెదవా? నీకు మంచియుద్యోగ మిచ్చెదను. ఆచార్యులవారి యాజ్ఞానుసారము నిన్నత్యాదరమునఁ జూచుచుండెదను. నీగౌరవము నకు లేశమును భంగమును రానీయను. నీవు నిరంతరము నాయంతఃపురమునందే నాతో సకలభోగములు ననుభవించుచు నివసింపవచ్చును. ఇది నీకిష్టమేనా!"

అని యడుగ దేవదేవుఁడు చిఱునవ్వు నవ్వుచుఁ జేతులు జోడించి యతి వినయముతో,

"మహారాజా! ఇష్టమేనా యని తమరు నన్నుఁ బ్రశ్నింపవలయునా? సిరిరా మోకా లొడ్డువారు నుందురా? దేవరయాజ్ఞ శిరసావహించి నే నిచ్చటనే యుందును. నియమితకార్య మెట్టిదైనను, శక్తివంచన లేక భక్తిపూర్వకముగా నొనర్చుచుందును. తమయనుగ్రహామునకన్న వేఱుగ మగు వేతన మేమియు నే నాసింపను. రాజకీయాంశములలోఁ దమ కన్నివిధములఁ దోడ్పడఁగల నని నాకు ధైర్యమున్నది."

"సెబాస్! దేవదేవా! నీరూపసంపదను నీవినయగుణసంపద వన్నె పెట్టుచున్నది. ఇంత లేఁబ్రాయముననే యిట్టి సూక్ష్మబుద్ధి యలవడుట మిక్కిలి యరుదు. నీవు నాచెంత నున్నయెడల నాహవమల్లుఁడు లేఁ డనువిచారము సుంతయు నాకుండదు. జైన స్వామి త్రిపురాంతకునిఁ బట్టుకొనుటయందు వానిని నియోగించుట నాకుఁ బరమ సమ్మతమే!"

"నిజము మహారాజా! ఆదుర్మార్గుఁడు మనకుఁ జిక్కిన గాని మనకార్యము లేమియు నిర్విఘ్నముగాఁ గొనసాగవు."

"ఔను. అందుచేతనే వానివిషయమై మే మంతపట్టుదలతోఁ బనిసేయుచున్నాము. నాకును జైనాచార్యునకును జరుగుచుండిన యుత్తరప్రత్యుత్తరములలో ననేకములు మనుష్యులతోఁగూడఁ గానరాకుండ మాయమై పోయినవి. ఆదుష్టుఁడు మార్గమధ్యమున నెచ్చటనో కాచియుండి దోపిడిదొంగవలె మనరాయబారులను బట్టి కడతేర్చుచు వారియొద్ద నున్నయుత్తరములను సంగ్రహించి, మెల్లఁగా రుద్రమదేవి కంపుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. జైనస్వామియే కాక, వానినిమిత్తము నేను గూడ ననేకగూఢచారులను బంపించితిని. ఇంతకు నెవరైన నేమి చేయఁగలరు? వాని యాకార మెట్టిదో, వయ సెంతయో, పొడగరియో, పొట్టియో, తెల్లనివాఁడో, నల్లనివాఁడో, స్థూలకాయుఁడో, శుష్కశరీరుఁడో, మొదలగు స్వరూపచిహ్నము లేమియుఁ దెలియకుండ నెట్టి గూఢచారులైన నెట్లు గుర్తించి పట్టుకొనఁగలరు? పేరు త్రిపురాంతకదేవుఁ డని తప్ప మఱియొకసంగతి మన మెఱుఁగము. అంతమాత్రమున నేమి లాభ మున్నది? ఆమాయలమారి యెన్నఁడును దనపేరు పైకిఁ జెప్పుకొనఁడుగదా? దొంగ యెన్నఁడైన దాను దొంగయని చెప్పుకొనునా?"

"మహారాజా! అ ట్లెన్నఁడును జెప్పుకొనఁడు. పేరు చెప్పుకొనకపోవుటయే కాక వాఁడు మిక్కిలి చతురవర్తనుఁ డగుటచే, దినమున కొకవేషముతో సంచరించుచుండు

దని నాయుద్దేశము. నేనొకప్పుడు జైనస్వామి యిచ్చినయుత్తరము ప్రతాపదేవున కిచ్చుటకై యేకశిలానగరమున కేఁగి, యచ్చటఁ గొందఱు పౌరులవలన వానినిఁ గూర్చి కొన్ని సంగతులు వింటిని. త్రిపురాంతకదేవునకు నలువదిసంవత్సరములువయస్సుండునఁట."

"అలాగా! అట్లయినచో నాయీడే"

"నల్లని దీర్ఘకాయుఁడఁట"

"సరే! నేనుఁగూడ నట్టివాఁడనే"

"వానిగడ్డము కొంచెము కొంచెముగా నరసిన వెండ్రుకలతో గుండెలపై వ్రేలాడుచుండునఁట!"

"ఇదిగో నాగడ్డమును నట్లే యున్నది."

"మీసముగూడ మీ మీసమువలెనే వంకలు లేక నిడుపుగా నుండునఁట. స్థూలశరీరుఁడు కాఁడఁట!"

"బాగున్నది. ఒకమనుష్యునిఁబోలిన మఱియొకమనుష్యుఁ డుండఁగూడదని శాస్త్రమున్నదా యేమి? సృష్టి యనేకవిధములు. ఈపరమరహస్యము నా కిదివఱకే తెలిసియున్నయెడల నామందభాగ్యుఁడు మనచేఁ బట్టువడియే యుండును. ఇప్పుడైన నేమైనది? నీవు చెప్పిన యాకారవిశేషములను గుర్తెఱింగించి త్రిపురాంతకునిఁ బట్టుకొనునట్లు గూఢచారులకుఁ గఠినముగా నియోగించెదను. ఇంక నీసంగతి యిట్లుండ మనము చేయవలసిన రెండవకార్యము చెఱలోనున్న కుమారదేవు నెట్టులైన వశపఱచుకొనుట——"

ఆమాట వినినతోడనే దేవదేవుఁ డొక్కమాఱు త్రుళ్లిపడి యత్యాతురతతో "దేవా! ఏకుమారదేవుఁడు!"

"కుమారా! రుద్రమదేవినిఁ బట్టుకొనుటకై నేను బంపించిన సైనికులకుఁ బట్టువడిన కుమారదేవుఁడు. వాఁడు రుద్రమదేవికిఁ బ్రాణతుల్యుఁడఁట. అప్రతిమపరాక్రమవంతుఁడఁట. మనసైన్యములోఁ జాలభాగ మాతఁడొక్కఁడే నాశనము గావించెనఁట. అట్టి వీరాగ్రేసరుఁడు మనచేతఁ జిక్కినప్పుడు నిష్కారణముగఁ గడతేర్చుటకు మారుగా సామదానభేదదండోపాయములలో దేనిచేనైన లొంగించి వశపఱచుకొని, మనపక్షమునఁ జేర్చుకొనినయెడల ముందుముందు వానివలన మన కనేకలాభము లుండునని నాకాశ పుట్టుటచేత నే నావిషయమై ప్రయత్నించుచున్నాను. యుద్ధ

ములోఁ దగిలిన గాయమువలనఁ గుమారదేవుఁ డిప్పుడు దీనావస్థయం దున్నవాఁడు. మా రాజవైద్యులను బంపించి వానికిఁ దగిన చికిత్స చేయించుచున్నాను. గాయము కుదిరి యాతఁ డించుక మంచిస్థితిలోనికి వచ్చినంతనే పరాకర్షణశక్తి గల నీవే యీ కార్యభారమును వహించి వానిని మనపక్షమునకుఁ ద్రిప్పివేయవలెను. ఈ కార్యము నందు మురారిదేవుని నేను నియోగించితిని కాని వాఁడు వట్టిమందమతి. చతురత గల వాఁడు కాఁడు. వైద్యులు వానికిఁ దగినచికిత్స చేయుచున్నారో లేదో యది కూడ నీవే స్వయముగాఁ బరీక్షించుచుండవలెను. దైవానుగ్రహమువలన నాతఁడు మనకు వశుఁడైనయెడల నేకశిలానగరమందలి రాజకీయరహస్యము లన్నియుం మనకుఁ దెలియుంటయే కాక యుద్ధరంగమున మనపక్షమున నిలిచి యభిమన్యునివలెఁ బని సేయుం నని నేను మిక్కిలి యాశపడుచున్నాను. నీ వీకార్యము నెట్టులైన సాధించినయెడల నీవు కోరినవరమును నీకొసంగి యన్నివిధముల నిన్ను నేను సంతుష్టిపఱిచెదను."

"మహారాజా! శక్తివంచన లేక నే నీ విషయమునఁ బ్రయత్నించెదను. తప్పక నే నీ కార్యమును సాధింపఁగల నని నాకు ధైర్య మున్నది. పిదప దైవ మున్నాఁడు."

"నా కదియే చాలును."

---

## 8 . 13-వ ప్రకరణము

### చెఱయందలి కుమారదేవుఁడు

నాఁటినుండియుం దేవదేవుఁడు రాజాంతఃపురమునందే నివసించుచు, మహారాజ కుమారునివలె సకలభోగములు ననుభవించుచుండెను. రాజానుగ్రహమునకు బాత్రుఁడైనవానికి రాజ్యమంతయుం గడగడ లాడును గాన దేవదేవుని యధికారము కొలఁదిదినములలోనే కోటయం దంతటఁ బ్రబలముగా వ్యాపించెను. ద్వారపాలకులు మొదలుగ సేనానాయకులవఱకుఁ బ్రతిరాజోద్యోగస్థుఁడును వానియాజ్ఞ మన్నించితీరవలయును. ఒక్క రాజునకే కాక, తదాశ్రితవర్గమున కంతకును దేవదేవుఁడు నిజముగా దేవదేవునివలెనే తోఁచుచుండెను. ఒక్క శుద్ధాంతకాంతాజనాంతఃపురప్రాంతమునకుఁ దప్ప దేవదేవుఁ డరుగరాని ప్రదేశ మానగరునం దెచ్చటను లేదు. అతఁడు నివసించుచుండిన మేడలోనికి మాత్రము రాజుగూడఁ దనయాజ్ఞ లేనిదే వచ్చుటకు వీలులేదు. ఆతనికి సేవసేయుటకు రాజనేక దాసీజనముల నొసంగెను గాని, దేవదేవుఁ డవసరమని చెప్పి యొక్క ముదుసలి దాసిని మాత్రము తనచెంత నుంచుకొనెను. అందుకుఁ గారణ మేమని రాజు తన్నడిగి

నప్పుడు దేవదేవుఁడు "మహారాజా! యీ యైశ్వర్యము చిరకాలమువఱకు నాకుఁ గొన సాగినయెడల నెన్నిభోగము లైన ననుభవింపవచ్చును. కావున స్వల్పకాలమున కిట్టి యాడంబరము నాకిష్టము లేనందున నేను సామాన్యపురుషునివలెనే సంచరించెద" నని ప్రత్యుత్తరము చెప్పుచుండును. మొదట నుత్తరము గైకొనివచ్చినప్పుడు దేవదేవుఁడు ధరించియుండిన సామాన్యదుస్తులను దీసి పాఱవేయించి, రాజు, రాజకుమారులు ధరింప వలసిన యమూల్యాభరణములును, విడువగల వలువలును వాని కొసంగెను. అతనిర్బంధమువలన దేవదేవుఁడు వాని నంగీకరింపక తీరినది కాదు. ప్రతిదినమును సాయంకాలములయందు దేవదేవుఁ డాయాభరణములచే నలంకృతుఁడై జల్తారుపనులచే వన్నె కెక్కిన పట్టుదుస్తుల ధరించి, ఖడ్గపాణియై తురంగారూఢుఁడై పురవీథుల వెంచేయుచున్నప్పుడు పౌరులెల్లరు గుంపుగుంపులుగఁ గూడి, యా మదనమోహన విగ్రహమును గన్నులారఁ జూచి చూచి తమ జన్మములు సార్థకము లయ్యెనని సంతసించుచుందురు. తమదృష్టిపథమునుండి తప్పిపోవువఱకు నా సుందరవిగ్రహ సందర్శనమువలనఁ గన్యకామణులు చలనము లేక నోటమాట లేక యూపిరి యైన విడువక నిర్జీవప్రతిమాకారములలో నాయా స్థితులయం దట్టులే యుండి పోవుచుండిరి. అసురుల మోసపుచ్చి సురల కమృత మొసంగుటకై ధరించిన మోహినీస్వరూపమును ఋరుషాకారముగా మార్చుకొని శ్రీకృష్ణుఁడు మరల మధురలో నవతరించెనని కవులు వర్ణించు చుండిరి.

ఇట్లు మధురానగరము నంతటిని సమ్మోహనవిద్యచేఁ దాండవ మాడించుచు దేవదేవుఁడు తననియమితకార్యముల నతిశ్రద్ధతో నాచరించుచుండెను. ప్రతిదినమును రెండువేళలయందు నతఁడు కారాగారమున కేఁగుచుఁ గుమారదేవుని యోగక్షేమముల నతిశ్రద్ధతోఁ గనుఁగొనుచుండెను. ఒక్కొక్కప్పుడు దిన మంతయు నచ్చటనే యుండి పోవు చుండెను. అది కనిపెట్టి, తాను నియోగించినకార్యమునం దింతపట్టుల వహించిన దేవదేవుని రాజభక్తిని రా జెంతయుఁ గొనియాడుచుండును. కొన్నిదినములవఱకుఁ గుమారదేవుఁ డా కారాగృహమున ధూళీధూసర మగుకటికినేలపై వేయఁబడిన చాపపైఁ బరుండి, గాయముచే మిగుల బాధపడుచుండెను గాని, దేవదేవుని యధికారము వచ్చి నప్పటినుండియు వాని కాకష్టములు తొలఁగి పోయినవి. పేరునకు మాత్ర మాతఁడు కారాగృహమున నుండెను గాని తక్కిన సంరక్షణమున కేమియు లోపము కలుగలేదు. ఆచెఱసాలతోడనే సంబంధించిన విశాలమగు నొకగది శుభ్రకఱచి యం దొకచక్కని మంచముపైఁ బట్టుపరుపులను వేయించి, దేవదేవుఁడు కుమారదేవు నందుఁ బరుండఁబెట్టించెను. అది కుమారదేవుని వశపఱచుకొనుటకై దేవదేవుఁడు పన్నిన యుక్తియని యెంచి రాజు మిక్కిలి సంతసించెను. రాజవైద్యులు రెండువేళలయందుఁ బోవుచు గాయములకుఁ

గట్టుకట్టి, తీవ్రముగా నావరించినజ్వరము హరించుటకుఁ దగినయౌషధములు నూరి పోయుచుండిరి. మూఁడు నాలుగు దినములలోనే గాయము లన్నియుం శుభ్రముగాఁ బోయి, మచ్చగట్టి, తత్సంబంధమగుబాధ లేశమును లేకుండ వైద్యులు చికిత్స చేయఁ గలిగిరి గాని, పట్టిన జ్వరమును లేశమైనఁ దగ్గించుట వారికి సాధ్యము కాలేదు. జ్వర హరణమునకై యెన్నివిధము లగుమహౌషధము లున్నవో యన్నియుఁ బ్రయోగించి చూచిరి. అంతకంత కాజ్వర మధికమై రోగిని శుష్కింపఁజేయుచుండుట తప్ప నా యౌషధములవలన వేరు ప్రయోజన మేమియుఁ గలుగలేదు. జ్వరాతిశయమున నూరక పలవరించుచుండుట తప్ప రోగినోట నొకమాటయైన లేదు. గంటెఁడుజావ యైనఁ గడుపునం దిమిడి యుండదు ఏకవీర నామస్మరణమునకు మితియే లేదు.

ఈదుస్స్థితియంతయుఁ గనిపెట్టి కుమారదేవుఁడు బ్రదుకుట దుర్లభమని నిశ్చయించి దేవదేవుఁడు నిరంతరము విచారించుచు రాజవైద్యులు తగినచికిత్స చేయకున్నారని తఱచుగా రాజుతోఁ జెప్పుచు వచ్చెను. తోడనే రాజు వారిని రప్పించి, రోగిని త్వరలో నారోగ్యవంతునిగాఁ జేయవలసియున్నదనియు, నట్లు చేయలేనియెడల నుద్యోగములకు భంగము వచ్చుటయే కాక, యంతకన్నను నెక్కుడగుశిక్షలు విధింపఁబడుననియు వారిని భయపెట్టుచుండెను. ఎన్నియౌషధములు పోయుచున్నను జ్వరము తగ్గనందున వైద్యులు విసిగి, రోగిని బలవంతముగఁ జంపివేసెదరేమో యని దేవదేవున కొకయనుమానము కలిగినది. అందుచే నతఁడు వారిని మెల్లగా మంచిమాట లాడుచు, వా రొసంగిన ప్రత్యౌషధమును దాను స్వయముగాఁ బరీక్షించుచు నిరంతరము గుమారదేవు నతి జాగ్రత్తతోఁ గాపాడుచుండెను.

ఒకనాఁటియుదయమున దేవదేవుఁడు రాజుతోఁగూడఁ గుమారదేవునిఁ జూచుటకు వచ్చెను. వైద్యులుఁ గూడ నప్పుడే వచ్చి నాడి పరీక్షించుచు నేయౌషధ మీయవలసియున్నదో యాలోచించుచుండిరి. శుష్కించినశరీరముతో లోకముపై లేశమైన జ్ఞానము లేక పడియున్నరోగిని రాజు కొంతవఱకు నిదానించి చూచి తనలో నేమో యాలోచించి తనప్రక్కనున్న వైద్యులవంకఁ దిరిగి యందొకనితో

"మీ రిప్పు డాలోచించుచున్నవిషయ మేమి? ఇంతలో నుపద్రవమేమియుఁ దటస్థింపదు కదా?"

"మహారాజా! ఇది విషజ్వరమగుటచే నేమి చెప్పుటకును వీలులేదు. నేఁటినుండియు నౌషధమును మార్చవలె నని యాలోచించుచున్నాము. నాడియందు వాతగుణము ప్రబలముగానున్నది. అందుచే వాతరాక్షసము—"

"అయ్యో! వాతరాక్షసమునకును సకలవిధజ్వరములకును సన్నిపాతములకును బిడుగువంటి మహాతరుణార్కు మిచ్చినయెడలఁ గొంత ప్రయోజన ముండునని నాయుద్దేశము."
"దేవా! అదియును గొప్పయౌషధమే! ఈరెండును సమానముగానే పనిచేయఁగలవు.
అయినను మొదటఁ దరుణార్కమే ప్రయోగింతము."

అని చెప్పి యావైద్యుఁడు తనచేత నున్న డబ్బిలోనుండి యొకచిన్న మాత్రను దీసి తేనెలోఁగలిపి బలవంతముగా రోగినోటిలోఁ బోసి మ్రింగించెను. ఔషధము లోనికి దిగునట్లు దేవదేవుఁడు వానిగుండెపై మెల్లఁగా రాయుచుండెను. చెంత నున్నవైద్యు లేవో శ్లోకములు చదువు చుండిరి. అప్పుడు కుమారదేవుఁడు తటాలునఁ దనకన్నులం దెఱచి తనయెదుట నున్న వారందఱి నూరక రెప్ప వ్రాల్చక చూచుచు, "ఏకవీరా! ఏకవీరా! ఏదీ? మాయేకవీర యెచ్చట నున్నది? ఆమెను విడిచి నేను బ్రతుకఁగలనా? అయ్యో! ప్రాణేశ్వరీ! నీవు లేకున్నయెడ నా కీజ్వరబాధ యెట్లు తగ్గును? ఈ వట్టి యౌషధములతో నేమి ప్రయోజన మున్నది? ప్రియా! ప్రియా!" అని మరలఁ గన్నులు మూసివేసి యెప్పటియట్ల పరుండెను. ఆపలువరింతలు విని యచ్చటివారందఱు మిక్కిలి యాశ్చర్య మొందిరి! అప్పుడు దేవదేవుఁడు రాజును జూచి, "మహాప్రభూ! చిత్తగించితిరా? ఏకవీర యను నొకకన్యక నీతఁడు వరించి యుండును. ఆమెకొఱకు బెంగ పెట్టుకొని, పాప మీతఁ డిట్లు నిరంతరమును జ్వరపీడితుఁడై బాధపడుచున్నాఁడు. నే నిచ్చటఁ బ్రవేశించినప్పటినుండియుఁ గనిపెట్టుచున్నాను. ఎల్లప్పుడు నేకవీరస్మరణము తప్ప మఱియొకపలువరింత లేదు. అట్టివాని కెట్టియౌషధములను బోసిన నేమి ప్రయోజన మున్నది? పాపము వైద్యులుమాత్ర మేమి చేయఁగలరు! కుమారదేవుఁడు త్వరలో రోగవిముక్తుఁ డగుటకు నే నొకచక్కని యుపాయము చెప్పెదను. తమ రంతఃపురమునకు దయచేసినయెడల సావధానముగా మనవి చేసికొనెదను."

అని పలుక రాజు వెంటనే వానితో నచ్చటనుండి బయలుదేరి యంతఃపురమునకుఁ బోయెను.

---

## 14-వ ప్రకరణము

### ప్రాణరక్షణోపాయము

పాండ్యరాజు దేవదేవునితోఁ గూడ తనయంతఃపురమునకు విచ్చేసి, మేడవసారాలో నున్న యతివిచిత్ర మగునొకరత్నకంబళముపైఁ గూర్చుండి వానితో నిట్లు ప్రసంగింప నారంభించెను.

"దేవదేవా! ఇప్పుడు సావధానముగాఁ జెప్పుము. కుమారదేవునిఁగూర్చి నీవేమి యాలోచించెదవు? నాకేమియుఁ దోఁచకున్నయది. ఆయేకవీర యెవతెయో మన మెట్లు కొనివచ్చెదము? ఈమదనతాపజ్వరమునకు మఱియొకమందు లేదుకదా."

"దేవా! లేదు లేదు. ఈవట్టియౌషధములతో నింకఁ గార్యములేదు. నేను జెప్పినట్లు మీరు చేయఁగలిగినయెడలఁ గుమారదేవుఁడు జీవించును గాని మఱియొక విధమున—"

"నీవు చెప్పినట్లు నేను తప్పక చేసెదను. కాని నాకు సాధ్యమై యుండవలయును."

"మహారాజా! అసాధ్యమైనకార్యము నేనెన్నఁడైన మనవి చేసికొందునా?"

"సరే! అట్లయినఁ ద్వరగాఁ జెప్పు."

"దేవా! తమయాశ్రితవర్గములో నాయీడుగల యొకచక్కని రాజకుమారుఁ డెవఁడైన నున్నాఁడా?"

"నీకు సమవయస్కులగు రాచబిడ్డలు మాకోటలో నున్నారు కాని, వారు నీయంత చక్కనివారు కారు."

"పోనిమ్ము! సామాన్యసౌందర్యమున్నచోఁ జాలును."

"సరే! అట్టివా రున్నా రనుకొందము. తరువాత?"

"అట్టిచక్కని రాచబిడ్డఁ డొకఁడు తమకొలువులో నున్నయెడల వాని నిప్పుడే కబురంపి రప్పింపుఁడు."

"ఎందుకొఱకు?"

"ఎందుకొఱకా? ఆరాజకుమారునకు మనము చక్కని స్త్రీవేషమును వేసి యేకవీర యను పేరు పెట్టి కుమారదేవునియొద్దకుఁ బంపుదము—"

"బలే! దేవదేవా! బలే! కొనసాగినను గొనసాగకపోయినను నీవు చెప్పిన యుపాయము మిక్కిలి ప్రశంసనీయమైనది. ఇంతటి గొప్పయుక్తి నీకు స్ఫురించునని నేను మొదట ననుకొనలేదు."

"మహారాజా! మీయంతటివారు తలపెట్టినప్పు డీపాటి స్వల్పకార్యము కొనసాగుట కేమి యాశ్చర్యమున్నది?"

"ఏమియు నాశ్చర్యము లేదు. కాని నామాట మన్నించి యేరాచబిడ్డఁడు ఱవికదొడిగి చీరగట్టుటకు సాహసించును?"

"మీయాజ్ఞ యైనప్పు డెవ్వరైనను సాహసింపవలయును. మీచేఁ బోషింపఁబడుచు సమయము వచ్చినప్పు డీపాటియుపకారము మీ కొనర్పనియెడల నట్టివా రున్ననేమి లేకున్ననేమి ? నిష్కపటమగు రాజభక్తి కలవాఁ డెన్నఁడు నిందుకు వెనుదీయఁ డని నా నమ్మకము. అట్టివాఁ డొక్కఁడైన మీకొలువునందు లేఁడా ?"

"దేవదేవా ! లేఁడని చెప్పను. ఉన్నాఁడు. కాని చెప్పినతరువాత నామాట మన్నించి నన్ను గౌరవించునని తోఁపదు, ఏమి చేయవలయును ?"

"మీరట్లు సందేహించుచున్నారు గాని స్వయముగా మీరు సెలవిచ్చినప్పు డెవ్వఁడైన నంగీకరింపకపోఁడు. మీతలఁపునం దున్నవాఁ డెవఁడో వానిని రప్పించినయెడల మీ యెదుటనే నేను బోధించి యంగీకరించునట్లు చేయఁగలను. మఱియు నిందులోఁ జిన్నతన మేమియు లేదు. ఇదియొక సాహసము గాదు. సమయము వచ్చినప్పుడు తన ప్రభువుకొఱకు నేపనియైనఁ జేయక తీరదు. కుమారదేవుఁడు బ్రదికి బాగుపడినయెడల వాని నెట్టులైన మనపక్షమునకుఁ ద్రిప్పుకొనవచ్చును. రాజకీయాంశములలో నట్టి వీరాగ్రేసరుఁడు మనపక్షమున నున్నప్పుడు మన కెన్నివిధముల నుపచరించునో మీకు నేను జెప్ప నక్కఱలేదు. కావున మీ రీవిషయమున నశ్రద్ధ వహింపఁగూడదు. ఇంక నాకుమారదేవున కెన్నియౌషధములు పోసినను లాభము లేశమును లేదు. ఏకవీరయందలి మోహాతిశయమున వానిజ్వర మతితీవ్రముగాఁ బ్రజ్వలించుచున్నది. కావున వానిజ్వరము తగ్గి శరీరముపై స్మృతి గలిగి, యించుక యారోగ్యస్థితికి వచ్చువఱకు మన మీ కపటనాటక మాడించినయెడల వాని కింకఁ బ్రాణభయ ముండదు. అప్పుడు మనము పన్నినయుక్తి వానికిఁ దెలిసినను బ్రమాదము లేదు. మంచిమాటలచే సంగతు లన్నియు వానికి బోధించి నేను వానిని సమాధానపఱుపఁగలను. పురుషుఁడై పుట్టి యవసరమును బట్టి స్త్రీవేషమును వేసినంతమాత్రమున స్త్రీలలోఁ బరిగణింపఁబడఁడు. ఈ స్త్రీవేషమును ధరించుట కేవలము రాజకార్యముకొఱకు. నిష్కారణముగఁ జనిపోవుచున్న దీనుఁ డగు నొక లేఁబ్రాయపు రాచబిడ్డని ప్రాణములు రక్షించుటకొఱకు. ఇందు రెండుపారమార్థికము లున్నవి. అందుచేఁ దమరు స్వయముగా సెలవిచ్చినయెడల లోకజ్ఞానము గలవాఁ డెవ్వఁడును గాదనఁడు."

"దేవదేవా ! ఈసంగతు లన్నియు నేను నీకు బోధింపవలసినవి కాని నీవు నాకు బోధింప నక్కఱలేదు. నే నడిగినప్రశ్నలకుమాత్రము నీవు సదుత్తరము లొసంగుచుండుము. ఈపని చేసినవారికి లేశము నవమానము లేదని నీవు ధైర్యముతోఁ జెప్పఁగలవా ?'

"దేవా ! ముమ్మాటికిని జెప్పఁగలను."

"లోకజ్ఞానముకలవాఁ డెవ్వఁడు నీకార్యమునకు వెనుదీయఁడు కదా?"

"లేశమును వెనుదీయఁడు."

"అట్లు నేను స్వయముగా సెలవిచ్చినప్పుడు నామాట మన్నింపనివాఁడు కేవల రాజద్రోహియే నా?"

"అందునను సందేహ మేమి?"

"ఈమారు వేషమును దాల్చుటలో రాజకార్యనిర్వహణము, దీనప్రాణరక్షణము—అను రెండు గొప్పపారమార్థికము లున్న వని నీవు ధారాళముగ జెప్పఁగలవా?"

"ఆహా! ఢంకానగారాలు మ్రోయించుచుఁ జెప్పగలను."

"ఇందు గౌరవహాని లేశమును లేదు కదా?"

"లేదని యిదివఱకే మనవి చేసికొంటిని. మరల మనవిచేసికొనుచున్నాను. ఇం దేమియు గౌరవహాని లేదు."

"అందుచేత నో దేవదేవా! ఈకార్యభారమును నీవే స్వయముగా నేల వహింపఁగూడదు? వానిని వీనిని బతిమాల నేల? నేను నీకే నియోగించినాను. నిక్కముగ రాజభక్తి గలవాఁడ వైనచోఁ బారమార్థికచింత వలసినచో నామాట మన్నించి, యిందున కంగీకరింపుము."

"ఆహా! మహారాజా! మీ రిన్ని ప్రశ్నలను నన్నింత నొక్కి యడుగుచుండ నేమో యనుకొంటిని గాని, యిందులో నన్నే మీరు నియోగించెదరని తలఁపలేదు."

"'దేవదేవా! కుమారదేవుని బ్రదికించుటకై నీ వాయుక్తి పన్నితివి. ఈకార్యమునందు నిన్ను నియోగించుటకై నే నీయుక్తి పన్నితిని. అందుచే నీకిది తప్పదు."

"దేవా! నన్ను క్షమించి యితరుల నెవరి నైన నియోగింపుఁడు. నే నంత చాకచక్యము గలవాఁడను గాను."

"అలాగా? నీకన్నఁ జాకచక్యము గలవారు నాయొద్ద లేనప్పుడు నీవే గొప్పచాకచక్యము గలవాఁడవు కదా? అందుచే నీకే యీకార్యమును నేను నియోగించితిని."

"ఈవిషయములో మీరు నన్ను క్షమింపలేరా?"

"లేశమును క్షమింపలేను."

"ఈస్వల్పకార్యమునకై నేనే కావలయునా?"

"నీవే కావలయును."

"దేవా! ఇది నాకింకఁ దప్పదా?"

"విశ్వాసఘాతకుఁడ ననిపించుకొనుట కిష్ట మున్నయెడలఁ దప్పును. లేనియెడలఁ దప్పదు."

"అబ్బబ్బా నేనంత యపకీర్తి ధరింపఁజాలను. ఎన్ని వేషములైన వేసెదను గాని రాజ ద్రోహి ననిపించుకొనలేను."

"సెబాస్! దేవదేవా! నీవు నిజముగా రాజభక్తుఁడవే! ఈముత్యాలహారమును నీవు కానుకగాఁ గైకొనుము. స్త్రీవేషధారణమున నీ కిది యుపకరింపఁగలదు. ఇంకను గావలసిన వస్త్రాలంకారాదులను నాకొమార్తెయైన మహేశ్వరియొద్దనుండి తెప్పించెదను. కాని దేవదేవా! వీలైనప్పుడు నీవు దాల్చిన జగన్మోహినీస్వరూపమును నన్నొక్కమారు కన్నులారఁ జూడనీయవలెను సుమా!"

"దేవా! ఈపరిహాసమున కేమి గాని, నే నీస్త్రీవేషమును దాల్చి, సిగ్గువిడిచి వీథులవెంటఁ దిరుగుటకన్నఁ గుమారదేవు నెట్టులైన నామేడలోనికిఁ దెప్పించినయెడల నాకు నదుపాయముగా నుండు నని మిమ్ముఁ బ్రార్థించు చున్నాను."

"ఇంతమాత్రమునకై ప్రార్థింపనేల? యట్టులే చేసెదను. భోజనమునకు వేళ యైనది నే నింకఁ బోయెదను."

అని పలికి రాజు వెంటనే యచ్చటినుండి లేచి పోయెను. దేవదేవుఁడును రాజు నొద్ద సెలవు గైకొని, యచ్చటికి సమీపముననే యున్న తన మేడలోనికిఁ బోయెను. అతఁడు పోవుసరికి వాని సేవకై నియోగింపఁబడిన ముదుసలిదాసి, మితిమీఱినముదిమిచే నొడలంతయు వడఁకుచుండ ద్వారముకడనే నిలిచి యుండి, యాతఁడుకంటఁబడినంతనే తన బొడ్డుకొంగులోనుండి యొకయుత్తరమును దీసి మెల్లఁగా వాని కందిచ్చెను. దేవదేవుఁ డాయుత్తరమును గైకొని, యది యేమై యుండునో యని యనుకొనుచుఁ దాను పరుండుగదిలోనికిఁ దిన్నగాఁ బోయెను.

---

## 15వ ప్రకరణము

### ముదుసలి దాసి

"మనోహరా!

మనోహరసందర్శనమహానందమున వికసితభావము వహించు పద్మినీసుందరిచందమున, నిన్నసాయంకాలమున మీజగన్మోహనాకారమును సందర్శించి, నే నమితానంద హృదయారవింద నైతిని. అప్పటినుండియు మీప్రతిబింబము నామనోదర్పణమునఁ బ్రతిఫలించుచు నాకన్నులకుఁ గట్టినట్టులే యున్నది. మీదివ్యసుందరమంగళవిగ్రహమును

ప్రత్యక్షముగ సందర్శించి, తనివిదీర మీమధురవాగమృతమును గ్రోల నాడెందమాందో ళన మొందుచున్నయది. మహేశ్వరీమనోహరుం డగుదేవదేవుఁడు నామనోరథము నెర వేర్చుఁగాక. మీయనుగ్రహమునకై యిట్లు ప్రతిక్షణము నిరీక్షించుచుండు మీచరణ దాసి మహేశ్వరి."

అని వ్రాయఁబడి యున్నయుత్తరమును జదువుకొనుచు దేవదేవుఁడు తనమేడ గదిలో నున్న పందిరిమంచముపైఁ గూర్చుండి యుండెను. ఆయుత్తర మంతయుఁ జదివిన తరువాత నాతఁడు తనలోఁ దానే నవ్వుకొనుచు, మరల మరల నాయుత్తరమును జూచుచు, మాటిమాటికి శిరము పంకించుచు, నేమేమో యాలోచించుచుఁ గొంతసేపు వఱకుఁ గడపి, పిమ్మట, ద్వారముకడ నున్నముదుసలిదాసిని లోనికి రమ్మని పిలిచెను. "ఓహో! నాజీవచరిత్ర మెంత విచిత్రమైనది? స్త్రీవేషములోఁ గుమారదేవునికడను, బురుషవేషముతో మహేశ్వరికడను నే నిప్పుడు సంచరింపవలసివచ్చినది. ఈసందర్భ మునఁ బుట్టువుచే సహజముగ నేను స్త్రీనో, పురుషుఁడనో నాకే తెలియకున్నది." అని దేవదేవుఁ డనుకొని యాశ్చర్య మొందుచుండ, జరాభారముచే నడుము వంగి, శరీర మంతయుఁ, ముడుతముడుతలుపడి, పిట్టలు పీకినటు లిటునటుఁ జెదరిన తెల్లనితలవెండ్రు కలతో నాముదుసలిదాసి లోనికి వచ్చి దేవదేవునియెదుట నొకగోడకుఁ జేరఁబడి నిలిచి యుండెను. దానిచూపులయందలి విశేషములును, ముఖమునందలి లక్షణములును, తక్కిన చేష్టలును జక్కఁగఁ గనిపెట్టినయెడల నాముదుసలిదాసి ప్రస్తుతము సాధుశీల యైనను యౌవనదశలో నున్నప్పుడు మాత్రము గొప్పకథానాయకియై ప్రవర్తించెనని గ్రహింప వచ్చును. దేవదేవుఁడు కొంతసేపువరకు నామెను నిదానించి చూచి—

"అవ్వా! శుద్ధాంతకన్యకామణులయొద్దనుండి యిట్టియుత్తరములను గొనివచ్చి నీవు పర పురుషుల కీయవచ్చునా?"

"నాయనా! ఇందులోఁ బరపురుషు లెవరు?"

"నేను గానా?"

"ఎవరికి? నాకా?"

"ముదుసలిముండవు నీమాట కేమి? మహేశ్వరికి నేను బరపురుషుఁడను గానా?"

"మహేశ్వరికి మీరు పరపురుషులైనచో మహాపతివ్రత యగునామె మీ కీయుత్తర మేల వ్రాసియుండును? నేనెట్లు తేఁగలిగి యుండును!"

"పరపురుషుఁడను గాక యామెకు నేను బెండ్లియాడిలినా యేమి!"

"ఈప్రయత్న మంతయుఁ బెండ్లికొఱకే కదా?"

"ఔను. నే నామె మొగమైన నెన్నఁడు జూచి యెఱుఁగనే?"

"మొగము చూడకుండ-ముద్దులాడకుండ-ముచ్చటింపకుండ-నిప్పుడేమి మించి పోయినది? ఇ వన్నియుం జరిగినతరువాతనే పెండ్లాడవచ్చును."

"అవ్వా! మాటిమాటికిఁ బెండ్లి పెండ్లి యనుచుందువు. పెండ్లి యన్న సామాన్య మను కొంటివా-యేమి? ఆమె నన్నువరించినను, నాహృదయ మామెయందు లగ్నము కావలయునుగదా? ఇన్నింటికిఁ దోడు పాండ్యరాజు మాదాంపత్యమున కంగీకరింప వలెనా? లేదా?"

"అబ్బాయిగారూ! యోగము కూడినప్పు డన్నియుంచు సమకూడునండీ! పెండ్లి యన్న సామాన్యము గాక యేమి కష్టమున్నది? ఒక్కమాటతోఁ, బెండ్లి - ఒక్కనిముస ములోఁ బెండ్లి-కూఁ అన్నఁ బెండ్లి-కన్నుచాటైనఁ బెండ్లి-ఇట్టి పెండ్లిండ్లు లక్షలకొలఁది నాచేతులతోఁ జేయించియున్నాను. నీయం దామెమనసు -ఆమెయందు నీమనసుం కుదురుపడినప్పుడు మధ్య రాజుగారిప్రసంగ మెందుకు? ఇంతకు నీసంగతి వానికెట్లు తెలియఁగలదు?"

"ఔను. తెలుపకుండ మన మెన్నాళ్లు దాచి యుంచఁ గలము?"

"దాచి యుంచవలసినంతకాలము దాచియుంచవలసినరీతిగా దాచియుంచెదము. చెప్ప వలసివచ్చినప్పుడు చెప్పవలసినరీతిగాఁ జెప్పుదము. రాచబిడ్డఁడవు కదా? ఇదియేనా మీధైర్యము!"

"అవ్వా! అన్నియును బాగున్నవి కాని, యామహేశ్వరినిఁ జూచినప్పుడు నామనసు తృప్తివహించునో? లేదో? ఆమె యందకత్తెయే కదా?"

"అయ్యో! వెఱ్ఱిబాబూ! అందములో నే మున్నదండీ! నాచక్కదనము మీరు చూచి నారుకదా? నేను——"

"అవ్వా! కొంప తీసి మహేశ్వరి నీవలెనే యుండదుకదా?"

"కాదు నాయనా! కొనవరకు వినండి! నేను కాలములో నున్నప్పుడు, ధనవంతుల బిడ్డలు-వర్తకులబిడ్డలు-మహారాజులబిడ్డలు-చక్రవర్తులబిడ్డలు-నన్నుఁ బెండ్లియాడవలె నని, యుత్తరములమీఁద నుత్తరములు - రాయబారములమీఁద రాయబారములు - పంపి నిత్యము నాయింటికలు కటకట కొఱికి వేయుచుండెడువారు. అట్టియెడ——"

"అవ్వా! అంతటి మహారాజులబిడ్డలే నిన్నుఁ జేపట్ట నెంచినప్పుడు వారిని నీవేల పెండ్లాడలేదు?"

"నాయనా! బేరము తెగక—ఏదైనను దబ్బుతో మాట కదా? అందుకొఱకే యీ మహారాజుబిడ్డను మహేశ్వరినిఁ జేపట్టుమని మిమ్ము బ్రతిమాలుచున్నాను. ఆమె చక్కనిచుక్క-చుక్కలలోఁ జంద్రబింబము-మచ్చలేని చంద్రబింబము-చూచి తీర వలయును-ఆ చిన్నది నీవంటివారికిఁ దగినది. ఆ రూపమునందలి సొంపు-మాటల యందలి యింపు-ఆ ముఖమునందలి యందము-చూపులయందలి చందము-ఆ యౌవన మునకుఁ గలతీరు-కేవలము వేరు. ఇతరరాజకన్యక లట్టియందఱ త్తెలుకారు. ఆ చిన్నది నీయొయ్యారమంతయుఁ జూచినది. నన్నుఁ బిలిచినది. ఈ యుత్తరము వ్రాసినది. నీకిమ్మన్నది. నిన్నుఁ జూచినప్పటినుండియు నీయందే తలఁపు. నీయందే వలపు. కావున నామాట—"

"అవ్వా! అన్నియు బాగున్నవి కాని, యిప్పుడు నేను చేయవలసినపని యేమి?"

"ఇప్పు డేమియును లేదు. నీవు చేయవలసినపని ముందున్నది. ప్రస్తుతము నీవు తల యూపినఁ జాలును."

"తలయూపిన నేమి చేసెదవు?"

"మహేశ్వరి నిచ్చటకుఁ దీసికొని వచ్చెదను."

"అయ్యయ్యో! నాకొంప తీసెదవా యేమి? ఎప్పుడు తీసికొని వచ్చెదవు? ఎట్లు తీసికొని వచ్చెదవు?"

"ఎప్పుడైనను దీసికొని వచ్చెదను. పట్టపగలు తీసికొని వచ్చెదను."

"పట్టపగలే? అందఱుఁ జూచుచుండఁగానే?"

"ఆహా! మైళ్ళకు మైళ్లు నడిపించి-క్రోసులకుఁ గ్రోసులుదాటించు నేర్పుగలనావంటి ముండకు—అచ్చట నున్నమహేశ్వరి నిచ్చటికిఁ దీసికొని వచ్చుట యాశ్చర్యమా?"

"అవ్వా! నీమాటలను బట్టి ముందు ముం దేదో గొప్పప్రమాదము కలుగఁ గలదని నాకు భయము పుట్టుచున్నది. ఆమె యొకమహారాజుబిడ్డ-నే నొక సామాన్యపురుషుఁడను, మాయిరువురకు దాంపత్యము పొసఁగనేరదు. కావున నీ వింక శ్రమపడక మెల్లగాఁ బొమ్ము."

"నాయనా! మీ కింకను లోకానుభవము చాలదు. మనసుకలసినప్పుడు మహారాజు బిడ్డ యైన నేమి? చక్రవర్తిభార్య యైన నేమి? ఒక సామాన్యపురుషుఁడ వని

నీయిష్టంతట నీ వనుకొనుచుంటివి కాని యామె యట్లనుకొన లేదు. నేనుఁ గూడ నట్లనుకొనలేదు. నిన్నుఁ జూచుచుండ నావంటిముదుసలిముండకే మగల వివాహేచ్ఛ పుట్టుచుండ, యౌవనవతియు రూపవతియు నగుమహేశ్వరిమాట చెప్పవలయునా? నీ వెంత నిరాకరించినను మహేశ్వరి నిన్ను విడువదు. ఆమె నిన్నే పెండ్లియాడు నట్లు పట్టుపట్టినది. నిన్నెట్టు లైన నామె కప్పగించి తీరెద నని నేను పట్టు పట్టితిని. ఇఁక నీవేమని పట్టుపట్టెదవో కానిమ్ము. ఇందెవరు గెల్చెదరో నీవే చూచెదవు.”

“అవ్వా! నీవు తొందరపడి యామె నిచ్చటికిఁ దీసికొని రాకుము. ఆలోచించి నేను నీకుఁ జెప్పెదను.”

“పోనిమ్ము. ఆమె నిచ్చటికిఁ దీసికొనివచ్చుట నీ కిష్టములేనిచో నిన్నే యచ్చటికిఁ దీసికొని పోయెదను. అట్లులైనచో శశిరేఖపెండ్లి. ఇట్లులైనచో సుషాకన్యకపెండ్లి. క్రియ ముఖ్యముగాని యేదైన నేమి?”

“అవ్వా! నీవింకఁ బొమ్ము. వేళ యైనది. అవకాశము చూచుకొని, సావధానముగా మనము ప్రసంగించుకొంద మని నేను చెప్పినట్లు మహేశ్వరితోఁ జెప్పు.”

“నాయనా! నాతండ్రీ! నా బంగారుకొండా! అట్లేచెప్పెదను. బాబూ! నా కింక సెలవా?.........అబ్బాయీ! అమ్మాయి భారమంతయు నీదే సుమా!”

“అవ్వా! నీపిచ్చి గట్టిపెట్టిపో.”

## 16-వ ప్రకరణము

### ప్రతాపదేవునితలవంపు

“శివదేవా! నేనన్న వన్నియు శిలాక్షరములని నమ్ముము. ఇదిగో! ఖడ్గము. ఇంక దయయు దాక్షిణ్యమును విడిచి, యడవిమృగములఁ జెండాడినట్లు శత్రుసంహార మొనర్చెదను. ఈ పట్టుదలతో, నే నొనర్చిన యీ ఘోరప్రతిజ్ఞతో, నాంధ్రరాష్ట్రము నిర్మూల మగుటయో, నిశ్శత్రుక మగుటయో, కాకతీయకులయశశ్చంద్రికలు దిగంతములవరకు విస్తరించుటయో, యస్తమించుటయో, తేలవలసియున్నది. పైకెత్తిన యీకరవాలము నంతవరకు నొరయందుఁ బెట్టను. ఆదినుండియు మాకొలువుకూటమున మిక్కిలి భక్తివిశ్వాసములతోఁ బని సేయుచుండిన వీరాగ్రేసరులగు మీ రందఱు నాకుఁ దోడ్పడుటకై సిద్ధముగా నుండుఁడు! యుద్ధప్రయత్నముల నేఁడే యారంభింపుఁడు. రణసన్నాహ మొనర్ప మన సేనాసమూహమునకు నాజ్ఞ యొసం

గుఁడు! ఈదండయాత్రలోఁ బ్రపంచమంతయు నేకమై మనపైఁ దిరుగఁబడుఁగాక. ఐహికభోగముల కాశింపక యాంధ్రవీరులెల్లరుఁ దమప్రచండ పరాక్రమానలజ్వాలల భూనభోంతరాళముల వ్యాపింపఁజేసి, రాజద్రోహుల భస్మరాశులను గన్నులారఁ జూడవలసి యున్నది. ఈస్వామిద్రోహులతో నేకమై, యిదియే సమయమని మనపైఁ దృష్టి పడుచున్న దేవగిరియాదవుల గర్వ మడఁగించి రూపుమాపవలసి యున్నది. ఇదియే నానిశ్చయము.”

“దేవీ! శాంతింపుము! కుతంత్రపరాయణు లగు రాజద్రోహులకుఁ గాలము సమీపించినది. లేనియెడల నిట్టివిపరీతపుమందబుద్ధు లేల పుట్టును? దేశమున శత్రువుల యార్భాటము లిట్లు చెలరేగియుండుటచేతనే, యీసమయమునఁ దీర్ఘయాత్రా ప్రయాణము ప్రమాదకరమని నేను చెప్పవలసివచ్చినది.”

“శివదేవా! నాపరిపాలనమున నిట్టి ఘోరకృత్యములు జరుగఁగలవని మొదట నను కొనలేదు సుమా! ఆహా! నాఁడెంతటిదుర్దినము? నిజముగఁ గుమారదేవుఁడే నా ప్రాణములుగాపాడెను. కాని వానికిమాత్రము నే నణుమాత్రమును దోడ్పడఁ జాలకపోయితిని. ‘దేవీ! నాపని ముగించిన’దని వాని యాక్రందనధ్వని వినినప్పుడే వానికిని నాకును ఋణముతీఱిపోయిన దనుకొంటిని. బలవంతముగ వానిని మోసికొని పోయి శత్రువులు చంపివేసిరో లేక ప్రాణములతోడనే కారాగృహబద్ధునిఁ జేసి యుంచిరో తెలియదు. వానినిమిత్తమై మనము పంపినగూఢచారు లెల్లరాజ్యముల యందుఁ గ్రుమ్మరుచున్నారు. మన సామంతరాజద్రోహులలోఁ గుమారదేవుఁ డెవ్వనిచే బంధింపఁబడెనో స్పష్టముగఁ దెలియనందున వానినిఁ బ్రాణములతో మాకప్పగింపనియెడల మీప్రాణములు దక్కవని భయపెట్టుచుఁ బ్రతిరాజునకు నుత్తరములు వ్రాసి పంపించితిమి. కాని యొకనియొద్దనుండియైనను బ్రత్యుత్తరము రాలేదు.”

“దేవీ! మొన్ననే కదా వ్రాసి పంపితిమి. అప్పుడే వచ్చునా? ముఖ్యమైన రహస్యము నే నిదివరకే మనవి చేసికొంటిని. ఈసాహసకృత్య మొక్క పాండ్యరాజువలనఁ దప్ప నితరులవలన జరుగనేరదు.”

“నిజము నిజము. నేనుఁ గూడ నట్టులే నిశ్చయించితిని. ఇంతకాలమువరకును, వారమునకు రెండు మూఁడుత్తరములచొప్పునఁ దనకుఁ దెలిసిన శత్రురహస్యములనెల్ల మనకు వ్రాయుచువచ్చిన త్రిపురాంతకుని జాడయే యిప్పుడు కానరాకున్నది. పాప మాతఁ డేమయ్యెనో కదా? ఈసంగతులన్నియు వానికిఁ దెలిసియుండిన యెడల ప్రపంచ మంతయు జల్లించియైనను గుమారదేవునిఁ బట్టి మన కప్పగించి

యుండును. ఆనాఁడేకవీరాలయమున వీరభటులతో వచ్చి నన్ను రక్షించినపుణ్యాత్ముఁడాతఁడే యని భ్రమపడితిని గాని, యావీరపురుషుఁ డెవఁడో త్రిపురాంతకదేవుఁడు కాఁడట. వాని పేరు సోమదేవుఁ డని వానితోఁ బ్రసంగించిన మనభటులలోఁ గొందఱు చెప్పుచున్నారు."

అని తనముఖ్యమంత్రి యగు శివదేవయ్యతోఁ బ్రసంగించుచు రుద్రమదేవి యొకనాఁటియుదయమునఁ దన మేడచావడిలో నుచితాసనముపైఁ గూర్చుండియుండెను. ప్రక్కనే సుఖాసీనుఁడై శివదేవయ్యయుఁ, నెదురుగ నున్నబల్లపైఁ బ్రతాపదేవుఁడును, వాని వెనుక వినయవిధేయులై ముకుళితహస్తులై నిలువఁబడిన యిరువురు రాజభటులును దప్ప నాకార్యస్థానమున మఱియెవ్వరును లేరు. కన్నులనుండి క్రోధానలజ్వాలలు ప్రజ్వలించుచుండ జేగురుమొగముతోఁ గాళికాదేవివలె నతిభయంకరస్వరూపయై యున్న దేవినిఁ గన్నెత్తి చూడలేక యచ్చటనున్నవారందఱు భయకంపితులై మొగములు వాల్చుకొని నిశ్శబ్దముగా నుండిరి. శివదేవయ్యతో నట్లు ప్రసంగించిన తరువాతఁ గొంతసేపువరకు నామె యెవ్వరితోడను మాటాడక, యూర్ధ్వవదనయై తనలో నేమో యోచించి, యోచించి పిదపఁ దన క్రూరదృష్టి యెదుటనున్నఁ బ్రతాపదేవునిపై నిలిపి,

"ప్రతాపా! కార్యవిచారమున మునిఁగి నిన్ను రప్పించినమాటయే మఱచిపోయితిని. మనపట్టణమునం దెచ్చట నేకవీర కానరా దేమి? ఆమెనుగూర్చి నీ వేమైన నెఱుఁగుదువా?"

"దేవీ! ఆమెను గూర్చి నాకేమియుఁ దెలియదు. ఇంతకు నామెప్రసంగముతో నాకేమియవసర మున్నది?"

"ఆలాగునా? నే నిచ్చట లేనిదినములలో నీ వామెను గోడలుగాఁ బరిగ్రహింపఁ బ్రయత్నించినట్లు వినియుండుటచేత, నిన్నీసంగతి యడుగవలసివచ్చినది."

"రామరామ! ఎంతపాపము! నేఁడు నాకెంతటిదుర్దినము? అమందభాగ్యుఁడగు నాకొడుకు నాగరాజు వద్దురా! నాయనా! యని నే నెంతబోధించినను వినక, యాయేకవీరను మోహించి యెంతప్రార్థించిన నామె తన్నుఁ బెండ్లాడుట కిష్టపడనందున విఫలమనోరథుఁడై యామోహాతిశయమునఁ దుదకుఁ బిచ్చెత్తి, వెఱ్ఱికేకలతో వీథులవెంటఁ దిరుగుచు నేమయ్యెనో కాని పదిదినములనుండి పట్టణమున నెచ్చటఁ గానరాకున్నాఁడు."

"అయ్యో! పాపము! చారుల నంపి వెదకింపలేకపోతివా?"

"తల్లీ ! అంత ప్రయాసపడుటకు నా కవసరము కనఁబడలేదు. దైవమొసంగినయాయుం వున్నచో బ్రదుకును. లేనిచో గతించును. గతించినచో వానివలన నా కీయప నిందలే తప్పిపోవును."

"రామరామ ! అట్లనకు—పాపము వానివ్రాఁత యీరీతిగా నున్నది—సరే పోనిమ్ము ! ప్రతాపా ! ఏకవీర యేకారణముచే నెచ్చటికిఁ బాఱిపోయియుండు నని నీ యభిప్రాయము ?"

"దేవీ ! ఒకసారి తనపుట్టినింటికిఁ బోయి తల్లినిఁ జూచుకోర్కెయున్నట్టు లామె యప్పుడప్పుడు నాతోఁ జెప్పుచువచ్చెను. దేవి వచ్చినతరువాత నామెసెలవు గైకొని పోరాదా యని నేనంటిని. పుట్టినింటి కేఁగుటకై మిమ్మడిగినచో మీరుసెల వీయ రనియు, నందుచే మీరులేనప్పుడే పోయి, మీరు తిరిగి వచ్చులోపుననే తానును మరలఁ దిరిగివచ్చునట్లు నాతోఁ జెప్పెను. ఇంతకు మించి నేనేపాపము నెఱుఁగను."

"ఆమెకు నీవేమో చంపఁ బ్రయత్నించితి వఁట నిజమేనా ?"

"నేనా ? నేనా ? ఏకవీర నా ? అయ్యయ్యో ! ఏమీ సాహసము ? నా బ్రదుకు బ్రద్దలుగాను. ఇంత ఘోరకృత్యమున కొడిగట్టెదనా ? దేవీ ! నా కేమి దారి ? ఈ యపకీర్తి నేనెట్లు భరింపఁగలను ? అయ్యయ్యో ?"

అని గద్గదస్వరముతోఁ బలుకుచుఁ బ్రతాపదేవుఁడు కడకు రోదనముసేయ నారంభించెను. ఆ బొల్లియేడుపు చూచి శిరము పంకించుచు —

"ప్రతాపా ! నేను విన్నసంగతి నిన్నడిగితిని. ఇంతమాత్రమునకై రోదన మెందుకు ? చాలు చాలు మంచి ప్రయోజకుఁడవే !"

అని దేవి వానిని మందలించుచుండ నప్పు డొక సేవకుఁ డత్యాతురతతో నచ్చటికిఁ బరతెంచి, వినయవిధేయుఁడై రాణికి నమస్కరించి, చేతనున్న యుత్తర మామెకుఁ జూపుచు—

"దేవీ ! ఎవఁడో యొకమూగివాఁడు వచ్చి నాకీయుత్తర మిచ్చినాఁడు."

"మూగివాఁడా ? ఎచ్చటనుండివచ్చినాఁడు? ఆయుత్తర మెవ రిచ్చిరి? సరే చూచెదను."

"ఏసంగతి యడిగినను, వాఁడు మాటాడక సంజ్ఞలు చేయుచున్నాఁడు. అవి నాకు బోధపడలేదు."

అని చెప్ప దేవి యా యుత్తరము నందుకొని మొదటఁ దనలోఁ దానే చదువుకొని, వికసితవదనయై "శబాస్! త్రిపురాంతకా! శబాస్! నీఋణము నే నీజన్మమునఁ దీర్చుకొన లేనురా! శివదేవా! మన మనుకొన్నదే నిజమైనది. ఈ యుత్తరము విను.

"దేవీ!

ఆనాఁ డేకవీరాలయమున నాభటవర్గముతోఁ బ్రవేశించి, శత్రువుల బారి నుండి మిమ్ముఁ దప్పించి. యప్పటినుండియుఁ గుమారదేవునకై విశ్వప్రయత్న మొనర్చు చున్నాను. నేఁటికి వానియునికి స్పష్టముగా నాకుఁ దెలియకపోయినను, సజీవుఁడై యున్నట్టుమాత్రము వినుచున్నాను. కొలఁది దినములలోనే వానినిఁ దమపాదములసన్నిధికిఁ దోడ్కొని రాఁగలను. వానినిగూర్చి లేశమును మీరు విచారింపఁ బనిలేదు. మీరాజ్యమునందలి శత్రువు లచ్చటచ్చటఁ బన్నుచుండిన కపటవ్యూహములను నేను ఛేదించుచుంటినిగాని, మీచెంత నేయున్న మీ గృహశత్రువు పన్నుచుండిన కుతంత్రముల నేనరయఁ జాలకున్నందుకు మిక్కిలి సిగ్గుపడుచున్నాను. గొప్పవింతలు ముందు తెలియఁగలవు. సర్వేశ్వరుఁడు మనకుఁ దోడగుఁగాక.

ఇట్లు మీసేవకుఁడు,

"త్రిపురాంతకుఁడు."

ఆయుత్తర మంతయు విని శివదేవయ ప్రతాపదేవునివైపు చూడ నాతఁ డేదో గొప్పయపరాధము చేసినవానివలె దీనవదనుఁడై చిన్నవోయి మొగము వంచుకొనెను.

---

## 17-వ ప్రకరణము

### రాజద్రోహసంకల్పము

"ఈసానిటక్కులు నాయొద్దనా? ఈమాయమాటలు నాతోడనా? ఎంత గడుసుఁదనము? ఆపాటిమర్మము కనిపెట్టలేని వట్టిపనికిమాలినమూర్ఖుఁడ ననుకొనుచున్నది కాఁబోలు? చేతులు త్రిప్పుకొనుచుఁ, గన్నులు చిట్లించుచు నేమియు నెఱుఁగని నంగనాచివలె 'ఆమెను నీవు చంపఁ బ్రయత్నించితివఁట! నిజమేనా?' యని నన్నుఁ బ్రశ్నించినది. ఎంతగొప్పప్రశ్న? ఆ ప్రశ్నతో భయపడి నేను నిజము చెప్పివేసెద నని యామె భ్రాంతి. అయ్యో! ఎంతవెఱ్ఱితనము? ఏమైననేమి? ఆమె యదృష్టము బాగున్నది. ఆమె దినములు మంచివి. నేను పన్నిన వ్యూహ మంతయు బూదిలోఁ బోసిన పన్నీరువలె వ్యర్థమైనది. తెలివిమాలినమూర్ఖులు-వట్టిపశుప్రాయులు-

ఆహారిహారమురారిదేవు లిరువురును-ఎందుకును బనికిరాని యాచవటపీనుఁగైన కుమారదేవుని విడిచిపెట్టి యీరక్కసిముండను బట్టి మోసికొనిపోయి యాపాండ్యరాజు చెరలోఁ బడవేసియుండినచో, నాకార్యమిన్నివిధముల భగ్నము కాకపోవును గదా? అంతేకాక, చేతఁజిక్కిన యాకుమారదేవునిఁ బ్రత్యేకముగా మధురానగరమునకు మోసికొనిపోయిరఁట! ఎందుకో? గడ్డికోయుటకుఁ గాఁబోలు? ఈతెలివితక్కువపనులు నాకాగ్రహమునకు మారు నవ్వుపుట్టించుచున్నవి. అతిసూక్ష్మముగా రుద్రమదేవినిఁ గడతేర్చుట కింతకన్న గొప్పయవకాశము నాకిఁకముందు లభించుట యబద్ధము. పోయినది. మంచి తరుణము పోయినది. ఈమె మరలఁ బ్రాణములతో నింటికివచ్చిన దుర్వార్తవిని పాపము మాజైనస్వామి యెంత విచారించియుండునో? అతఁడే కాఁడు. మాయిరువురితోఁబాటు పాండ్యరాజుసైతము నెంతయో నొచ్చుకొనక మానఁడు. అయినను—ఒకవిధముగా నాలోచింప నింతమాత్రమునఁ జింతించుట యుత్తమపురుషలక్షణము గాదు. దేనికైన నంతమున్నది కాని బుద్ధియనుదానికింతయని యంతములేదుకదా? కావున నాశేషముషీవిశేషము నింకను వెల్లడించి, కొనసాగువఱకు నేను బట్టినపట్టుదల విడువను. విడువక కర్తవ్యాంశమునతిజాగరూకతతో నాలోచింపవలయును...... మొదటినుండియు నాప్రయత్నము కుమారదేవునిఁ గడతేర్చి యందుమూలమున నన్నమదేవుని రుద్రమదేవికిఁ శత్రువుగా నొనర్చుటయే కదా? ఆప్రయత్నమున కిప్పుడేమి భంగమున్నది? నేఁడే పాండ్యరాజున కుత్తరమువ్రాసి, చెరలోనున్న యామందభాగ్యు నంతమొనరించునట్లు చేసి, వెంటనే యాశుభవార్త దేవికిని నన్నమదేవునకును దెలియునట్లు లేర్పాటుగావించెదను. మందబుద్ధినై మొదటఁ దప్పుతలంచితిని గాని నాప్రయత్నము లేశమును భంగము కాలేదు. దేవిని సూక్ష్మముగాఁ గడతేర్చుట కిదిమాత్ర ముపాయము గాదా? అన్నమదేవుఁడు శత్రువుఁడైనతరువాత నామె జీవింపఁగలదా? నా వ్యూహమున కిప్పుడేమి యవాంతరము తటస్థించినది? ఏమియును లేదు. అన్నియు సానుకూలముగానే యున్నవి. ఒకప్పుడు - ఏకవీరవలన నారహస్యములు కొన్ని రుద్రమదేవికిఁ దెలియవచ్చును. అట్లు తెలిసినయెడల దేవి నన్ను శిక్షింపక మానదు. అందుచే ముందుగానే తగినయుపాయ మాలోచింపవలయును. నేను తన్నుఁ జంపఁ బ్రయత్నించుచున్నానని విని, యాభయముచే నామె పుట్టినింటికే పాఱిపోయియుండును. ఆమె యించుక యందకత్తెయగుటచే నిదివఱకే మార్గమధ్యమున నామె నెవ్వరైనఁ జెరపట్టి తీసికొనిపోయియుందురు. లేదా యేక్రూరజంతువైన నామె నాహారముగాఁగబళించియుండును. ఈరెండును, జరుగక, దైవవశమున నామెక్షేమముగానే

యిల్లుసేరి, క్షేమముగానే మరల నిచ్చటఁ బ్రవేశించి, నేను తన్నుఁ జంపఁబోయిన సంగతి దేవికి విన్నవించినచో, నాకుమారుఁడు తన్ను మోహించి, బాధపెట్టియున్న కారణముచే నాపై నిట్టికొండెములు కల్పించుచున్నదని సమాధానముచెప్పి యెట్లు లైనఁ దప్పించుకొనఁగలను, అందుచే నదియొక ప్రమాదముగాఁ బరిగణింపవలసినది కాదు. ఎన్నివిధముల నాలోచించినను - ఒక్క త్రిపురాంతకదేవునివిషయమే నాకు దుర్గ్రాహ్యముగా నున్నది. అబ్బా! వాఁడెంత మొండిముండకొడుకు? మూలనున్న యెన్నిరహస్యములను పైకిఁ దీయఁగలఁగుచున్నాఁడు? వానికి దివ్యజ్ఞానమున్నదా యేమి? ఎట్టులైనను నేఁటిదినమున వానియొద్దనుండివచ్చిన యుత్తరమునుబట్టియాలోచింప నేను కొంతవఱకు జాగ్రత్తగానే యుండవలసియున్నది. ఒకప్రక్కనుండి నేను - ఇంకొకవైపునుండి జైనస్వామియు-వేఱొకవంకనుండి, పాండ్యరాజు గూఢ చారులనంపుచు దేశమంతంతట నెంత వెదకించినను వాఁడు పట్టుఁబడకున్నవాఁడు. ఇంతకన్న దురదృష్టమేమున్నది? వానియుత్తరమందలి గృహశత్రుప్రసంగము నన్నుఁ గూర్చియేకదా! నన్నుఁగూర్చి యాతఁ డెట్లు తెలిసికొనఁగలిగెను? ఒకవేళ జైనాచార్యునకుఁగాని, పాండ్యరాజునకుఁగాని నేను వ్రాయుచు వచ్చినయుత్తరములలో నొకటిరెండు వానిచేతిలోఁ జిక్కియుండునా? అట్లనుకొనుటకుఁగూడ వీలులేదు. నేనువ్రాసినయుత్తరములకెల్లఁ గ్రమముగాఁ బ్రత్యుత్తరములు నాకు వచ్చుచున్నవే? ఇందులో నేమి తంత్రముజరుగుచున్నట్లు నేననుకొనవలయు? ఒకవేళ జైనస్వామి యొద్దకుగాని, పాండ్యభూపతియొద్దకుఁగాని, మారువేషములతో నాకపట పత్రనుఁ డేఁగి, వారియొద్దనున్న యుత్తరము లేమైనసంగ్రహించియుండునా? అబ్బేబ్బే! అది కలలోనివార్త-పట్టిపిచ్చితలంపు............దూరదృష్టితోఁ బరిశీలింపఁ ద్రిపురాంతకుఁడుగూడ రుద్రమదేవిని మోసపుచ్చుచున్నాఁడనియే తోఁచుచున్నది. ఏలయనఁగా ముందుముందు వానికి దేవియొద్ద నుద్యోగముసంపాదించునాశ యొకటి ప్రబలముగా నున్నది కదా? ఆయాశచేత దేవికిఁ దనపై మిక్కిలి యభిమానము జనింపవలయునని-తానేమో ప్రయాసపడి రాజ్యమునకు గొప్పయుపకారముచేయుచున్నట్లు దేవి భావించి తన్ను మెచ్చుకొనవలయునని-యాతఁడు మాటిమాటికి నున్నవికొన్ని లేనివికొన్ని సంగతులు కల్పించి యిట్టిదొంగయుత్తరములు వ్రాయుచున్నాఁడని నాయుద్దేశము. అట్లు కానిచో నింతగూఢముగాఁ బ్రవర్తించుచుండిన నేను దేవికి గృహశత్రువునని పోల్చుకొనఁగల్గుట కాతఁడు భగవంతుఁడా యేమి? మానవమాత్రుఁడే కదా! అందుచే నాయుత్తరములో గృహశత్రు వనుమాట పట్టి భేషజముకొఱకే వ్రాసియుండును గావున నేను సందేహింపవలసిన పనిలేదు.

ఏకారణమైనను నేను జాగ్రత్తగానుండుట మంచిదికదా? ఇంతకు జాగ్రత్తగా నుండవలసిన సమయము గూడ వచ్చినది. తీర్థయాత్రనుండి వచ్చినప్పటినుండియుం యుద్ధప్రయత్నములలో దేవి మిక్కిలి పట్టుదల వహించియున్నది. ఆమెపట్టుదల చూడ లోకమంతయుం మ్రింగివేయునట్టు కనఁబడుచున్నది. ఈసంగతులన్నియుఁ బాండ్యరాజాదులకుఁ దెలియఁజేసి, వారిచేతఁగూడఁ ద్వరలో రణసన్నాహము చేయింపవలయునుగదా? మహాసేనాసమన్వితముగఁ దక్షిణమునుబయలుదేఱి, త్వరలో నాంధ్రరాష్ట్రముపై దండెత్తవలయునని దేవగిరిప్రభువునకుఁ గబురంపుట యన్నిటి కన్న ముఖ్యమైనపని. సమయమువచ్చినప్పుడు యుద్ధరంగమున మీపక్షమున నిలిచి పనిచేసెదమని కొందఱు మాండలికప్రభువులు వాగ్దానము లొనర్చిరి కాని, యన్న మాట తప్పకుండ దేవగిరివారరుదెంచినయెడలఁ దక్కినవారినిఁగూర్చి యంతలక్ష్యముంచ వలసిన యవసరములేదు. ఈపాటికైనఁ ద్వరపడి యుద్ధప్రయత్నము లొనర్పకున్న యెడల రహస్యము లింకను బైలుపడుచుండును. ఇచ్చటి సైనికులసంఖ్యయుఁ బ్రయత్నములయందలి విశేషములును జైనస్వామికిఁ దెలియపఱచి వెంటనే పాండ్యరాజు నకుఁగూడ విశదపఱచెదను. ఇంక నుత్తరములతోఁ గార్యము లేదు. వ్రాసినయెడల నొకప్పుడు ముప్పుఁగూడ రాఁగలదు. అందుచే వర్జ్యములు లేకుండ జూచి, శుభలగ్నమున నేను స్వయముగానే బయలుదేఱి యాచార్యునియొద్దకుఁ బోయెదను. "శుభస్య శీఘ్ర"మ్మని కదా కార్యవేదుల వేదవాక్యము."

అని ప్రతాపదేవుఁడు రుద్రమదేవియొద్దనుండి సెలవుగైకొని యింటికి వచ్చినతరువాత నొంటరిగాఁ గూర్చుండి, యిట్లు కార్యక్రమమునుగూర్చి విచారించుచుండెను. అప్పుడు మధ్యాహ్నము పండ్రెండుగంటలు కావచ్చినందున, లోపలినుండి బిజ్జలుఁడు వచ్చి "స్వామీ! భోజనమునకు వేళయైనది. లెండు!" అని చెప్పెను. తోడనే ప్రతాపదేవుఁడు వానినిఁ జూచి "బిజ్జలా! భోజనముమాట కేమి? కడుపునిండ హాయిగా భుజింపవలసిన దినము లింకను ముందున్నవి. ఆమాట కేమిగాని, నేఁటిసాయంకాలమున నాలుగు గంటలకు మనము జైనాశ్రమమునకు బయలుదేఱవలసియున్నది. నీవు మొద్దువలె నెచ్చటనో పరుండి నిద్రింపక భోజనమైనవెంటనే ప్రయాణసన్నాహమున నుండుము" అని పలికి వెంటనే యాతఁడు స్నానమునకు లేచెను.

---

10

## 18-వ ప్రకరణము

### త్రిపురాంతకదేవుఁడు

ఆనాఁ డాపర్వతప్రాంతమునఁ గల తాఁటాకుల యింటిలో రంగనితో నతి రహస్యముగఁ బ్రసంగించి దేవదేవుఁడు మధురానగరమునకు బయలుదేఱిన మరునాఁటి యుదయముననే, మఱియొక క్రొత్తపురుషుఁ డాయింటిలోఁ బ్రవేశించి, యచ్చటనున్న వారితో నేమో ప్రసంగించుచుండెను. వారందఱు లోపలనున్న చావడియందుఁ గల చాపలపైఁ గూర్చుండి, యేదో గొప్పయాపద సంభవించినట్లు దీనవదనులై యుండిరి. వారిమధ్యఁ గూర్చుండిన యా క్రొత్తపురుషుఁడు తనయెదుటనున్న వారితోఁ గొంతవఱకు మాటాడి, యెందుచేతనో చిత్రప్రతిమవలెఁ జలనములేక నిశ్శబ్దముగా నధివసించియుండెను. కొందఱు కూర్చుండియుఁ గొందఱు నిలిచియుండియు వానిచుట్టును గుమిగూడి యున్న వీరపురుషులెల్లరు గంభీరముగ నాతని వదనమండలము వీక్షించుచు నెడతెరిపి లేకుండ విచారించుచుండిరి. ఆసుందరపురుషుని ప్రక్కనే రంగఁడు విషాదాంతరంగుఁడై దీనవదనుఁడై నిట్టూర్పులు విడుచుచుఁ గూర్చుండియుండెను. అట్లాపరివారమంతయుం నిశ్శబ్దముగానుండఁ గొంతసేపునకా వీరపురుషుఁడు రంగనితో నిట్లు ప్రసంగించెను.

"రంగా! నిజముగా మనకు గొప్పమోసము సంభవించినది. కార్యక్రమము నారంభించి నది మొదలు నాకెన్నఁడు నిట్టిభంగపాటు కలుగలేదు. ఆయుత్తరము నాధారముగాఁ జేసికొని, నేను మధురానగరమునకుఁ బోయి, యచ్చట జిత్రమైన యొక నాటకము నాడింపవలెనని యింతవఱకుఁ గొండంత ప్రయత్నముతో నుంటిని. అదంతయుం నిప్పుడు వ్యర్థమైపోయినది. ఇంకముందు నేను చేయవలసినదేమో తెలియదు."

"స్వామీ! మీకు మహాపరాధ మొనర్చితిని. నన్ను క్షమింపుఁడు. నేనే కాదు. వానినిఁ జూచి మేమందఱము మోసపోయితిమి. అజ్ఞానదేవత మమ్మందఱి నొక్కమాఱే యావేశించినది. ఆకంఠస్వరము-ఆకన్నులు-ఆముదురు-ఆచెక్కుల నిగనిగ-వేయేల? ఆ స్వరూపమంతయుం మూఁడుమూర్తులును మీరే! దేవా! జరిగిన మోస మెట్టులయినను జరిగిపోయినది. కాని యిందువలన గొప్పవింతయొకటి కనిపెట్టఁగలిగితిమి. లోకములో నొకమనుజునిఁ బోలినవారింకొక రుండకపోరు. కాని యచ్చుగుద్దినట్టు లణుమాత్రమును గుర్తించుటకవకాశములేని యేకాకారముగల రెండుస్వరూపములు లోకములో నుండునని నే నిదివఱకు కనుఁగొనలేదు."

"రంగా! చెప్పకేమి. నాకుఁగూడ నిది వింతగానే యున్నదిసుమా; ఒక్క చెల్లెలు తప్ప నాకన్నదమ్ములుసైతము లేరుకదా? నాయాకారముగల పురుషుఁ డెందుండి వచ్చెను?

రంగా! పోనిమ్ము. జరిగినదేదో జరిగినది. ఇంక ముందుసంగతి విచారింతము. అట్లు వచ్చి యామంత్రముఁ గొనిపోయినపురుషుఁడెవఁడై యుండునని నీయభిప్రాయము?"

"దేవా! వాని కులగోత్రనామములు నాకెట్లు తెలియఁగలవు?

"కులగోత్రనామములు కావోయి! అతఁడు శత్రుపక్షమునకు సంబంధించినవాఁడా! లేక మనలోనివాఁడా?"

"దేవా! మొదట శత్రుపక్షములోనివాఁడే యని నిశ్చయించుకొని యందును గూర్చి తర్కింతము. మనకు శత్రువుఁడే యైనయెడల వచ్చినవాఁ డామంత్రమును గొని పోయినంతమాత్రముతో నూరకుండునా! మనరహస్యములన్నియుఁ బాండ్యరాజునకును జైనాచార్యునకును వెల్లడించి, యింతవఱకు మనకెట్టియుపద్రవమైనఁ గల్గించి యుండఁడా? అంతియే కాక, వాఁడు నిజముగా మనకు శత్రువుఁడే యైనయెడల జైనాచార్యుని యంత్రమంతయు నట్లు దిద్దిపెట్టుట కేమికారణము?"

"ఆలాగునా? ఏ యేసంగతులు దిద్దఁబడినవి?"

"దేవా వినుఁడు —'నీ యంత్రము తెచ్చిన యీమహావల్లుఁడు మిక్కిలి చాకచక్యము కలవాఁడైనందునఁ ద్రిపురాంతకదేవుని వెనకి పట్టుకొనుటకును జైనభటులకు యుద్ధక్రమము నేర్పుటకును వీనిని నాయొద్ద నుంచికొని, వీనికి మాఱుగా దేవదేవుని నీకడకుఁ బంపించితి'నని యాతఁడు మార్చి వ్రాసినాఁడు. ఒకప్పుడు పాండ్యరాజుకడకు మీరే యాయంత్రముతోఁ బోవలసివచ్చినను, పై సంగతుల నట్లు మార్చి వ్రాయక తీరదు కదా? అందుచే నాతఁడు శత్రువుఁడే యైనయెడల నీసాహస మేల కావించును?"

"రంగా! నీవు చెప్పినది కొంతవఱకు యుక్తియుక్తముగనే యున్నది. కాని, యాతఁడు మనపక్షములోనివాఁడే యైనచో నాపేరును, నావేషమును దాల్చి యిట్లు గూఢముగాఁ బ్రవర్తించుట కేమి కారణము? తన నిజమైన సంగతిచెప్పి తాను వచ్చిన కార్య మెఱింగించి యామంత్రమును గొనిపోఁ గూడదా? ఆయంత్రముకొఱకే వాఁడిచ్చటకు వచ్చెనని చెప్పుట కేమైన నాధార మున్నదా? లేదు. ఏమైనను మొత్తముపై నిదంతయు నగమ్యగోచరముగా నున్నది. వానిసంగతి "ఇద మిత్థ" మని నిశ్చయించుటకు వీలులేదు. జరిగినదేమో పొరపాటే! దైవసంకల్ప మిట్టుండఁగా నీవు మాత్ర మేమి చేయఁగలవు? ఆయంత్రము నాధారముగాఁగొని నేను మధురానగరమునకుఁ జని, యచ్చటఁ గుమారదేవునిఁగూర్చి ప్రయత్నింపవలె నని యనుకొంటిని. ఆసంకల్పము వ్యర్థమైనందున వానినిఁ గూర్చి మఱియొకయుపాయ మాలోచింపవలయును. ఎందుకొఱకైనను మనము జాగ్రత్తతో నుండవలసినదినములు

వచ్చినవి. శత్రువులు మనజాడ పసికట్టినట్లు నాకనుమానము కలిగినది. అందుచే నిత్యమును మనయాశ్రమమునకు మూఁడునాలుగు క్రోసులదూరమువఱకు మధురానగరమువైపు కొందఱిని, జైనాశ్రమమునకు కొందఱిని గూఢచారులనుబంపించుచు శత్రువు లెవరైన మనపైకి దండెత్తి వచ్చుచున్నారేమో నిత్యముఁ గనుగొనుచుందుము. ఏక్షణమునందు శత్రువులు మనపైఁ బడినను వారి నెదిరించి పోరాడఁగలుగుట కనుకూలముగా మన పరివారమంతయుఁ బ్రతిక్షణమును సిద్ధముగానే యుండవలయును.”

అని యింక నేమేమో చెప్పఁబోవుచుండ నింతలో వీథితలుపు నెవరో తట్టినట్టు ధ్వని వినవచ్చినందున నతఁ డాప్రసంగమును గట్టిపెట్టి తనదృష్టి నాధ్వనివైపునకు మార్చెను. క్రమక్రమముగా నాతలుపు చప్పుడు మఱింత యధికమై “ఏకవీరా! ఏకవీరా! తలుపుతియ్యి” అను మాటలు స్పష్టముగా వారందఱికి వినఁబడఁజొచ్చెను ఆమాటలు వినినతోడనే త్రిపురాంతకుఁ డొక్కమాఱు త్రుళ్లిపడి యిటునటుఃజూచి “రంగా ఏకవీర యెవరు? నాచెల్లెలుగాదు కదా? ఆ పిలుచుచున్నవాఁ డెవఁడో కనుఁగొని వెంటనే యిచ్చటకుఁ దీసికొనిరమ్ము.” అని పలికినంతనే రంగఁడును వానివెనుక మఱినలువురు భటులును బరుగు పరుగున వీథిలోనికిఁ బరుగెత్తిరి. ఆవచ్చినవా రెవరో కనుఁగొనవలయునని త్రిపురాంతకుఁ డత్యాతురతతో నెదురుచూచుచుండఁగా వీథిగుమ్మములోనుండి పెద్దకేకలును నవ్వులును వానికి వినఁబడజొచ్చెను. అందువలన నాతఁడు మఱింత వింతపడి చూచుచుండ రంగఁడు పిచ్చివాఁడైన నాగరాజును దీసికొనివచ్చి పకపకనవ్వుచు వానియెదుటఁ గూర్చుండఁబెట్టెను. ఆవికారాకారమును బట్టి యాతఁడు పిచ్చివాఁడని త్రిపురాంతకుఁడును దక్కినవారును వీక్షణమాత్రముననే గ్రహించిరి. విఘ్నేశ్వరునివలెఁ దనయెదుటఁ గూర్చుండిన నాగరాజును జూచి త్రిపురాంతకుఁడు నవ్వుచు—

“అబ్బాయీ ! నీ వెవ్వరు ?”

“నేనా ? నేనా ? నాభార్య యేకవీర. ఏదీ ? ఆమె యెచ్చట నున్నది ? మాతండ్రియే చెప్పినాఁడు. వాఁడేఁడీ! ఏకవీరను జంపుచున్నాఁడా? అయ్యో ! అయ్యో ! నాకేమి దారి? నిజముగాఁ జంపివేయఁడు కదా ? తండ్రీ ! వద్దు ! వద్దు. చంపకు. ఆమె నా భార్య. నీకు ముద్దుకోడలు. నన్నుఁ జంపినఁ జంపు. ఏకవీరా ! నీకు భయము లేదు. రా ! రా !”

“ఓయీ ! నీ దేయూరు ? నీతండ్రి యెవరు ?”

"నాదేయూరా? ఈయూరే! ఏకవీర యెచ్చట నున్న నాకదియే యూరు. ఏకవీర యేలోకములో నున్న నాలోకముగూడ నదియే! ఏకవీరయే నాభార్య. ఏకవీరయే నాప్రాణము. ఏకవీరయే నేను. నేనే యేకవీరను."

"ఓరీ పిచ్చివాఁడా! పోనిమ్ము. ఆయేకవీర యెవరో చెప్పు."

"నాతండ్రియే చెప్పినాఁడు. నాతండ్రి చెప్పుటచేతనే నే నేకవీరను మోహించినాను. నీ వేకవీరవు కావా? ఏదీ ఒక్కముద్దు."

అని తనపైఁ బడుచుండిన నాగరాజును దూరముగాఁ ద్రోలఁగించి, త్రిపురాంతకుఁడు వానియవస్థకు మిక్కిలి వగచుచు, నాతఁ డెవఁడై యుండునో యని తనలో వితర్కించుచుండెను. ఆతఁ డుచ్చరించుచుండిన యేకవీర తనసోదరియో లేక యాపేరుగల మఱియొకతెయో యని వానికిఁ బెద్దసందేహము కలిగినది. అందుచేఁ ద్రిపురాంతకుఁడు నాగరాజును విడిచిపెట్టక పాఱిపోకుండ వానికరచరణములు బంధించి యొకగదిలోఁ బడవేయించెను.

---

## 19-వ ప్రకరణము

### మూర్ఛసంకటము

త్రిపురాంతకదేవునియాజ్ఞ ననుసరించి, యీవల మధురానగరమునుండి యావల జైనాశ్రమమువఱకును, నిరంతరము గూఢచారులు సంచరించుచు నెప్పటివృత్తాంత మప్పుడు తమప్రభువున కెఱింగించుచుండిరి. మఱియు నించుక యనుమానము గలిగిన ప్రతిమార్గస్థుని బట్టి తనయొద్దకుఁ దీసికొని రావలసిన దని కూడఁ ద్రిపురాంతకుఁడు తన భటులకుఁ గఠినముగ నాజ్ఞాపించెను. ఒక్కొక్కప్పు డాతఁడు స్వయముగానే తురంగారూఢుఁడై యిల్లు విడిచి బయలుదేఱి, యాప్రాంతములయం దంతట సంచరించి మరల నింటికి వచ్చుచుండును. నాగరాజు పిచ్చిమాటలు వినినప్పటినుండియుఁ వానిచిత్త మేకవీరను గూర్చియే పలువిధములఁ దలపోయఁ జొచ్చెను. ఆ పిచ్చివాని మాటలవలనఁ దన చెల్లెలి కేదైన నాపద సంభవించియుండునేమో యని యనుమానము వహించి, నాగరాజువలన నాసంగతి కనుఁగొనవలయునని పెక్కుసారులు వానిని మాటాడించి చూచెను; కాని యేమాట యడిగినను వాఁడు వెట్టినవ్వులు నవ్వుచు, వెట్టియేడ్పు లేడ్చుచు-ఏకవీర-తండ్రి-బలవంతము-మోహము-అనుమాటలు తప్ప నొకసంగతియైనను సందర్భముగా జెప్పలేదు. ఒక్కొక్కప్పుడు-ఏకశిలానగరము-రుద్రమదేవి-అనుమాటలుఁ గూడ నాగ

రాజు వాక్ప్రవాహములో దొర్లుచున్నందునఁ ద్రిపురాంతకుఁ డది కనిపెట్టి, యా పిచ్చివాఁ డేకశిలానగరవాస్తవ్యుఁడై యుండు ననియు దన చెల్లెలిని మోహించి, యామె యంగీకరింపనందున మోహాతిశయముచే నిట్లు పిచ్చివాఁడై తిరుగుచుండె ననియుఁ గొంత గ్రహింపఁగలిగెను.

ఒకనాటి మధ్యాహ్నమునఁ ద్రిపురాంతకుఁడు భోజనముచేసి, రంగనితోఁ ప్రసంగించుచు నడవలో నిటునటుఁ బచారుచేయుచుండెను. ద్వారముకడనే నిలువఁబడి రంగఁడు వానికిఁ దగినసదుత్తరము లొసంగుచుండెను. అప్పు డాకస్మికముగఁ గొందఱుచారులు దాదాపుగ నలువదిసంవత్సరములు వయస్సుగల యొకపురుషునిఁ గరచరణములు బంధించి వీథిలోనుండి లోనికి మోసికొని వచ్చుచుండుట రంగఁడు చూచి, "దేవా! నేఁ డేదో మరల క్రొత్తవింత మనము చూడఁగలము. అదిగో? అటు చూడుఁడు." అని పలికి యాతురతతో వారివైపు పరుగెత్తెను. రెండుమూఁడు నిముసములలో నాచారులెల్లరుఁ గరచరణబద్ధుఁ డగు నాపురుషుని మోసికొని వచ్చి త్రిపురాంతకదేవుని పాదములయొద్దఁ బడవైచి నమస్కరించి, "దేవా! నేఁటివేఁటలో మాకీ మృగము లభించినది. నేఁటియుదయమున నీతఁడు పాప మొకపాడుదేవాలయములోనుండి వచ్చుచుండగా నందందు సంచరించుచుండిన మేము కనిపెట్టి వానివెనువెంటనే యొకమైలుదూరము వఱకుఁ బోయి యచ్చట నడ్డగించి మంచిమాటలతో మావెంట రానందున దేహశుద్ధి చేసి యిట్లు కొనివచ్చితిమి" అని విన్నవించుకొనిరి. వారిమాటలకుఁ ద్రిపురాంతకుఁడు మిక్కిలి సంతసించి యాపురుషుని బంధనములను విప్పించి కూర్చుండఁ జేసెను. కాళ్లు పారఁజాపి, కన్నులు తేలవైచి, నోట మాట లేక యాపురుషుఁడు ప్రాణము పోవుచున్నట్లు లిటునటు జోగిపడిపోవుచుండఁ జెంతనున్నవా రాతనిని బట్టుకొని, సరిగాఁ గూర్చుండఁబెట్టుచుండిరి. అది చూచి త్రిపురాంతకుఁడు మొదట నాతఁడు జీవించునో లేదో యనిభయపడెను గాని, యాపురుషుఁడు పట్టి దొంగ యనియు టక్కరి యనియుఁ జారులు చెప్పినందున నతఁడు నవ్వుచు వానిచెంతనే తానును గూర్చుండి "ఓయీ! నీ దేయూరు! నీ దేయూరు! ఎచ్చటనుండి యెచ్చటికిఁ బోవుచున్నావు." అని యడిగెను. ఆమాట కాపురుషుఁ డూరక యాయాస మభినయించుచు నిట్టూర్పులు విడుచుచు మాటాడలేక మాటాడుచు నిట్లు ప్రత్యుత్తర మీయసాగెను.

"అయ్యా! ఏకశిలానగరమునకు సమీపముననే యున్న యొకపల్లెలో నేను జీవనము చేయుచున్నాఁడను. నాపేరు రామదాసు. పుట్టినప్పటినుండి దరిద్రుఁడ నగుటయే కాక మూర్ఛారోగముచే మిక్కిలి బాధపడుచు ననేకదైవములకు మ్రొక్కుకొంటిని

గాని లేశమును లాభము లేకపోయినది. కడకాంజనేయోపాసకుఁడనై మాపల్లెకు సమీపముననే యున్న యొకపాడు దేవాలయములోని యాంజనేయవిగ్రహమును బ్రతిదినమును రెండుపూటల దర్శించుచు నాస్వామి నారాధించుచుండుటచేత నా రోగము కొంచెము బాగుపడినట్లు కనఁబడెను. అట్లే నేటి యుదయమునఁ గూడ నే నాగుడినుండి వచ్చుచుండఁగా నీ దుర్మార్గులు నన్ను—"

అని చెప్పలేక పాప మాతఁడు రోదనము సేయ నారంభించెను. ఏడ్వవల దని త్రిపురాంతకుఁ డాతని నోదార్చుచుండఁగా లోపలినుండి యొక వీరభటుఁడు పరుగు పరుగున నచ్చటికివచ్చి యామూకలోఁ జొరఁబడి యచ్చటనున్న నూతనపురుషునిఁ జూచి, పెద్దకేక వేసి, త్రిపురాంతకునితో "వహ్వా! నేఁ డెంతటి సుదినము? దేవా! ఈతఁడు రుద్రకుదేవికి మహోపకార మొనర్చుచుండిన మహనీయుఁడు. జైనాచార్యునికిఁ బ్రాణ మిత్రుఁడు. ఇంక దాపనేల! ప్రతాపదేవుఁడు. దేనినిగూర్చి యాచండాలుఁ డెన్ని కుతంత్రములు పన్నుచుండునో తమకుఁ జెప్ప నక్కఱలేదు. నే నేకశిలానగరమునఁ కేఁగి నప్పుడు పెక్కుసారులు వీనిని జూచినాను." అని పలికెను. ఆమాటలు విని, అచ్చట నున్న వా రందఱు నిర్ఘాంతపడి చూచుచుండ, నాపురుషుఁడు తన రెండుచేతులతో నెత్తియు నోరును మోదుకొనుచు "అయ్యో! నాకర్మము కాలా. నేను ప్రతాపదేవుఁ డను గాను. ఆరాజద్రోహి పేరు నాయెదుట నెత్తకుఁడు. నాయనా! నీవు పొరపాటు పడియుందువు. నన్ను బాగుగాఁ జూడుము. నేను ప్రతాపదేవుఁడను గాను. నాగ్రహ చారము బాగున్నది కాదు. నేఁడు లేచిన వేళావిశేషము" అని గద్గదస్వరముతోఁ బలుకు చుండఁ ద్రిపురాంతకుఁడు వానిఁ జూచి, "ఓయి! నీవు నిజము చెప్పినయెడల నిన్ను విడిచిపెట్టెదము. లేనియెడల నీప్రాణము లింక దక్కవు."

"శ్రీహరీ! శ్రీహరీ! నన్నుఁ జంపివేయుఁడు! త్వరగాఁ జంపివేయుఁడు. ఈరోగబాధ భరింపలేకున్నాను. అయ్యో! ఎంతపాప మెంతపాపము! నేను ప్రతాపదేవుఁడనా? హరహరా! ఏమి సాహసము?"

"ఓయీ! ఈనక్కటక్కులను నమ్మి నేను నిన్ను విడిచెద నని యనుకొనకుము. దాఁపక నిజము చెప్పు! నీవు ప్రతాపదేవుఁడ వవునా కాదా!"

అని త్రిపురాంతకుఁడు గట్టిగా గద్దించి పలికెను. ఆమాటలు ప్రక్కనే యొక గదిలో బంధింపఁబడియున్న నాగరాజు విని, కేకలు వేయుచు "ఏడీ! ప్రతాపదేవుఁ డేడీ? మాతండ్రి యెచ్చట నున్నాఁడు? నాకొఱ కేకవీరను దీసికొని వచ్చినాఁడా? ఆహాహాహా" అని పెద్దగొంతుకతో మాటాడుచుండ వెంటనే త్రిపురాంతకుఁడు

వానిని దోడ్కొని రమ్మని యొక సేవకు నంపెను. అప్పుడే పాప మారోగికి మూర్ఛవచ్చినందునఁ గాళ్లుచేతులుఁ దన్నుకొనుచు, నోటఁ జొంగలు గార్చుచు, శరీరమంతయు వడకించుచుఁ దెలివి తప్పినట్లు నేలపైఁ బడిపోయెను. ఇంతలో గదిలోనుండి విడువఁబడిననాగరాజు వెఱ్ఱికేకలతోఁ బరుగుపరుగున నచ్చటికి వచ్చి, నేలపైఁబడియున్న యాపురుషునిపైఁ బడి, "తండ్రీ! నీ విచ్చటి కేల వచ్చితివి? ఏకవీరను గొనివచ్చితివా? లేదా? ఆమెను జంపివేసితి వంటివా? ఇంకను జంపలేదు కదా? అయ్యయ్యో! ఏకవీరను నే నింకఁ జూడలేనా? ఆమె నాకింకఁ దక్కదా? తండ్రీ! నా కేమిదారి? ఏకవీరను మోహింపు మని నన్నేందుకు నిర్బంధించితివి?" అని యింక నేమేమో ప్రేలుచుండఁ ద్రిపురాంతకుఁడు వానినిఁజూచి "ఓయీ! ఈతఁడు మీతండ్రియేనా? ప్రతాపదేవుఁడేనా?" యని యడిగెను. ఆమాటల నాపిచ్చివాఁడు కెవ్వునఁ గేరుచు, "ఓహో! నాయనా! ఈతఁడే మాతండ్రి. నన్నుఁ గన్నతండ్రి. మాప్రతాపదేవుఁడు. నాకుత్తిమీఁదిదేవుఁడు. వీఁడు దొంగ. పచ్చిదొంగ. ఏకవీర నిప్పించెద నని చెప్పినాఁడు. ఇప్పుడు మాటాడఁడు. ఛీ! ఛీ! నేనే యేకవీరను వదలుకొందును." అని తటాలున లేచి యిటునటుఁ బారిపోవుచుండ భటులు వానిని బట్టుకొని మరల గదిలోఁ బెట్టి బంధించిరి.

అప్పుడు త్రిపురాంతకుఁడు రంగని బిలిచి "రంగా! ఇంక సందేహ మెందుకు? వీఁడు నిజముగాఁ బ్రతాపదేవుఁడే! నీ వెఱుఁగవు గాని యీ పాడుగుడియే జైనాశ్రమము. ఈతఁ డాగుడిలో నుండి వచ్చుచుండె నని విన్నప్పుడే నాకనుమానము కలిగినది. దేవికిఁ బ్రబలశత్రు వగునీతఁడు మనచేఁ జిక్కుటచేత నే డెంతయుం సుదినము. మరల వీనికరచరణములు బంధించి జాగ్రత్తగా నొకగదిలోఁ బడవేయుము. ఈమూర్ఛాసంకటమునకు నేనే తగినయౌషధ మిచ్చి బాగుచేసెదను." అని యాజ్ఞాపింప రంగఁడు వెంటనే యట్లు గావించెను.

---

## 20-వ ప్రకరణము

### కుమారదేవుఁడు

స్థలము మార్చి కారాగృహమునుండి దేవదేవుని మేడపైఁ జేర్పఁబడి నప్పటినుండియుఁ, గుమారదేవునిదుస్థితి కొంచెము మంచి స్థితిలోనికి వచ్చినదని చెప్పవచ్చును. దేవదేవుని మేడ రాజోద్యానవనమునకు సమీపముననే యుండుటచేతఁ దదుద్యానవనమునుండి నిత్యమును ఏతెంచు వివిధకుసుమచయసుగంధబంధుర మగుమందమారుతమే, యీ

రోగికి దివ్యౌషధమై వానియారోగ్యస్థితికిఁ గారణ మైనది. రోజురోజును జ్వరాతిశయ మించుక తగ్గుచుండుటయుఁ బట్టినయౌషధములు వెడలఁ గ్రక్కకుండ లోన నిముడుటయు, నాహారముపై నించుక వాంఛ పుట్టుటయు, నొకప్పుడు గాక మఱియొకప్పుడైనను గొంచెము మాటాడఁగల్గుటయు, మొదలగు సుగుణములవలనఁ గుమారదేవున కింకఁ బ్రాణభయము లేదని నిశ్చయించి, తమకు మాట దక్కె నని వైద్యులును, దనప్రయత్న మింకఁ గొనసాగు నని పాండ్యరాజును, దాను పడినకష్ట మంతయుఁ సఫలమైన దని దేవదేవుఁడును బ్రహ్మానందము నొందసాగిరి. పూర్వమువలెనే యాముదుసలిదాని నొక్కతెను దప్ప వేఱెవ్వరి నచ్చటఁ జేరనీయక, దేవదేవుఁ డొక్కఁడే కుమారదేవునకు వలసినయుపచారము లన్నియుఁ జేయుచుండెను. అప్పుడప్పు డుదయవేళలయందుఁ బాండ్యరా జచ్చటికి వచ్చుచు, రోగియవస్థను స్వయముగానే పరీక్షించుచుండెను. మఱియు దేవదేవునిఁ బిలిచి "దేవదేవా! కార్యమునందు లేశమును భంగము రానీకుము. కుమారదేవునియెడల నతిజాగ్రత్తతో మెలఁగవలయును. నీరహస్య మతఁడు గ్రహించినయెడల ముప్పు రాకమానదు. అన్నివిధముల నీవు నిజముగా నేకవీర వనియే వానికి గట్టినమ్మకము కలుగవలయును. వేయేల ? నీవు నిజముగా వానిభార్యవే యనుకొనుము. ఏకవీరవే యనుకొనుము. అట్లనుకొని నటించినయెడల నీప్రవర్తనమునఁ గుమారదేవునకు లేశము ననుమానము కలుగదు. నీవు సిగ్గుపడినయెడలఁ గార్యము చెడిపోవును సుమా !" అని పాండ్యరాజు వానికి బోధించుచు వెడలిపోవుచుండెను. ఆమాటలకు దేవదేవుఁడు తనలో నవ్వుకొనుచు "చిత్రము, చిత్రము" అనిమాత్రము ప్రత్యుత్తర మిచ్చుచుండెను.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి మామూలుప్రకారము కుమారదేవుఁ డౌషధమును బథ్యమును గైకొని తనమంచముపై వెల్లకిలఁ బరుండియుండెను. గవాక్షమునకుఁ బ్రక్కనే యామంచము వేయఁబడియుండుటచేత నిర్మలశీతలమందమారుత మాగదియందుఁ దాండవమాడుచుండెను. కన్నులు మూసికొనియే యుండెను గాని, కుమారదేవుఁడు మేల్కనియుండెనో నిద్రించుచుండెనో తెలియదు. గది తలుపులు లోన గడియలువడియే యుండెను. ఒకమూల గాజుకుప్పెయందు విద్యుల్లతాప్రాయముగ వెలుఁగుచుండిన దీపపుఁగాంతు లామందిరమున కొక క్రొత్తయందమును గల్గించుచుండెను. అప్పుడు మూర్తీభవించిన కుమారదేవుని యదృష్టదేవతయో యన నిండుజవ్వనమున నలరారు నొక సుందరకన్యకావిగ్రహ మాతనిప్రక్కనే మంచముపైఁ గూర్చుండి మెల్లఁగాఁ దనపైఁటకొంగుతో వానిమొగమునఁ గ్రమ్ముచుండిన చెమటబిందువులను దుడుచుచుండెను. ఆస్త్రీవిగ్రహము స్త్రీరూపమును ధరించిన దేవదేవుఁడే యని వేఱుగఁ

చెప్పవలయునా ? వేషవర్తనములు భేదించినప్పుడు పేరును వేఱగును గావున మరలఁ బురుషస్వరూపము దాల్చునంతకు మన మావిగ్రహమును నేకవీర యనియే పిల్చుచుందుము. ఏకవీర తనదృష్టియంతయుఁ గుమారదేవునియందే యుంచి, వాని కుపచారములు సేయుచుండ నింతలోఁ బండ్రెండుగంటలు కావచ్చెను. వైద్యులు చెప్పిన ప్రకార మది యౌషధసేవకు సమయమగుటచేఁ బన్నెపైటకొంగున ముడివేసికొనిన మాత్రలలోని యొక మాత్ర తీసి, యాసుందరి మెల్లఁగాఁ దనకుడిచేతితో వానిభుజముపైఁ దట్టుచు "ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!" అని రెండుమూఁడుసారులు పిలిచెను. వెంటనే యతఁడు త్రుళ్లిపడి, మేల్కాంచి, కన్నులు విప్పి తనప్రక్కనే కూర్చుండిన సుందరీవిగ్రహమును జూచెను. అట్లు చూచి, యామె ముఖలక్షణములఁ జక్కఁగఁ బరీక్షించి "హా! సుందరీ! ఏకవీరా! నన్నుఁ గౌఁగిలించుకొనుము" అని గద్గదస్వరముతోఁ బలుకుచుఁ, గన్నీరు గార్చుచుఁ దటాలున మంచముపై నుండి లేవఁ బ్రయత్నించి, లేచుటకు శక్తిలేక, తన చేతులు రెండును ముందునకుఁ జాచి, తనదుఃఖము నాపుకొనలేక వెక్కివెక్కి యేడ్వ నారంభించెను. ఏకవీరయుఁ దటాలున వాని బాహుద్వయమునం దిమిడి మెల్లఁగఁ దన ముద్దుమొగమును వానిగుండియలపైఁ జేర్చి చల్లని తనబాహువుల నాతనిఁ గౌఁగిలించుకొని కన్నీరుమున్నీరుగా విలపింపఁజొచ్చెను. ఆయిరువురికన్నులనుండియుం వెడలు దుఃఖబాష్పప్రవాహమున నామంచము తెప్పయై తేలుచుండఁ జైతన్యముతప్పి యాసుందరియుఁ గుమారదేవుఁడును గొంతవఱకు నట్లే యుండిపోయిరి. పిమ్మట నేకవీర మెల్లఁగ వానిచేతునుండి తప్పించుకొని, లేచి, కుమారదేవునికన్నులును మొగమును జక్కఁగఁ దుడిచి—

"ప్రాణేశ్వరా! విచారింపకుము. దైవము మనపక్షమున నున్నాఁడు. మనము మిక్కిలి యదృష్టవంతులము."

"సుందరీ! మన మిప్పు డెచ్చట నున్నాము? నాకేమో యంతయు స్వప్నావస్థవలెఁ గనఁబడుచున్నది. శత్రువులు నన్నుఁ బట్టి మోసికొనిపోయిరి కదా? ఇచ్చటి కెట్లు వచ్చితిని. ఈమందిర మెవరిది?"

"నాథా! మన మిప్పుడు శత్రుగృహమునందే యున్నాను."

"ఆఁ-ఆఁ-శత్రుగృహమా? ఏశత్రువుఁడు? అట్టులైనయెడల ఖడ్గ మిటు తెమ్ము."

"నాథా! ప్రస్తుతము ఖడ్గము పట్టుకొనుటకు దగినస్థితియందు నీవు లేవు. మన మిప్పుడు పాండ్యరాజనగరునం దున్నారము."

"ఏమేమీ! పాండ్యరాజా? పాండ్యరాజుసైనికులా నన్నుఁ బట్టి మోసికొని వచ్చినవారు? రుద్రాంబ కేమియు నాపద కలుగలేదుకదా?"

"లేదు. ఆమె సురక్షితముగానే యున్నది."

"ప్రియా! ఏకశిలానగరము విడిచి నీ విచ్చటి కెట్లు రాఁగలిగితివి? నాకొఱకే వచ్చితివా?"

"నీకొఱకే వచ్చితిని. ఎట్లు వచ్చితినో యాకథయంతయు సావధానముగఁ జెప్పెదను. నీ విప్పుడు విశేషముగ మాటాడినయెడల నాయాస మధికమగును. ఈమాత్రను మ్రింగి హాయిగా నిద్రింపుము."

"సుందరీ! నాకిప్పు డేయాయాసమును లేదు. నేను సావధానముగానే విందును చెప్పుము. నీముఖదర్శనము కలిగినప్పుడే నేను సంపూర్ణారోగ్యవంతుఁడ నైతిని. ప్రియా! ఎన్ని దినములనుండి నాకీపరిచర్య నేయుచున్నావు? నీ వీరాజుకడ నెట్లు ప్రవేశింపఁ గలిగితివి?—అబ్బా! పోనిమ్ము! నీ వేసంగతియుఁ జెప్పనక్కఱ లేదు. నాదగ్గరగా రమ్ము. నీమొగమును నాగుండియపై నుంచి యుండుము."

అని పలుక నేకవీర యట్టులే గావించెను. కుమారదేవుఁ డామె చెక్కులు నిమురుచు ముంగురులు సవరించుచు—

"సుందరీ! నేను జీవింపఁగలనా? నాకుఁ బ్రాణభయము లేదని వైద్యులు చెప్పినారుకదా? శత్రువుఁడ నైననన్నుఁ గడతేర్పక పాండ్యరాజేల ప్రాణములతో నుంచినాఁడు? మన మిప్పుడు నివసించియున్న దొక మేడవలెఁ గన్పడుచున్నదే? ఈరాజభోగము లన్నియు మన కెట్లు సంభవించినవి? సుందరీ! నేను నిజముగాఁ గుమారదేవుఁడనేనా? నీ వేకవీరవేకదా? నాహృదయేశ్వరివేకదా. నేను నిద్రించుచున్నానా? మేల్కొనియే యున్నానా? ఇవి యన్నియుఁ గలవరింతలు కావుకదా? అయ్యయ్యో! ఈ సంగతు లన్నియు నాకెప్పుడు తెలియఁగలవు? హా! దేవీ! రుద్రాంబా! మరల నీ దర్శనభాగ్యము నాకెన్నఁడైనఁ గలుగునా? అయ్యో! నాఖడ్గ మేదీ? ఏమైనదో కదా? సుందరీ! ఏకవీరా! నాతో మాటాడవేమి?"

"నాథా! నిన్ను బతిమాలికొనెదను. నామాట విని యాయాసపడకుము. నిద్ర లేనియెడల నౌషధము గుణ మీయదు. సంగతు లన్నియు నేను సావధానముగ నీకెఱింగించెదను. మన మిచ్చటఁ జేయవలసినకార్యము లనేకము లున్నవి."

"సుందరీ! అలాగా? పోనిమ్ము, నేను మాటాడను-నీవు నాప్రక్కనే పరుండి, నిన్ను నేను విడిచినదిమొదలు జరిగిన నీవృత్తాంతమంతయుఁ జల్లగా నాకు వినిపింపుచుండుము. నీకథయంతయు విని నేను హాయిగా నిద్రించెదను."

అని పలుక నేకవీర వెంటనే లేచి వానిచే నామాత్ర మింగించి, మెల్లఁగా వానిప్రక్కనే తానును బరుండెను. కుమారదేవుఁ డామెపైఁ దన చేయి వైచుకొని, యామె చెప్పుచుండిన వృత్తాంతమంతయుఁ జల్లఁగా వినుచుండెను. కాని యాప్రసంగము పూర్తిగాఁ జెప్పకమునుపే వానికి నిద్ర పట్టినది. అందుచే నేకవీరయుఁ గన్నులు మూసి నిద్రించెను.

---

## 21వ ప్రకరణము

### “ఆహా! యేమి నాభాగ్యము?”

“దేవదేవా! మహారాజుగా రుద్యానవనమందలి కేళికాగారమునఁ గూర్చుండి, మిమ్మెట్టున్న నట్టుతీసికొని రావలయు నని కాజ్ఞాపించినారు. కావున నావెంట దయ చేయవలయును” అని యెప్పటికో పోయి తిరిగివచ్చుచుండిన దేవదేవుని మేడమెట్ల యొద్ద నడ్డగించుకొని, యొక యంతఃపురదాసి పలికెను. ఆమాటలు విని దేవదేవుఁ డాశ్చర్యమొందుచు, “ఏమేమీ? రాజుగారు కేళికాగారమున నున్నారా? ఈయబద్ధము లెచ్చట నేర్చుకొంటివి! ఈమిషతో మహేశ్వరి నిన్నిచ్చటికిఁ బంపించినదాయేమి! మహారాజుగారు యుద్ధసామగ్రిని బరీక్షించుటకై మధ్యాహ్నముననే యాయుధాగారమున కేఁగినారు. రాత్రి తొమ్మిదిగంటలవరకు రానట్లు నాతోఁ జెప్పినారు. అదియును గాక శుద్ధాంతకాంతామణులు సంచరించు కేళికాగారమునకు నన్నట్టు రమ్మందురా? ఇప్పుడే కదా సాయంకాలమైనది. ఇంతలోనే తిరిగివచ్చిరా!” అని ప్రత్యుత్తరమొసంగ నాదాసి, “అయ్యా! అకారణముగ నంతఃపురస్త్రీలనుగూర్చి ప్రసంగించుట మీకేమి యవసరము! రాజుగారు నేఁటి మధ్యాహ్నమున నాయుధాగారమున కేఁగినమాట వాస్తవమే! కాని యాయన యచ్చట నుండఁగా జైనాచార్యునియొద్దనుండి యేదో రహస్యమైనయొకయుత్తరము వచ్చినందున వెంటనే యచ్చటనుండి బయలుదేరి వచ్చి, మీతో రహస్యముగఁ బ్రసంగింపవలసియున్నదని యేకాంతముగఁ గేళికాగారమునఁ గూర్చుండి నన్నిచ్చటకుఁ బంపినారు. అంతియేకాని మహేశ్వరి యెన్నఁడైన నట్టు పరపురుషు లగుమీకుఁ గబురంపించునా? అట్టి యసందర్భమేమైన నిదివరలో జరిగి యున్నయెడల నాకుఁ దెలియఁజేయుఁడు. వెంటనే మహారాజుగారికి విన్నవించి యామెకుఁ దగినట్లు బుద్ధిచెప్పించెదను. ఇష్టములేనిచో నేను రానని చెప్పవలయునుగాని, శుద్ధాంతకాంతాజనముపై నిట్టియపనిందలు మోపవచ్చునా? సరే! యీసంగతియే నేను

మహారాజుగారితో విన్నవించుకొనెదను." అని పలికి, మిక్కిలి జాణ యగు నా దాసి, వానినిఁ జొరచురఁ జూచుచు, నచ్చటి నుండి రివ్వున బయలుదేరి పోవుచుండ దేవదేవుఁడు భయపడి, మహేశ్వరినిఁ గూర్చి తాను పొరపడి వచించినదానికి విచారించుచు, గిఱ్ఱునఁ దిరిగి పోవుచున్నదాని వెంటఁ బరుగెత్తి "ఓసీ ! దాసీ ! నిజముగా నీవన్నట్లు మహేశ్వరినిఁగూర్చి ప్రసంగించుట గొప్పయపరాధమే ! మించినదాని కాగ్రహింపక యీసంగతి మాత్రము నీ వెవరితోడను జెప్పకుము. నిన్ను బతిమాలుకొనెదను. ఇదిగో ! నీ వీయుంగరమును గైకొని సంతోషింపుము" అని తనవ్రేల నున్నయుంగరమును దీసి యామె కొసఁగఁబోవ మొదట నా దాసి కొంతవఱకు మురిపించి, తరువాత మెల్లఁగా దానిని బరిగ్రహించెను.

జైనాచార్యుఁ డుత్తరమును వ్రాసెననియు, నది చూచి, రాజు పరుగెత్తుకొని వచ్చి తనకై కబురంపించెననియు, దేవదేవుఁడు వినినది మొదలు వానిముఖమునం దొక విధమైనభీతియు ననుమానమును దాండవ మాడుచుండెను. మనసునందలి తత్తరపాటును బాదములయందలి తడబాటును నేకీభవింప, నా దాసి వెంటఁజనుచు దేవదేవుఁ డుద్యానవనమందలి కేళికాగారమును సమీపించి మెల్లఁగా నందులోఁ బ్రవేశించెను. ముందరుగుచున్న యా దాసి కడువడిగా నడచిపోవుచుండుటచేఁ, బాపము దేవదేవుఁ డా దివ్యభవనమందలి చూడఁదగిన వైచిత్ర్యమును జూడలేక, యామె ననుసరించి తానును వడివడిగానే పోవుచుండెను. అట్లు పోయిపోయి సున్ననిచీడీలును, వన్నె కెక్కిన పెక్కుచావడులును, చిత్రవిచిత్రము లగుద్వారములను గడచి కడచి, తుదకు వారిరువురును, రత్నఖచితాసనములతోడను, హంసతూలికాతల్పములతోడను, హేమడోలికాపరంపరలతోడను, జూపరులతో మాటాడుచున్నవో యను బహువిధము లగుచిత్రపటములతోడను బహువిధముల నలంకృతమై, రతీదేవిశయనాగారము వలె, నత్యద్భుతమైన యొక సుందరమందిరమునఁ బ్రవేశించిరి. రాజుగాని, తదితరులుగాని లేక యప్పుడా మందిరమంతయు నిశ్శబ్దముగానే యుండెను. అందుఁ బ్రవేశింపఁజేసి, యా దాసి, "అయ్యా ! మీ రీయాసనముపై నధివసింపుఁడు ! మహారాజుగారు లోపుననున్నారు. మీ రాక యెఱింగించి, యాయన యిచ్చటకు వచ్చెదరో ! మిమ్మే యచ్చటికిఁ దోడ్కొని రమ్మనెదరో కనుఁగొని వచ్చెదను." అనిపలికి, మెల్లఁగా నచ్చటినుండి జాఱిపోయెను. దేవదేవుఁ డా మందిరమున నొంటరిగా నొక యాసనముపైఁ గూర్చుండి యంతకన్న నెక్కుడు వైభవముల ననుభవించినవాఁ డగుటచేతనో మనసునకు స్వస్థతలేకయో, యందలి చూడఁదగినవింత లేమియుఁ జూడక దీర్ఘాలోచనము సేయుచుఁ గూర్చుండి దాసిరాక కెదురు చూచుచుండెను. కాని యెంతసేపునకును మరల నా దాసి యచ్చటకు

రాలేదు. దేవదేవుఁడు కొంతవఱకు నిరీక్షించి, నిరీక్షించి, తుదకు విసిగి, "దాసీ! దాసీ!" అని బిగ్గఱగా రెండు మూఁడుసారులు పిలిచెను. అట్లు పిలుచుటయేఁ దడవుగఁ గనకకింకిణీమంజీరమంజులారావములును, కరకంకణనిక్వణనములును, బ్రతీహారులగతి తన రాకగమనము నెఱుంగఁ జేయఁ, బ్రక్కనున్న ద్వారమున కడ్డముగ వ్రేలాడుచున్న పట కవాటమును దటాలునఁ ద్రోసివచ్చి, జలతారుమొగ్గలచే నలంకరింపఁబడిన గులాబిరంగు గల పట్టుచీరయుఁ బసుపుపచ్చని పైఠిణీ పట్టురైకయుఁ బలువిధములగు నాభరణవిశేష ములను దాల్చిన యొకసుందరకన్యాలలామ యాదేవదేవుని యెదుట సాక్షాత్కరించి, "దేవా? ఇదిగో మీదాసి. ఏమిసెలవు?" అని యడుగుచుఁ గట్టెదుట నిలువఁబడెను. తోడనే యాచంచలాక్షి నీక్షించి, మహేశ్వరి యని గ్రహించి, దాసి చేసినది మోస మని నిశ్చయించి, సిగ్గుచే మెల్లఁగా మోము వంచి చల్లఁగా నిట్లు ప్రసంగించెను—

"సుందరీ! నీవంతఃపురరాజకన్యక వలెఁ గనఁబడుచున్నావు. నాకు దాసి వెట్టులయ్యెదవు? ఇట్లనుట న్యాయ్యమేనా?"

"మనోహరా! న్యాయము గాకేమి? మీమనోహరసుందరాకారసందర్శనభాగ్యము గలిగి నప్పటి నుండియుఁ నేను మీకుఁ జరణదాసినై మీకొఱ కెట్టెదురుచూచుచున్నాను. ఎన్నివిధముల బ్రయత్నించినను మీప్రత్యక్షదర్శనము నాకులభింపకున్నందున నేఁడు నేనే యీతంత్రమును బన్ని మిమ్మిచ్చటికి రప్పించితిని. నాయపరాధమును క్షమిం పుఁడు."

"మహేశ్వరీ! ముసలిదాసిచే మొన్న నీ వంపినయుత్తరముఁజూచి నేను మిక్కిలి విచా రించితిని. మహారాజకన్యక వగునీవు సామాన్యపురుషుఁడ నగు నాయం దింత—"

"మనోహరా! వివిధకథావిధానవిదులగు మీయట్టికోవిదు లీవిధమున వాదించిన లోక మామోదింపదు. మనసు కుదిరినప్పుడు సామాన్యాధిక్యముల నుత్తమకాంతలు లక్షిం పరు. తినఁ దిండియుఁ, నుండ నూరును లేని స్థితియందుండిన కిరీటిని సుభద్రయుఁ దత్కుమారు నభిమన్యుని శశిరేఖయుఁ నేల వరింపవలయు? లోకముతో నెట్టి సంబంధమును లేక విరాగియై కొండపైఁ గూర్చుండిన దేవదేవుని మహేశ్వరి వరించి నదా లేదా?"

మహేశ్వరీ! నీవుఁ గూడ నామహేశ్వరీ శశిరేఖా సుభద్రాంగనలకు సాటిదాన వైయుండ వచ్చును. కాని, యయ్యర్జునాదులవలె నే నంతటి మహనీయుండను గానుకదా? నన్ను నీవెట్లు చేపట్టఁగలవు?"

"దేవదేవా! దేవదేవానుగ్రహమున నీసేవచేయుటయేగాక నంతటి మహనీయమూర్తి యేల కాఁగూడదు? పూరుషుని భాగ్యవిశేషము, సులకాంత యదృష్టవిశేషమును బట్టికదా ప్రకాశించును?

"మహేశ్వరీ! నీవు మిక్కిలి విద్యావతి వైనందు కెంతయు సంతసించితిని. ఈపూర్వగాథల కేమిగాని, మహారాజుగారియనుజ్ఞ గైకొనకుండ నీవు నన్నెట్లు చేపట్టఁగలవు! ముందు వెనుక లరయక నీ విట్లు తొందరపడవచ్చునా?"

"మనోహరా! ఒక్క మాతండ్రియేకాదు, ప్రపంచమంతయు నేకమై వలదని వారించి నను నేను మీపాదసేవ నుండి తొలఁగను. సకలవిధముల సాధకబాధకము లాలోచించియే నామనోగతాభిప్రాయమును మీయెడల వెల్లడింప సాహసించితిని. నా క్షేమమును బాటించి, నామనోభీష్టమును మాతండ్రి నెఱవేర్చినచో సంతోషమే! అట్లు కానియెడల లోకమంతయుఁ బాండ్యరాజ్యమే కాదుకదా? మన కింతటి యుత్తమజన్మ మొసంగిన పర్వేశ్వరుఁ డన్నవస్త్రములకా లోపము గల్గించును?"

"హరహరా! ఎట్టిమాటలు వినవలసి వచ్చినవి? మహేశ్వరీ! నిన్ను మఱియొకమాఱు ప్రార్థించెదను. నామాట విని మహారాజుబిడ్డ వగు నీ వేమహారాజుకుమారునో వరింపక, వట్టి నిర్భాగ్యుఁడ నగునన్నుఁ జేపట్టి యేమిసౌఖ్యములనుభవింపఁగలవు? కావున నింకనైన నీమనసు మార్చుకొని—"

"దేవదేవా! ప్రపంచమంతయు మాఱినను నామనసుమాఱదు. కోరి వరించిన సుందరాంగుని సాంగత్యముకన్న నుత్తమాంగనల కెట్టి తుచ్ఛసౌఖ్యములు సౌఖ్యదాయకములు కావు. ఒకవ్వుడు మీహృదయ మన్యథా ప్రవర్తించుచున్నయెడల నాసంగతి నా కెఱింగించినచో—"

"లేదు. లేదు. నీ విట్లు భావింపవలదు. అమితలావణ్యవతి వగు నీయట్టిమహారాజకుమారిక కోరి వరించుచుండఁ గాదను నిర్భాగ్యు డెవఁడుండును? నిశ్చయముగ నాహృదయము నీయందు లగ్నమైనది."

"దేవా! ఈసంగతి నిజమేకదా!"

"ముమ్మాటికిది నిజమే?"

"ఇది నన్ను వంచించుట కాదుకదా?"

"ఎప్పటికిని గాదు."

"నేను మిమ్ము నమ్ముకొనవచ్చునా?"

"అంతటి సాహస మున్నచో నమ్మనోపవచ్చును."

"ఆహా! ఏమి నా భాగ్యము."

---

## 22-వ ప్రకరణము

### రహస్యప్రసంగము

"మహారాజా! మన ప్రయత్నము లన్నియు నిర్విఘ్నముగఁ గొనసాగినవి. నిజముగా నే నేకవీర ననియే నమ్మనోని కుమారదేవుఁ డిప్పు డపరిమితానందభరితుఁడై యున్నవాఁడు. మాయమాటలు బొల్లియేడ్పులు నక్కవినయములుఁ జూపి నాచాకచక్యమంతయుం వెల్లడించితిని. వానిహృదయమును బూర్తిగ నాకర్షించి నాదాసానుదాసునిఁగాఁ జేసికొంటిని."

"దేవదేవా! ప్రపంచమంతయు నాకర్షించుశక్తి గల నీ కొక్కకుమారదేవుని వశపఱచుకొనుట యాశ్చర్యమా? అందుచేతనే నేను నిన్నే యీకార్యమునందు నియోగించితిని. నీ వేకవీర వని నమ్మినతరువాతఁ గుమారదేవుఁడు నీవృత్తాంత మేమియు నడుగలేదా? నీ వే మనిచెప్పితివి? వానికి నమ్మకము కలిగినదికదా?"

"మహారాజా! నేనే యేకవీర నని చెప్పినంతనే యాతఁడూరక కన్నీరు గార్చుచు బిగ్గఱగా నన్నుఁ గౌఁగిలించి, పాప మూరక విలపింపఁ జొచ్చెను."

"దేవదేవా! ఈవిధముగా నైన జగన్మోహనుఁడ వగు నీ యాలింగనసౌఖ్య మనుభవించిన కుమారదేవుఁ డెంతయదృష్టవంతుఁడు?"

"దేవా! ఈపరిహాసముల కేమి? వినుఁడు! ఆతఁడు నన్నుఁ గౌఁగిలించి యూరక విలపించుచుండ నేనుఁగూడ నాయవస్థయే యభినయించుచు,—అబ్బా! నాకే యాశ్చర్యము పుట్టుచున్నది. నిజముగా నేకవీరవలెనే నటించితిని. ఆతఁ డూరక మితిమీరిన ప్రశ్నములు న న్నడుగుచుండఁ దఱచుగా మాటాడవల దనియు నాయాస మధికమగు ననియు, నిద్రలేకున్న రోగ మధిక మగు ననియుఁ జెప్పవలసిన నాచరిత్రమంతయు సావధానముగాఁ జెప్పెద ననియుఁ జెప్పి మెల్లఁగా వానినిఁ బరుండఁ జేసితిని."

"దేవదేవా! నీ కెంతకష్టము కలిగించితిని. అయినను నీకష్టము తీరునట్లు నేను దగిన ప్రత్యుపకారము చేయలేకపోను. కుమారదేవుఁ డిప్పుడు పూర్తిగా నారోగ్యస్థితిలోనికి వచ్చి నట్టులే కదా?"

"దేవా! అందుకు సందేహము లేదు. ఇప్పుడిప్పుడే మంచముపై నుండి దిగి యిటునటుఁ దిరుగుటకుఁ గూడ నవకాశము కలుగుచున్నది."

"అలాగునా? ముఖ్యమైనయంశ మొకమారైన వానియొద్దఁ గదిపితివా లేదా?"

"కదిపిచూచితిని. ఎట్లైనను రుద్రాంబయందును దద్రాజ్యమందును గల వానియభిమాన మొక్కమాఱు త్రెంపి వేయుట కష్టసాధ్యము కదా?

"అయ్యో! దేవదేవా! ఏదోమాటవరుస కడిగితిని గాని, యింతలోనే యాతఁడు మనకు లోఁబడు నని నేను తలంపఁగలనా? వానిమనసు మరలించుట మిక్కిలి కష్టము. వాఁడు గొప్ప వీరాగ్రేసరుఁడు."

"మహారాజా! నిన్నటిమధ్యాహ్నమునఁ దమ రాయంధాగారమున కేఁగినప్పుడు మే మిరువురమునుగూడఁ జాలసేపువఱకుఁ బ్రసంగించితిమి. మహేశ్వరియనుగ్రహము చేత నా ప్రయత్నము కొనసాగునని నాకు ధైర్యము తోఁచినది."

"దేవదేవా! నీయందింతటి మోహ మలవడినప్పుడు నీప్రయత్న మేల వ్యర్థమగును? నీకసాధ్య మగుకార్య మేమున్నది? తప్పక నీయభీష్టము నెరవేరఁగలదు."

"మహారాజా! నాయం దింతటి మోహ ముద్భవించుట చేతనే, తనదేశమును దనబంధు వర్గమును విడుచు నట్లుచేసి, యింతటి సాహసమునకొడిగొల్పింపఁగలనని నాకు ధైర్యము కలిగినది."

"ఔను. నిజమే! సాయంకాలములయందుఁ జల్లనిగాలి వీచుచున్నప్పుడు మెల్లఁగాఁ జెంత కేఁగి, మంచిమాట లాడుచు, నిజముగా నాయందే మోహ మున్నయెడల నే నిచ్చట నున్న నీవుఁగూడ నచ్చటనే యుండవలయుననియు,సకలైశ్వర్యసౌఖ్యములు ననుభవింప వచ్చుననియుఁ దలకెక్కునట్లు బోధింపుము. నీవు మిక్కిలిబుద్ధిమంతురాల వగుటచే నీకు నేను జెప్పనక్కరలేదు."

"దేవా! అన్యోన్యానురాగముకన్న నాతుచ్ఛసౌఖ్యములయందుఁ దనకు లేశము నాశ లేదని నాతో స్పష్టముగానే చెప్పెను."

అని దేవదేవుఁడును బాండ్యరాజును, రాజమందిరమందలి యొక చెలరాలమంట పముపైఁ గూర్చుండి, మధ్యాహ్నము పదునొకండు గంటలవఱకు సంభాషించి, తమ మందిరములకుఁ బోవలయు నని లేచుచుండ, నొక ద్వారపాలుఁడు వెంట నొక క్రొత్త పురుషునితో నచ్చటకు వచ్చి, ప్రభువునకు నమస్కరించి "దేవా! వీనిపేరు ఛన్నుఁ డఁట. రుద్రమదేవికడ నుండి యేదో యుత్తరమును గొని దేవరకడకు వచ్చినాఁడు."

అని వినయముగఁ బలికెను. తోడనే ధన్నుఁడును దనచేతనున్న యంత్రమును రాజున కందిచ్చి, దేవదేవునిముఖము నూరక లెప్ప బ్రాల్పక చూడ నారంభించెను. ఆ యంత్రమునందలి సంగతులను గనుఁగొనవలె నను నాతురతచేతనో, ధన్నుని ముఖవీక్షణము చేతనో కాని దేవదేవుఁడు గూడ వానివంక నిదానించి చూడసాగెను. ఈలోపున రా జాయంత్రమంతయు నామూలాగ్రముగఁ జదివి, తనయెదుట నున్న ద్వారపాలునిఁ జూచి "ఓరీ! నీవీధన్నుని గైకొని యావలికిఁ బొమ్ము. మా సెలవైనప్పుడు మరల రావచ్చును." అని వారిరువురి నచ్చటినుండి పంపివేసి, దేవదేవునితో నిట్లు మాటాడెను."

"దేవదేవా! ఈవింత విన్నావా? తనబంధువుఁడైనకుమారదేవుని మనమే పట్టిబంధించి నట్లు తన కనుమానముగ నున్నదనియు, వానిని బ్రాణములతో సురక్షితముగఁ దన కప్పగింపనియెడల మనప్రాణములు దక్కవనియు రుద్రమదేవి యంత్రము వ్రాసినది. చూచితివా? ఎంత కండకావరమో?"

"దేవా! కుమారదేవుఁడు మాయొద్దనున్నట్లు లామె యెట్లులో పసిపట్టినది. పసిపట్టుటయే కాక యుద్ధప్రయత్నములలో నున్నట్లు కూడ మనమిందువలన గ్రహింపవచ్చును."

"పోనిమ్ము! మనకేమిభయము? మనము మాత్ర మూరకుంటిమా యేమి? అందుకుఁ దగిన సన్నాహమంతయు నేను గూడ నాచరించుచునే యున్నాను."

ఔనౌను! మీరు మొన్నటిదినమున నాయుధాగారమున కేగినప్పుడే యుద్ధప్రయత్నములు జరుగుచున్నట్లు నేను పోల్చినాను. అయినను దమరు సెల వీయకుండ స్వతంత్రించి యడుగుట కిష్టములేక యూరకుంటిని."

"దేవదేవా! ఇంతకన్న ముఖ్యమైన కార్యమునందు నీవు ప్రవర్తించుచుండుటచేతఁ జెప్ప లేదుకాని, నీయెడల దాపవలసిన రహస్య మేమున్నది? ఇప్పుడు చెప్పెదను వినుము. మనప్రయత్నమంతయు సిద్ధమగుచుండుటయే కాక, దేవగిరిరాజునకుఁ గూడ నుత్తరము వ్రాసినాను. అతఁ డీపాటికే యుద్ధసన్నాహముఁడై బయలుదేఱి యుండును."

"అహాహా!! ఎంతటిశుభవార్త వింటిని! మహాప్రభూ! నేను ముందుగానే తమతో విన్న వించుకొనుచున్నాను. యుద్ధరంగములోఁ దమపక్షము వేయిమంది సైనికులకైనను నన్ను మీరు నాయకునిగా నియోగింపవలయును."

"అహ్హాహ్హా! దేవదేవా! నీవెంతటి వెఱ్ఱివాఁడవోయి? వేయిమందికా? పదివేలసైన్యమునకు నిన్ను నాయకునిగాఁ జేసినచోఁ జాలునా? నీకన్న నాకాప్తు లెవరున్నారు? అసంగతి నీవు ప్రత్యేకముగ నడుగవలయునా?"

"అట్టులైననెఱయోదల సేవ ధన్యుండనైతిని. దీని కేమిగాని మహారాజా! రుద్రమదేవి కేమని ప్రత్యుత్తరము వ్రాయవలయును?"

'ఎట్లు వ్రాయవలె నని నీయుద్దేశము?"

"కుమారదేవుఁడు మాయొద్దనే యున్నాఁడనియు, నాతఁ డెంతమాత్రమును మీ కొసంగఁబడఁ డనియు, నిష్టమువచ్చినట్లు చేసికొనవచ్చుననియు నిర్భయముగా నే వ్రాసెదను."

''ఓహో! దేవదేవా! పౌరుషపరాక్రమములలో నాకు లేశమును నీవుతక్కువ కావుసుమా! అట్లే వ్రాయుము. మనకేమి భయమున్నది?"

''దేవా! మఱియొక మనవి. ఆధన్నుని మెల్లఁగాఁ దీసికొని పోయి, వానిని మంచి మాటలాడి, వానివలన నచ్చట జరుగుచున్న విశేషము లేమైనఁ గనుఁగొనవలయు ననియున్నది."

"అబ్బా! దేవదేవా! దేనికైనను రవంత యవకాశము దొరకినచో నీవు విడిచి పెట్టవు కదా? నీకెంతయోపిక!. అట్టులే ప్రయత్నించి చూడుము. ఇందేమి నష్టమున్నది?"

అనిచెప్పి వెంటనే రాజచ్చటినుండి వెడలి పోయెను. అప్పుడు దేవదేవుఁడు తన కడకు ధన్నుని రప్పించి వానితోఁగూడఁ దన మేడలోనికి బయలుదేఱెను. ధన్నుఁడు రుద్రాంబ కొలువునఁ బనిసేయుచుండిన విశ్వాసపాత్రుఁడగు నొకయుత్తమరాజ భటుఁడు. మొదటినుండియుఁ గుమారదేవునియందు వానికి మిక్కిలి భక్తియు, నభిమానము నుండుటచేత వాని నిమిత్త మెల్లెడల వెదకుచు నిట్లు పశరాని పాట్లు పడుచుండెను. దేవదేవునితోఁ గూడ నాతఁ డట్లు బయలుదేఱి పోయి వానివెంటనే యాతని మేడగదిలోఁ బ్రవేశించి, యచ్చట నున్న మంచముపై శుష్కశరీరుఁడై పరుండియున్న కుమారదేవునిఁ జూచి, కొంతసేపునకుఁ బోల్చి త్రుళ్లిపడి, కెవ్వునఁ గేకవేసి, "ఆఁ-ఆ-ఏమి నాభాగ్యము! మాకుమారదేవుఁడే? మాముద్దులమూటయే నా? మాకన్నతండ్రియే నా? నాయనా! కుమారదేవా! అయ్యయ్యో ఏమోయీ! ఇట్లు శుష్కించిపోయితివి!" అని యూరక కన్నీరుగార్చుచు రోదనముసేయుచుండ దేవదేవుఁడు వానిని జూచి నవ్వుచు, "ధన్నా! కుమారదేవున కేమియు భయము లేదు. నీవుమాత్రము గట్టిగా మాటాడకుము. అత్యంత రహస్యముగ నీతోఁ గొన్నిసంగతులను గూర్చి ప్రసంగింపవలసియున్నది." అనిచెప్పి వానిని భద్రముగా నొకమూలఁ గూర్చుండఁబెట్టి, యీవలకు వచ్చి, చుట్టుపట్టుల నెవరైన నున్నారేమోయని యిటు నటుఁ బరీక్షించి, మఱల లోనికిఁబోయి తటాలునఁ దలుపులు మూసివేసి, గడియలన్నియుం బిగించి, వానితో నేమో యతిరహస్యముగ గుసగుస

లాడ నారంభించెను. మిక్కిలి యాతురతతో నంత యేకాంతముగ ముచ్చటించుకొనుచుండిన యీరహస్యప్రసంగమునకు మనము భంగము కల్గింపక యీ ప్రకరణము నింతతో ముగింతము.

## 23-వ ప్రకరణము

### క్రొత్తసైన్యాధిపతులు

అట్టిరహస్యముగ నామేడలో దేవదేవ కుమారదేవు లిరువురును, ధన్ననితో నేమి ప్రసంగించిరో మనకుఁ దెలియదు. ఆపగలు నారాత్రియుఁగూడ ధన్నుఁ డచ్చటనే వారిరువురితోఁ గాలముగడిపెను. అమరునాఁడుదయముననే, దేవదేవుఁడు మెల్లఁగాఁ దలుపులు తెఱచి, యీవలకువచ్చి యిటునటుఁజూచి, "ధన్నా! ఆయుత్తరము కడు భద్రము సుమా! ఇందఱి ప్రాణములు నందులోనేయున్నవి" అని రహస్యముగాఁ బలికి, మేడదిగి క్రిందకు వచ్చి కొంతదూరము నడిచి, "ఓరీ! ఎవరురా యచ్చట?" అని బిగ్గరగాఁ బలికెను. తోడనే యాప్రాంతమున సంచరించుచుండిన యొక రాజసేవకుఁడు పరుగుపరుగున వచ్చి, "దేవా! ఏమిసెలవు?" అని విన్నవించుకొనెను. అందుకు దేవదేవుఁడు "ఓరీ! సేవకా! నగరద్వారము లన్నియుఁ గడుచువఱకు నీవీధన్నుని వెంటనేఁగి, వీని నిటునటుఁ జూడనీకుండఁ దీసికొనిపోయి విడిచిపెట్టి రమ్ము. కోటలోనిసంగతు లేమైన నిన్నాతఁ డడిగిన యెడల నీవేమియుఁ జెప్పఁగూడదు. నీవుఁ గూడ వాని నేమియుఁ బ్రశ్నింపరాదు." అని కఠినముగా నాజ్ఞాపించుచుండ "మేలు దేవదేవా! మేలు! నీవు గొప్పరాజనీతిజ్ఞుఁడవని నా కిప్పుడు తెలిసినది." అనుమాట యాకస్మికముగ వానికి వినిపించెను. వినుటయే తడవుగ దేవదేవుఁ డెవ్వరో యని నలువంకలఁ బరికింప మందస్మితాననుఁడై పాండ్యరాజు వానికిఁ బ్రత్యక్షమయ్యెను.

"దేవదేవా! ఒకసామాన్యసేవకుఁడు మనకోటలో నిటునటుఁ జూచినంత మాత్రమున నేమిరహస్యములను గ్రహింపఁగలఁడు? అబ్బా! నీకెంత యనుమానము!"

"దేవా! కార్యముపట్ల నాకనుమానము మెండే? ఎందుకైనను జాగ్రత్తగా నుండుట మంచిదికదా!"

"ఔను. మంచిదే! పరిహాసమున కట్టు లంటినిగాని నాకుమాత్రము తెలియదా యేమి? మంచముపై నుండి నిద్దుర కన్నులతో లేచుచుండఁగనే రుద్రాంబకు నీవు వ్రాసిన ప్రత్యుత్తరమును గైకొని సేవకుఁడు నాకడకు వచ్చినాఁడు. ఆయుత్తరము చదివి

సంతకము చేసి, కాలోచితకృత్యములు నిర్వర్తించుకొని, కుమారదేవునితోఁ బ్రసంగింపవలయు నని యిట్లు వచ్చినాను. సరే దీనికేమి? ధన్నునివలన నీవేమైనరహస్యములు——"

"దేవా! రాత్రియంతయు వానినిఁ జావఁగొట్టి చెవులుమూసితిని. కాని వాఁడు పట్టి మొండిమందకొడుకు-లేశమైనను——"

"అహ్హాహ్హా! దేవదేవా! వానియొద్ద నీపాచిక పారలేదు కాఁబోలు."

"కేవలములేకపోలేదు. చట్రాతిలోనుండి నార తీసితిని. తమరు లోనికి దయచేయుఁడు. సావధానముగ మనవిచేసికొనెదను."

అనిపలుక జటవర్మ యత్యానందముతో దేవదేవుని వెనువెంటనే యామేడలోఁ బ్రవేశించెను. వానినిఁ జూచిన తోడనే మంచముపై నున్న కుమారదేవుఁడు దిగ్గన లేచి నిలువఁబడ రాజు సంతోషించి, వత్సా! కూర్చుండుము. ఈవిధముగా నీవు నన్ను గౌరవించినంతమాత్రమున నాకు సంతోషము లేదు. నన్ను గౌరవింపవలసినవిధము వేరుగా నున్నది. నీవు గూడఁ గూర్చుండుము. సావకాశముగ నీకెఱిఁగించెదను. అని పలికి, వాని నా మంచముపైనే కూర్చుండఁజేసి, వానిసమీపముననే తానుగూడ సుఖాసీనుఁడై, దూరముగనున్న గవాక్షముపైఁ గూర్చుండిన దేవదేవునిఁ జూచి, యేమో కనుసంజ్ఞ చేయుచు,

"కుమారదేవా! నీవిప్పుడు పూర్ణముగ నారోగ్యవంతుఁడ వగుటచే ముఖ్యమైనసంగతులను గూర్చి నీతోఁ బ్రసంగించుటకు నాకు సమయము వచ్చినది. ఇంతకాలమును——"

'మహారాజా! తమరు నాతోఁ బ్రసంగింపనెంచిన విషయము నాకుఁ గ్రొత్తవిషయము కాదు. ఇదివరలో దేవదేవుఁ డనేకపర్యాయము లాసంగతులు నాతో ముచ్చటించుచు వచ్చెను. రాజనీతిధురంధరు లగు మీ యట్టివారు చేయరానిదుష్కార్యములు రెండు మీచేఁ జేయఁబడినందుకు నేను మిక్కిలి విచారించుచున్నాను."

"వత్సా! అట్లు నిష్కల్మషహృదయముతో మాటాడుము. నన్ను నిందించినను నాకుఁ గోపములేదు. నేను చేసిన యారెండు చెడుచేఁతలేమో చెప్పినఁ దగినసమాధానమీయఁగలను."

'మహారాజా! మీరు మిక్కిలి పరాక్రమశాలురైయుండియు, దోపుడుదొంగలవలె మీసైనికులను రహస్యముగఁ బంపి, యాలయములో దిరుగుచుండిన మాదేవి నట్లు

చెఱపట్టఁ బ్రయత్నించుట మాపౌరుషమునకు లోపము కాదా? బహిరంగముగా రణ రంగమున నెదిరించి,—"

"ఆఁ-ఆగు. ఆగు. కుమారదేవా! నీసంశయము నాకు బోధపడినది. నిన్న గాక మొన్న పుట్టినపసికందవై పౌరుషమే ప్రధానముగఁ జూచుచు లేశమును లోకానుభవము లేని నీకిట్టి సంశయము పుట్టుట యొకవింత కాదు. కుమారా! రాజనీతి మిక్కిలి యగాధమైనది. మహామహులే యందలి రహస్యములు గ్రహింపలేరు. నీవన నెంత వాఁడవు? రాజై పుట్టి పరరాజ్యము లాక్రమించుకొను వాఁ డొక్కొక్కప్పుడు దయయు దాక్షిణ్యము విడువవలసి వచ్చుచుండును. అట్టి సమయముల వెనుదీసిన యెడల నట్టిరాజుగాని, తద్రాజ్యముగాని. యభివృద్ధిలోనికి వచ్చుట కలలోనివార్త. నలువంకలఁ దన్ను ముట్టడించి బాధించుచున్న శత్రువుల సంహరించుటయందు రాజునకు న్యాయాన్యాయవిచక్షణమును, మృగసంహారమున వేటకానికి జాలియుఁ, గన్నముచేయువానికిఁ బరధనమందు విరక్తిభావమును సృష్టిలోలేవు. ప్రాపంచికరహస్యము నీకిప్పుడు బోధపడినదా! ఇంక నీ రెండవసంశయమేదో చెప్పుము."

"మహారాజా! నన్ను మోసపుచ్చుటకు దేవ దేవునకు స్త్రీవేషమును వేయించి, యేకవీర యను పేరు పెట్టి—"

"అహ్హాహ్హా! కుమారా! మఱి నీవు చెప్పనక్కఱలేదు. నాకుఁ దెలిసినది. అది నిన్ను మోసపుచ్చుటకాదు. నీప్రాణములను రక్షించుటయనుకొనుము. రోగనిమగ్నుఁడవై నిరంతరము నదేపనిగా నేకవీరను గూర్చి పలువరించుచు నెన్నిమందులుపోసినను లాభములేకుండ నీవు శుష్కించుచుండుటచే నీజీవనమునందు సంశయముకలిగి, నీ పలువరింతలవలన నీవేకవీరయను నొక సుందరిని వరించినట్లు గ్రహించి, నిన్నీరోగ సముద్రమునుండి యొడ్డునఁ బడవేయుటకు నే నీయుక్తి పన్నితిని. బుద్ధిమంతుఁడ వగునీవాసంగతి గ్రహించియే యుందువు. ఇటుచూడు! నీనిమిత్త మింత ప్రయత్నించి, యింత ప్రయాసపడిన నాయందు - నామాటయందు - నీవు గౌరవముంచక తీరదు. నీకుఁ బ్రాణదాత నగు నాయభీష్టమును నీవు నెరవేర్పనియెడలఁ గృతఘ్నుఁడ వగుదువు. రుద్రాంబయొద్దకన్న నీవిచ్చట వేయిరెట్లధికముగ సకలసౌఖ్యములు ననుభవింపఁగలవు. ఆమె యొసంగిన యుద్యోగముకన్న నీకు నేను గొప్పయుద్యోగ మొసంగెదను. సమస్తసైన్యములకు ని న్నధినాథునిగా నభిషేకమొనర్చి, రాజ్యమునందంతట నాతో సమానమైన యధికారము నీకొసంగెదను. నాయొద్ద నున్న వారి కెంత స్వాతంత్ర్య ముండునో దేవదేవు నడిగి తెలిసికొనుము."

"మహారాజా! తమ యవ్యాజానుగ్రహామునకు నేను బ్రహ్మానందభరితుఁడ నైతిని. నన్ను నమ్మికొనియున్న రుద్రమదేవిని మోసపుచ్చి, నాకై యూరక విలపించుచున్న యేక వీరను దుఃఖపెట్టి నే నీరాజ్యమున నెట్లు నివసింపఁగలను? నన్ను ముంచిన యీమహా రోగములో నేను గడతేరియుండినచో నా కీకష్టము లన్నియు లేకపోవునుగదా?"

"అయ్యయ్యో! కుమారా! నీ వెంత వెట్టివాఁడవు? విధికృతము——"

అని యేమోచెప్పఁ బోవుచుండ దేవదేవుఁ డడ్డమువచ్చి,

"కుమారదేవా! ఓమహారాజా! ఈవిచిత్రవార్త మీరిరువురును వినవలసినదే. నిన్నటి రాత్రియంతయుఁ బ్రయాసపడి, ధన్నునివలన నేను గ్రహించిన సారాంశము మిక్కిలి యద్భుతమైనది. తనమనోహారునకుఁ గల్గిన దురవస్థను గూర్చి పాప మేక వీర యూరక బెంగపెట్టుకొని, దుఃఖించుచుండఁ, గఠినచిత్తయగు రుద్రమదేవి యమంగళకరముగఁ దనయింట రోదనము చేయవలదనియు, నాయంగ్డాయమున్నచోఁ గుమారదేవుఁడు జీవించుననియు లేనియెడల గలించుననియు, నవసర మున్నయెడల వానితో నీవు గూడ గంగలోఁగలిసి పొమ్మనియు ననేకవిధముల దూషించి, తిట్టి కొట్టి పాప మామెను బట్టణమునుండి గెంటివేసినదఁట. ఆ మహాసాధ్వి వెలనాఁటి సీమకుఁ బోయి ప్రస్తుతము తనతల్లియొద్దనే యున్నదఁట.

అని పలికి, రాజుమొగముఁ జూచి, గంభీరార్థబోధకముగా మందహాస మొనర్ప సాగెను. ఆమందహాసమునందలి గూఢార్థమును, వానిమాటల యందలిసారమును, గ్రహించి, కుమారదేవు నెట్లులైన నంగీకరింపఁ జేయుటకే దేవదేవుఁ డీయుక్తిపన్నినట్లు భావించి, లోలోన వాని నూరక మెచ్చుకొనసాగెను. కుమారదేవుఁడును దేవదేవుని మాటలు ముగించినంతనే కనులెఱ్ఱఁజేసి మితిమీరిన యాగ్రహము నభినయించుచు——

"ఏమేమీ! ఇంత కాలము నేమో యనుకొంటిని. రుద్రమదేవి యింతటి కఠినచిత్తయా? నాతోఁగూడ నాప్రియురాలగు నేకవీర యేగంగలోనో కలియవలయునా? అబ్బా! ఎంతసాహసము! సరియే! ఇదియు మంచికే వచ్చినది. మరలనే నా పాపాత్మురాలిమొగము చూడకుండ, సంగతులన్నియు ముందుగానే తెలిసినవి. వెల నాటిసీమనుండి నాప్రియురాలిని దెప్పించుకొని నే నెచ్చట జీవనము చేయలేను? ఏరాజు నాశ్రయించిన నాకుద్యోగము లభింపకుండును? తానొక్కతెయే నాకు దిక్కనుకొనినది కాఁబోలు? ఛీ! నాకెంతవిరక్తి పుట్టించినది?

అని రోషముతోఁ బలుకుచుండ నామాటలు వినుచున్న పాండ్యరాజు ముఖలక్ష ణము లెన్నివిధముల మారుచుండెనో చూచి తీరవలయును. చిఱునగవుతో నతఁడు శిరము కంపించుచు——

"కుమారా ! రుద్రమదేవిసంగతి నీకిప్పుడు బోధపడినదా ? నిజముగా నీవు పౌరుషవంతుఁడ వైనచో, నిన్నును నీప్రియురాలినిఁ గూడ నింతనీచముగాఁ బరిగణించిన యాచండాలురాలి మొగమును గలలోనైనఁ జూచెదవా? అబ్బాయీ ! ఇప్పుడైనను నామాటయందు నీకుగౌరవమును నాదరమును గలిగినదా? ఆరుద్రమను—"

"ఛీఛీ ! మహారాజా ! నన్నుక్షమించి, యాపాపాక్షరములు నాచెవిలోఁ బడనీయకుఁడు! నాకుఁ బంచమహాపాతకములు సంభవింపఁగలవు!"

"శబాస్ ! కుమారా ! నీవు నిజమైన పౌరుషవంతుఁడవు. నిన్నొకమారు కౌఁగిలించుకొనినఁ గాని, నాకుఁ దృప్తి తీరదు!"

అని రాజు వానిని గౌఁగిలించి, వాని రెండుచెక్కిలులను ముద్దుపెట్టుకొనుచుండ, నతఁడు దూరముగా దొలంగి—

"దేవా ! నేఁటినుండియు నేను మీకాశ్రితుఁడనైతిని. అందుచే సర్వమైనంత వఱకే నన్నుగౌరవింపవలెను. కాని యిట్లుచేయుట ధర్మము కాదు."

"కుమారా ! ఎంతటిగౌరవమున కైనను నీ వర్హుఁడ వగుదువు. నీవంటి మహానీయుని సాహాయ్యమున్నచో నాపాపాత్ములరా లింతకాలమువఱకు నాంధ్రరాష్ట్రపీఠముపైఁ గూర్చుండి యుండుదురా ? ఇఁకమీఁద నాసామర్థ్యమును నామెకుఁ గల్గు భంగపాటును నీవే చూడఁగలవు. ఆహా ! కుమారదేవా ! నిజముగా నేఁడు నాకెంతటి సుదినము ? ఏదీ? మఱియొకమారు నిన్నుఁ గౌఁగిలించుకొన నిమ్ము ! అబ్బాయీ ! నేఁటినుండియుఁ బాండ్యసైన్యముల కెల్లఁ గుమారదేవుఁడే ముఖ్యనాయకుఁ డని నేను నిర్భయముగా నెల్లెడలఁ జాటింపవచ్చునా ? లేక నీ కింకేమైన సందేహమున్నదా!"

"మహారాజా ! ఇంకేమి సందేహమున్నది ? తమయాజ్ఞకు నేను వ్యతిరేకముగఁ బ్రవర్తింపఁగలనా ?"

"సరే ! దేవదేవా ! నీవు కుమారదేవునకు సహాయ సైన్యాధిపతివై నేఁటినుండియు మీ రిరువురును గూడి మీయధికారముల క్రింద యుద్ధప్రయత్నము లన్నియు నిర్విఘ్నముగఁ గొనసాగింపుఁడు."

"దేవా ! చిత్తము."



13|14

# 24-వ ప్రకరణము

## ధన్నునితోఁ బ్రసంగము

దేవదేవుఁ డొసంగినయుత్తరము గైకొని యానాఁ డుదయముననే ధన్నుఁడు మధురానగరమునుండి బయలుదేరెను. పట్టణము విడిచినది మొద లాతఁ డతిదీక్షతో నా దినమంతయుఁ బ్రయాణము చేసి, సాయంకాల మగుసరికిఁ ద్రిపురాంతకదేవుని యాశ్రమమునఁ బ్రవేశించెను. అప్పుడు ద్వారముకడఁ గూర్చుండిన యిరువురు పరిచారకులు లోనికిఁ బోనీకుండ వాని నడ్డగించి, యాతఁడు తమకుఁ గ్రొత్తపురుషుఁ డగుటచే సందేహించి యాపాదమస్తకము వానినిఁ బరీక్షింప నారంభించిరి. అట్లు పరీక్షించి, వారిలో నొకఁడు ధన్నునిఁ జూచి—

"ఓయీ! నీ వెవ్వఁడవు? ఎచ్చటనుండి వచ్చుచున్నావు?"

"అయ్యా! నాపేరు ధన్నుఁ డందురు. నేను మధురానగరమునుండి వచ్చుచున్నాను. నన్ను లోనికి విడిచిపెట్టుఁడు!"

"విడిచిపెట్టము. నీ వెవరికొఱకు వచ్చితివో మొదటఁ జెప్పుము."

"మీ ప్రభువుకొఱకు"

"మా ప్రభు వెవరు?"

"త్రిపురాంతకదేవుఁడు.

"నిన్నుఁ బంపించినవా రెవరు?"

"ఆసంగతు లన్నియు మీకవసరము లేదు. నన్ను లోనికి విడిచిపెట్టుఁడు! లేదా! నేను వచ్చినట్లు మీ రాయనకడకుఁ బోయి తెలియఁజేయుఁడు. ఆలస్యము కాఁగూడదు. అత్యవసరముగా మాటాడవలసి యున్నది."

అని బిగ్గఱగాఁ బలికినంతనే వారిరువురును లేచి రమ్మని వానిని వెంట నిడుకొని లోనికిఁ దీసికొనిపోయి, యొకగదిలోఁ బాన్పుపై నొంటరిగఁ గూర్చుండి యున్న త్రిపురాంతకుని సమీపించి, "దేవా! మధురానగరమునుండి తమకొఱ కెవఁడో యొకనూతనపురుషుఁడు వచ్చియున్నాఁడు. తమతో నత్యవసరముగ మాటాడవలసినపని యున్నదట" అని వినయముతోఁ బలికినంతనే, యేమో యాలోచించుకొనుచు నేమరుపాటునఁ గూర్చుండియున్న త్రిపురాంతకుఁ డామాటలు విని త్రుళ్లిపడి, ఏమేమీ? నూతనపురుషుఁడా! మధురానగరమునుండియా!" అని యాశ్చర్యముతోఁ బ్రశ్నించుచు, వారి

వెంటనున్న ధన్నునిఁ జూచి "ఓయీ! నీపేరేమి? లోనికిరావచ్చును." అని సెల విచ్చెను. వెంటనే ధన్నుఁడాగదిలోఁ బ్రవేశించి, వానియెదుటనే తానుఁగూడ గూర్చుండి—

"ఆర్యా! నాపేరు ధన్నుఁడందురు. నేను రుద్రాంబపరివారమునందలి యొక రాజభటుఁడను."

"అటులనా? అటులైన నీవు మాకాప్తవర్గములోనివాఁడవే? కాని నీవు మధురానగరమున కేఁగుట కేమి కారణము?"

"పాండ్యరాజు మనకుమారదేవునిఁ బట్టి బంధించినట్లు దేవి సంశయించి, వానిపేర నొక యుత్తరము వ్రాసి నన్నుఁ బంపినది."

"ధన్నా! కుమారదేవుఁడచ్చటనే యున్నాఁడా? పాండ్యరాజేమని ప్రత్యుత్తర మిచ్చినాఁడు?"

"కుమారదేవుఁడచ్చట సురక్షితముగ నున్నవాఁడు. ఇదిగో పాండ్యరాజు ప్రత్యుత్తరము."

అని ధన్నుఁడు తనయొద్దనున్న యొకయుత్తరమును దీసి వానికొసంగెను. త్రిపురాంతకుఁడాయుత్తర మందుకొని చదివి, శిర మూపుచు,

"ధన్నా! ఈపాండ్యరాజాధమున కెంత కండకావరము? ఎంత గర్వాంధత? దేవియం దింత నిర్లక్ష్యభావము వహించి యీమూర్ఖుఁ డెంతకాలము రాజ్య మేలుకొనఁ గలఁడు? వీని కంత్యకాలము సమీపించినది. సరే! ఈసంగతికేమి? ధన్నా! కుమారదేవుఁడు సురక్షితముగ నున్నాఁడని చెప్పితివే, ఎట్లు? ఇది మిక్కిలి వింతగా నున్నది."

"దేవా! తమతోఁ జెప్పవలసినసంగతులు వేలును లక్షలు నున్నవి. అందుచే నేసంగతి మొదటఁ జెప్పవలయునో యేది వెనుక చెప్పవలయునో తోఁపక నాలో నేనే యాందోళన మొందుచున్నాను. ఆంధ్రదేశమునకుఁ జక్రరక్షకులగు మీదర్శనము నేఁడు నాకు లభించుట మహాభాగ్యము. ఆర్యా! మీరు నన్నెన్నఁడైనఁ జూచినట్టుజ్ఞాపకమున్నదా? నేను మాత్రము మిమ్మిదివర కొకమాఱు దర్శించితిని."

'నాకు జ్ఞాపకములేదు. ఎప్పుడు?"

"పట్టాభిషేకానంతరమున రుద్రాంబ వెలనాఁటిసీమకు వచ్చినప్పుడు నేనుఁ గూడ నామెతో వచ్చి, మీసుందరమంగళవిగ్రహము గన్నులారఁ జూచి ధన్యుఁడనైతిని. ఇంత

లేఁబ్రాయముననే యిట్టిపౌరుషపరాక్రమములు వహించి, యింతచాకచక్యముతో నిందఱి శత్రువులమధ్య నిన్ని మహాకార్యములు చేయఁగల్గుట నాకే కాదు, ఆంధ్రప్రపంచమున కంతకుఁ గడువింతగ నున్నది. నాయనా! నిజముగ దేశముకొఱకుఁ బాటుపడవలసినవారు మీయట్టి వయోవంతులే! శుష్కవాదములతోఁ గాలము పుచ్చుట తప్ప వృద్ధు లెన్నఁడుఁ గార్యక్రమమున కుపక్రమింపలేరు. రాజ్యమునం దీయల్లరులు పుట్టిన తరువాత దేవి పరివారమునందలి మహామహులు కొందరు మన యాంధ్రరాష్ట్రమును గూర్చి ప్రసంగించుచుఁ బలుమాఱులు సభలు గావించుచు వచ్చిరి కాని యదికాదని కొందరు నిదికాదని కొందరు నిటుచేయవలయు నని కొందరు నటుచేయవలయునని కొందరు దమలోఁ దామ తగవులాడుకొనుట తప్ప, నిజముగాఁ బనిసేయఁగలిగినవారును, నుపక్రమించి చేయుచున్నవారును, నొకరిద్దఱు కన్న నాకుఁ గానరాలేదు."

"ధన్యా! ఇప్పు డాప్రసంగమంతయు నెందుకు? ముఖ్యమైనసంగతి యేదో చెప్పుము. నే నాతురతతో నున్నాను."

"దేవా! సంగతులన్నియుఁ జూచి నిజముగా నాకు మతిపోయినది. నేను మిమ్ముఁ దీసికొని పోవలసిన కథాసముద్రమునకు రేవేదియో తెలియకున్నది. అయినను మన మీయుత్తరమునే తెప్పగాఁగొని ప్రారంభింతము. దీనిని మీరు చిత్తగింపుఁడు."

అని పలికి, తనయొద్దనున్న మఱియొక యుత్తరమునుదీసి వాని కొసంగెను. త్రిపురాంతకుఁ డాయుత్తరము నందుకొని తనలో నిట్లు చదువనారంభించెను.

"ఆంధ్రరాష్ట్రోద్యమదీక్షానిరతు లగు శ్రీత్రిపురాంతకదేవసుధీమణుల పాదపద్మములకు నమస్కరించుచు విధేయుఁ డగుదేవదేవుఁడు వ్రాసికొనిన విజ్ఞాపన మేమనఁగా:—

ఓయాంధ్రకుమారశేఖరా!

నేనెవ్వఁడనో ప్రస్తుతమును మీ రెఱుఁగరు. మీరెవ్వరో మొదటినుండియు నే నెఱుంగుదును అందుచే మీరింటలేనప్పుడు స్వతంత్రముగ మీయాశ్రమమున నేను ప్రవేశించి, సర్వేశ్వరుఁడు నాకొసంగిన మీరూపవిశేషముచేత, మీపరివారమును మీరే యని భ్రాంతిపుట్టించి, మోసపుచ్చి, యేమహాకార్యముకొఱకు, మీ రేయుత్తరము నతిభద్రముగ దాచియుంచుకొనిరో, యామహాకార్యము కొఱకా యుత్తరమును నేను సంగ్రహించి, పాండ్యరాజుకడకు వచ్చి, యామధురానగరమున నాజయపతాకమును నిరాఘాటముగ స్థాపింపఁ గల్గితిని. మీసోదరియగు ఏకవీరకుఁ బ్రాణప్రియుండైన కుమారదేవుని..."

"ఏమేమీ? ధన్నా! నాసోదరి ముందువెనుక లరయక యంతటిమహానీయమూర్తి యగుకుమారదేవునే వరించెనా? ఏమహారాజకుమార్తెనో చేపట్టక, కుమారదేవుఁడు నాసోదరినిఁ బెండ్లాడసాహసించునా? ఆమె కీపేరాస యేల జనించినది!"

"దేవా! ఇది పేరాసయో కాదో నాకుఁ దెలియదు కాని, యామె నొక్క క్షణము చూడకున్నఁ గుమారదేవుఁ డొకయుగము గడపవలసివచ్చును."

"ఓహో! ఇదియొంతవింత? నే నెంత ధన్యుఁడనైతిని? ధన్నా! ఏకవీర యేకశిలానగరమునకుఁ గాన రానట్లు జనులు చెప్పుకొనుచుండఁగా విని, రుద్రమదేవికడకు నాయుత్తరముఁ గొనిపోయిన నాపరిచారకుఁడొకఁడు నాతోఁ జెప్పినాఁడు. ఇదెంతవఱకు నిజము? ఆమె యిప్పు డెచ్చట నున్నది?"

"ఆమె సురక్షితముగానే యున్నది. దేవియొద్దనే యున్నది. కుమారదేవుని వియోగదుఃఖముచేత నైదాఱుదినములవఱకు నామె నిద్రాహారములు మాని, యెవ్వరి కంటఁబడక యొకగదిలోఁబడియుండుటచేత రుద్రాంబ మొదలగువారందఱు నట్లు భ్రాంతిపడిరి కాని మఱియొకటికాదు. ఈసంగతులకేమి? ఉత్తరమును సాంతముగాఁ జిత్తగింపుఁడు."

అనిపలుక నాతఁ డాయుత్తరమును మఱల నిట్లు చదువఁ దొడంగెను.

"........ప్రాణప్రియుం డగుకుమారదేవుని సేనాపత్సముద్రమునుండి సంపూర్ణముగ రక్షించితిని గావున వానినిగూర్చి మీ రెట్టిప్రయత్నము నాచరింపవలసిన యవసరము లేదు. చేయవలసినయేర్పాటులు చేసి మేమిరువురమును గొలఁది దినములలోనే మీ దర్శనమునకు వచ్చుచున్నారము. మేము వచ్చినతరువాత మీరు ప్రస్తుతమున్న యాశ్రమములో నింక నుండవలసిన యవసరముండదు. అప్పుడు మీరును మాతోఁ బాటుగ నుండవచ్చును. మా వలెనే సంచరింపవచ్చును......"

"ధన్నా! ఈవాక్యములలో మాత్ర మేదోవ్యంగ్య మున్నట్లు కనఁబడుచున్నది. సరియైన భావము బోధపడ లేదు."

"ఏమివ్యంగ్యమున్నది? వా రిరువురును వచ్చినతరువాతఁ గొండలనడుమనున్న యీతాటియాకులయాశ్రమమున నుండ నవసరములేకుండ వా రిరువురితోఁగూడ మీరును ఏకశిలానగరమునకుఁబోయి హాయిగా యుద్ధప్రయత్నములొనర్పవచ్చునని, దేవదేవుని యభిప్రాయము కాఁబోలు?"

"కాఁబోలును. అదే వానియభిప్రాయము నేనే పొరబడితిని."

అని మఱల నుత్తరమును జూచి,

"........మావలెనే సంచరింపవచ్చును. ఇచ్చట యుద్ధప్రయత్నములు దినదినాభివృద్ధిగా జరుగుచున్నవి. దేవగిరిసైన్యములు బయలుదేరినవి. కాఁబట్టియీరహస్యములు వెంటనే మనరుద్రమదేవి కెఱింగించి, యంతలో నూరకుండక, తక్షణము మీరు మీభటవర్గముతోఁ గూడ బయలుదేరి జైనాశ్రమమును నిర్మూలనము గావించి, యా కుతంత్రపరాయణుఁ డగుజైనాచార్యుని బట్టుకొనవలయును. లేనియెడల ముప్పు రాకమానదు. శత్రువు లేకశిలానగరముపైఁ బడనున్నారు. వ్యవధిలేదు. తక్కిన సంగతులన్నియు ఛన్నుఁడు మీకు వినిపింపఁగలఁడు.

చిత్తగింపవలయును.

విధేయుఁడు, దేవద్దేవుఁడు."

అని యాయుత్తరమంతయుఁ జదివి, తత్తరపడుచు,

"ఛన్నా! ఈదేవదేవుఁ డెవఁడో మనపాలిటదేవదేవునివలెనే కనఁబడుచున్నాఁడు. ఈ రహస్యములు ముందుగా మనకుఁ దెలియకున్న యెడల నెన్నికష్టములు పడవలసి వచ్చును? తక్కిన నీవు చెప్పవలసిన సంగతులన్నియు సావకాశముగఁ జెప్పవచ్చును. కార్యతత్పరతచే నామనసిప్పుడు వ్యాకుల మొందుచున్నది. నీ వొకసారి లేచి నావెనువెంటనే రమ్ము. చిన్నపనియున్నది."

అని త్రిపురాంతకదేవుఁడు వెంటనే యచ్చటినుండి లేచి ఛన్నుని వెంటనిడుకొని, గృహములన్నియు దాఁటుచుఁ దిన్నఁగా లోనికిఁబోవసాగెను.

---

## 25-వ ప్రకరణము

### మహోపదేశము

"మహేశ్వరీ! ఈదుర్బుద్ధి నీకే పుట్టినదా? లేక నీకెవరైన బోధించిరా? నీకేమైన యుక్తాయుక్తవిచక్షణజ్ఞాన మున్నదా? నీ కీ స్వాతంత్ర్య మెందుండి వచ్చినది? నీ కెవ్వరును బెద్దలు లేరనుకొంటివా యేమి? వాఁ డెవఁ డనుకొంటివి? వానిని నే నెందుకుఁ జేరఁదీసితినో యెఱుఁగుదువా? వానితో నెంతవఱకు నాకు సంబంధ మున్నదో గ్రహించితివా? కలకాలము వానిని నే నిట్లు గౌరవించుచుఁ బూజించు చుందుననియా నీయభిప్రాయము? నీనూరాలోచనమంతయు నేమైనది? నీ తెలివితేటలే గంగలోఁ గలిసిపోయినవి? పొట్టఁజీల్చి కాగడాలతో వెదకినను రవంత

యక్షరజ్ఞానము లేనిదేవదేవుఁడా నీమనోహరుఁడు? ఛీ ! పాపీ! మూర్ఖచిత్తా! ఎంత దురాలోచన మొనరించితివి? ఈసంగతి నాతోఁ జెప్పుటకు నీకు సిగ్గులేకపోయినది? నీవిక్కమాలినరూపురేఖలు విని, నీనిమిత్త మెందఱో పేరెక్కినమహారాజకుమారులు నన్నుఁ బ్రార్థించుచుండ నింకను గొప్పసంబంధములువచ్చునేమోయని నేనునిరీక్షించు చుంటినే! నిలుచుటకు జేనెఁడుసీడ యైనలేని పట్టిగర్భదరిద్రుఁ డగుదేవదేవునకు నిన్నుంటఁగట్టినయెడల నాటిమహారాజు లందఱు నన్నుఁ దలయెత్తి తిరుగనిచ్చెదరా? నేను బ్రదికియున్నంతవఱకు న న్నెవ్వఁడైన గౌరవించునా? న న్నపకీర్తిపాలు సేయుటకా నీప్రయత్నము? ఆదేవదేవునికన్న మనద్వారపాలకులలో నెవ్వనినైనఁ జేపట్టఁగూడదా? వారందఱును నింతయో యంతయో స్థిరవసతి కలవారే ! ఆయనామధేయునిపైనీకీపాడుబుద్ధిపుట్టుట నీగ్రహచారమా? నాగ్రహచారమా? ఇదిగో వినుము. ఇప్పుడే నీతోఁజెప్పివేయుచున్నాను. నీకు నేను రెండుదినములుమాత్రమొగడువొసంగితిని. ఈరెండుదినములలో నీకీయుత్పన్నమందబుద్ధిని మరలించుకొనవలయును. అట్లు మరలించుకొనక, నీ వింకను దత్ప్రయత్నములో నున్నట్లు నాకుఁ దెలిసినయెడల— ఇదిగో! చూడుము. ఈఖడ్గము నిన్ను ముక్కముక్కలుగఁ దెగనఱికి,—ఛీ? దుష్టచిత్తా! మహాపాతకీ! ఎట్టియమంగళములు నానోటఁబల్కించుచుంటివే! నీపాడుమొగము చూచినయెడలఁ బంచమహాపాతకములు చుట్టుకొనును. నీకుఁ దగినపని చేసెదను. జాగ్రత్త."

అని పండ్లు పటపటఁ గొఱుకుచుఁ గేళికాగారమునందుఁ దనయెదుట దీనవదనయై నిలువఁబడిన మహేశ్వరిని దూషించుచుఁ బాండ్యరాజు తన యాసనముపైనుండి దిగ్గున లేచి, వెనుకకుఁ దిరిగిచూడకుండ నెచ్చటికో పోయెను. తండ్రి యచ్చటనుండి లేచి పోయినతరువాతఁ గూడ నాసుందరి లేశమును జలనములేక, చిత్రప్రతిమవలెఁ గొంతసేపువఱకు నట్టులే నిలిచియుండెను. ఆనాఁడు దేవదేవునితో నచ్చటనే రహస్యముగ సంభాషించి తన మనోభీష్టమును వానికెఱిఁగించినదిమొదలు మహేశ్వరి వానియందే దృఢానురాగమును వహించి, మిక్కిలి పట్టుదలతో నుండెను. దేవదేవుఁడుఁగూడ నామెయందు మిక్కిలి ప్రేమకలవాఁ డగుటచేత, రాజు లేనప్పుడు రహస్యముగా నచ్చటికిఁ బోవుచుఁ దఱుచుగా నామెతో సంభాషించుచుండెను. దేవదేవునియం దంతటి గౌరవాభిమానములు వహించిన తనతండ్రి తన మనోరథమును వినిపించినయెడలనంతటి ప్రజ్ఞావంతుని వరించినందులకు సంతసించి, యాతఁడు వెంటనే యంగీకరించునని మొదటినుండియు మహేశ్వరి కొకపిచ్చినమ్మకము గలిగియుండెను. దేవదేవుఁడు మహాను భావుఁ డనియు రాజనీతివిశారదుఁ డనియుఁ దన యదృష్టవశమున లభించినాఁ

డనియుఁ బలుమారు లాతఁడు వానినిఁగూర్చి తనయెదుటఁ బ్రశంసించుచుండుటచేతనే పాప మామెకీపిచ్చినమ్మకము జనించినది. అందుచేతనే యానాఁటియుదయమున నామె తనతండ్రిని కేళికాగారమునకు రప్పించి, నిర్భయముగా నట్టు తనయభిప్రాయమును వెల్లడింప సాహసించినది. కాని యనుకొనినట్లు జరుగలేదు. వాని కంతయాగ్రహము జనించుననికూడ నామె భావింపలేదు. వానిమాటలవలనఁ దనహృదయేశ్వరునియందు వానికిఁ గలకపటోద్దేశమంతయుఁ గ్రహించి, యామె మఱింత విచారింప నారంభించెను. రాజు తన యుద్దేశమునకు విరోధముగాఁ బ్రవర్తించినయెడల నామె చేయఁదలంచిన యేర్పాటు వేఱుగానుండుటచేత, వాని కఠినోక్తుల కేమియుఁ బ్రత్యుత్తరము లీయక బేలవలె మౌనము వహించి యూరకుండెను. చాలసేపువఱకు నామె యట్లే యచ్చట నిలిచి కొంతసేపునకు నిట్టూర్పు విడిచి, యిటునటుఁ జూచి, యాగది తలుపు లన్నియుఁ మూసి, లోన గడియలు వేసి, యందుతో సంబంధించి ప్రక్కనే యున్న మఱియొకగదియొద్దకుఁ బోయి, తాళముదీసి, తలుపులను దెఱచి లోనఁ బ్రవేశించి, యందొకమూల గట్టిగ నూపిరి యైనఁ దీయక నక్కియున్న దేవదేవునిఁ జూచి, ముందునకు రమ్మని సంజ్ఞచేసెను. తోడనే దేవదేవుఁడు చప్పుడుగాకుండఁ బిల్లివలె మెల్లఁగ నడుగు లిడుచు ముందునకు వచ్చి—

"మహేశ్వరీ! నేఁడు మనము చేసినపని యుక్తముగా లేదని నాయంతరాత్మ నన్నూరక బాధించుచున్నదిసుమా! రహస్యముగ నే నిచ్చట నక్కియే యుంటిని గాని నా ప్రాణములుమాత్రము నాశరీరమున లేవు. అబ్బా! వాని కెంతయాగ్రహము వచ్చినది?"

"ప్రాణేశ్వరా! అంతరాత్మ బాధించుటకు మన మేమితప్పుపని చేసితిమి? మీకుఁ గూడ నాయందు వ్యతిరేకభావము జనించినయెడల నింక నాకొఱ కెవ్వరును గష్టపడ వలసినయవసర ముండదు. నేఁటితో నాకాతఁడు తండ్రి కాఁడు. నే నాతని కుమార్తెను గాను. ఇది ముమ్మాటికిని నిశ్చయము."

"మహేశ్వరీ! ముఖ్యమైన సంగతులు తప్ప మన కధికప్రసంగమున కిది వేళ గాదు. నే నిచ్చట జాగు చేసినయెడల ముప్పు రాక మానదు. కావున నీయుద్దేశ మేమో యిప్పుడు స్పష్టముగా నాకుఁ దెలియఁజేయుము."

"మనోహరా! ఇన్నిదినములవఱకు సహవాసము చేసి, నాయుద్దేశ మేమో మీరు గ్రహింపలేదా! నన్నిప్పుడు క్రొత్తగా నడుగవలయునా? ఎంత చమత్కారము!'

"అటు కాదు. గ్రహించితిని గాని, యిప్పుడు సమయము వచ్చినది. అందుచే నిన్ను మఱియొకమా ఱడుగుచున్నాను."

"మీ రెన్నిమారు లడిగినను నేను చెప్పు ప్రత్యుత్తరము మాత్ర మొక్కటియే! మీరు సందేహింపవలసినపని లేదు.

"ఔను. సంతోషమే! కాని నేను చెప్పఁబోవు సాహసమునకు నీవొడంబడఁగలవా?"

"మనోహరా! చావునకే తెగించినవారికి సాహస మని యొకటి యున్నదా యేమి?"

"నిజమే కాని, నేను పడవలసినకష్టము కొంతకాలము వఱకు నీవుఁ గూడఁ బడవలసి యున్నదిసుమా?"

"ఈశరీరమే మీ కప్పగించినప్పుడు కష్టమంతయు మీదే కాని నా కేమున్నది? అందుచే నీరెండుకష్టములు నొక్కమారు వహింపవలసివచ్చినందున మీకే సాహస ముండవలయును గాని నాకుఁ గాదు. అనుమానింపవలసినదానను నేను గాని మీరు కారు."

"ప్రాణేశ్వరీ! అట్టియనుమానము లేశము నవసరము లేదు. అడుగవలసి యడిగితినిగాని నీహృదయమును గనిపెట్టక కాదు. నీనిమిత్తము నాప్రాణములనైన నేను వెచ్చించుటకు సిద్ధముగ నున్నాను. ఎవ్వరికి నెట్టియపరాధమును జేసి యెఱుంగనినిరపరాధుల మగు మనకు నెట్టియాపదయుఁ గల్గింపక సర్వేశ్వరుఁ డన్నివిధములఁ దోడ్పడఁగలఁడని నాకు ధైర్యమున్నది. సుందరీ! ఇంక నాలస్య మెందుకు? ఈసుందరకేళికాగారమున మన కిదియే కడసారి ప్రసంగము. ఈకేళికాగారము మన కిప్పుడు కారాగార మైనది. ఇందుండి విముక్తి చెందుటకు నేను నీకొక పరమ రహస్యము నుపదేశించెదను. నీవు కడుజాగ్రత్తవహించి, యాయుపదేశము ప్రకారము ప్రవర్తించినయెడల మెడలోని పూలదండయైన వాడకుండ, ఈ పాండ్యరాజ్యమునుండి కడుసౌఖ్యముగ దాఁటివేయ గలము."

"మనోహరా! అంతటిమహాభాగ్యము లభించుటకై మీరు నన్నేమి చేయుమన్నను జేసెదను. అగ్ని నుఱుకుమన్న నుఱికెదను. విషము ద్రాగుమన్నఁ ద్రాగెదను."

"సుందరీ! నీవు చేయవలసిన కార్యములో నంతటిసాహస మూనవలసిన యవసరము లేదు కొంతవఱకే సాహసమును గొంతయుక్తియు మంచిచాతుర్యమును మాత్ర ముండక తీఱదు."

అని పలికి యామెను మఱికొంచెము చేరువగ నిలిచి, యామె కేమియో దేవదేవుఁడు చాలసేపువఱకు నుపదేశించెను. ఆయుపదేశ మంత్రము సాంతముగ వినినతరువాత మహేశ్వరికిఁ గల్గినయానంద మెవరు వర్ణింపఁగలరు ?

---

## 26-వ ప్రకరణము

### పాండ్యరాజుసంతోషము

ఆరోగ్యస్నానము చేసినతరువాతఁ గుమారదేవునిఁ బాండ్యరాజు సముచితవస్త్రాలంకారములతో నలంకరించి యొకనాఁడు కొలువుకూటమునకును, మఱియొకనాఁడు సేనావారమునకును, దక్కిన రాజకీయకార్యస్థానములకును దనవెంటఁ గొనిపోవుచుఁ దనయుద్యోగస్థుల కెల్లరకు వానిని జూపుచు మనముఖ్యసేనానాయకుఁడే యని చెప్ప మొదలిడెను. పూర్వపుటారోగ్యమును, బూర్వపుజవసత్త్వములను బూర్వపుతేజస్సును మఱల వహించి, చూచుటకు వేయికన్నులైనఁ జాలకుండ నతిప్రతిభాశాలియుఁ దేజోవంతుఁడునై తనసుందరమూర్తిచేఁ గుమారదేవుఁ డెల్లరదృష్టుల నాకర్షించుచు సముచితగతి నందఱిచే గౌరవింపఁబడుచుండెను. తాను చేసినపని కాదనువారియం దీసు వహించుట మొదటినుండియు రాజుస్వభావ మగుటచేత వాని నెఱిఁగినంతవఱకు వానియుద్యోగస్థు లందఱును వానియెదుటఁ గుమారదేవుని శ్లాఘించుచు నట్టివానికి సైన్యాధిపత్య మొసఁగుట గొప్పరాజకీయతంత్ర మని రాజును గొనియాడుచుండిరి. ఆస్తోత్రపాఠముల కుబ్బి నిజముగాఁ దాను బ్రయోజకుఁడనియే సంతోషించుచుఁ గుమారదేవుని రాజు మఱింత గౌరవించుచుండెను. మధురానగరమున నున్న మూఁడుమాసములలో రమారమి రెండుమాసములు రోగావస్థయందుఁ గడపినను మిగిలిన కొలఁదిదినములలోనే కుమారదేవుఁ డెల్లరియాదరణమునకుఁ బాత్రుఁడయ్యెనని చెప్పవచ్చును.

ప్రతిదినమును సాయంకాలములయందు రాజునాజ్ఞప్రకారము దేవదేవకుమారదేవు లిరువురును సేనావారమున కేఁగుచు నచ్చట వలయునేర్పాటులు గావించుచుండిరి. అట్లే యొకనాఁడు వారిరువురు నచ్చటికిఁబోయి, తమకార్యమునం దప్రమత్తులై చరించుచుండ నెందుచేతనో పాండ్యరా జాకస్మికముగ నాసేనావారముకడ కత్యాతురతతో వచ్చి, దేవదేవకుమారదేవులను సమీపించెను. మెడనుండి పాదములుసైతము గప్పునంతటి పొడవైనజేగురుచొక్కాయ ధరించి, వక్షస్థల మినుమంతయుఁ గానరాకుండ వందలకొలఁది రుద్రాక్షమాలికలఁ దాల్చి, యొకచేతియందుఁ ద్రిదండమును మఱియొకచేతియందు భిక్షాపాత్రము నూని, మొగమునం దంతట ప్రేలెఁడెత్తున దట్టముగ విభూది

మెత్తి, యొండొంటి నంటి కడుదీర్ఘములై వ్రేలాడుచుండిన జడలన్నియుం గుదురుగఁ జుట్టినచుట్టపై రుద్రాక్షలకిరీటమును బెట్టి, యొకఋషికుమారుఁడు గూడ నవ్వుడు రాజు వెంటనే యచ్చటికి వచ్చెను.

నాఁటిసాయంకాలమున నొకవిశాలమగు మైదానముపైఁ గొందఱు సైనికులను వరుసగ నిలువఁబెట్టి వారి నత్యంతశ్రద్ధతో రణశిక్ష నభ్యసింపఁ జేయుచున్న దేవదేవ కుమారదేవు లిరువురును జెంత నున్నవారివలన రాజురాక విని పరులు పోల్చుకొనకుండఁ దమలోఁ దామె నవ్వుకొనుచు, వెంటనే వచ్చి తమప్రభువు నెదుర్కొని నమస్కరించి, మహానందమును స్ఫురింపఁ జేయుచున్న వానిముఖలక్షణముల నీక్షించుచు వెనుకనున్న ఋషికుమారు నరసి యాశ్చర్య మొందసాగిరి. వారినిఁ జూచిన వెంటనే రాజు నవ్వుచు "దేవదేవా ! కుమారదేవా ! శుభములు వచ్చినప్పు డన్నియుం శుభములే. కష్టములు వచ్చినప్పు డన్నియుఁ గష్టములే. ఈప్రాపంచికరహస్యము బాలురగుటచే మీరు కనిపెట్టఁజాలకపోయినను లోకానుభవము గలనేనుమాత్రము గ్రహించినాఁడను జూడీ" యని పలుక దేవదేవుఁడు వాని కిట్లనియె.

"దేవా ! ఏదో మహాకారణ ముండకున్నఁ దమ రీనీతివాక్యమును మాకుపదేశింపరు. తమ రిట్లేల దయచేసితిరి ? తమచేతనున్న యాయుత్తర మేమి ? ఈఋషికుమారుఁ డెవరు ?"

"దేవదేవా ! అహ్హాహ్హా హాహాహా ! జైనాచార్యుఁడు — అహ్హాహ్హా హాహాహా ! త్రిపురాంతక దేవుఁడు— అహ్హాహ్హా హాహాహా ! ఈఋషికుమారుఁడు— అహ్హాహ్హా హాహాహా ! మన కుత్తరము— అహ్హాహ్హా హాహాహా........."

అని యిట్లు మితిమీఱినవ్వుచేఁ బాండ్యరాజు మాటాడలేక, యూరక పకపక నవ్వుచుండ దేవదేవుఁడు తానును నవ్వుచు,

"మహారాజా ! ఇంతనవ్వునకుఁ గారణ మేమో తెలియవలెనని నేను మిక్కిలి యాతురతతో నున్నాను. నేనే చదువుకొనెద నా యుత్తరము నిటు తెండు."

అని పలికి యాతఁ డందిచ్చినయుత్తరము నందుకొని, మెల్లఁగ నిటు చదువసాగెను.

"చిరంజీవిపాండ్యరాజునకు—

జైనాచార్యుఁడు వ్రాసినసంగతు లేమనఁగా:—

వత్సా ! మనకు మంచిదినములు వచ్చినవి. నేను కొన్నితొందరపనులలో నుండుటచే నీయుత్తరములో ముఖ్యమైనసంగతి యొకటిమాత్రము వ్రాయుచున్నాను. నీవు

త్వరపడవలయును. మించిపోయినచోఁ గార్యము లేదు. మధురానగరమునుండి నా యాశ్రమమునకువచ్చు - కాలినడకదారిలో - మాయూరునకు-ఇరువదిమైళ్లదూరమున - కొండగుట్టలలో-ఒకతాటియాకుల యింటిలో-తనపరివారముతో-త్రిపురాంతకదేవుఁడు-నివసించుచున్నట్లు నాకు స్పష్టముగాఁ దెలిసినది. వానిని బట్టుకొనుటకు నూర్గురుసైనికులతో నీవుకాని నీసేనానాయకులలోఁ దెలివితేటలు కలవా రెవరైనఁగాని, వెంటనే బయలుదేరవలసియున్నది. ఈపని నేనే చేసియుందునుగాని కొన్నికారణములచే వీలు లేకపోయినది. సంగతు లన్నియుం స్పష్టముగా వ్రాయుటకు నా కిప్పుడు కాలము చాలదు. ఇంకమీఁద నీయిష్టము. ఉపేక్ష చేయవద్దు.

గ్రహింపవలెను.

జైనాచార్యుఁడు."

అని యాయుత్తరమును ముగించి, దేవదేవుఁడు తెల్లవోయి యట్టులే నిలిచి పోయెను. అది చూచి రాజు

"దేవదేవా! ఈమిడతంభట్టు మనచేతిలో నెంతసూక్ష్మముగాఁ జిక్కినాఁడు? పాప మింక రుద్రమదేవిగతి యేమి? అహాహాహా హాహాహా"

"దేవా! ఈయుత్తరమునుబట్టి మనజైనస్వామి యెంతో తొందరపనులలో నున్నట్లు కనఁబడుచున్నది. లేనియెడల సంగతు లింత యస్పష్టముగా వ్రాయఁడు."

"ఔను. నిజమే. ఈయుత్తరము వ్రాయుటకే తీరుబాటు లేక యెంతో ప్రయత్నించి నట్లు కనఁబడుచున్నది. అంత తొందరపని లేకున్నయెడల నాతఁడే యీకార్యము నెఱవేర్చియుండును."

"మహారాజా! ఈయుత్తరము తెచ్చినవాఁ డీ ఋషికుమారుఁడేనా యేమి? ఈతఁ డేల వచ్చెను?"

"అయ్యో! నాయనా! ఆమహాత్మునిమాయలు సర్వేశ్వరుఁడైన గ్రహింపలేఁడు. నీవడిగినప్రశ్నయే నేనుఁ గూడ నీఋషికుమారు నడిగితిని. జైనాశ్రమమునుండి మధురానగరమువఱకుఁ గలమార్గమంతయుఁ గాచి యుత్తరప్రత్యుత్తరములఁ దెచ్చుచుఁ గొనిపోవుచున్న మనరాయబారులను దనభటులచేఁ బట్టించి, యాత్రిపురాంతకహతకుఁడు మనప్రయత్నములు భంగము గావించుచుండుటచేతఁ దన కీయుత్తర మిచ్చి, యీఋషికుమారవేషముననే యుంచి, యొక భిక్షువివలె జైనస్వామి వీనిఁ బంపించినాఁడఁట!"

"ఆహాహా! దేవా! ఆతఁ డెంతటియుక్తిపరుఁడు! ఎంతటికార్యవేది! ఎంతటి దూరాలోచనపరుఁడు! ఎంతటి రాజనీతిజ్ఞుఁడు!..."

"దేవదేవా! జైనస్వామిని నుతించుచుఁ గూర్చుండుట కిది సమయముగాదు. కార్యానంతరమున సావకాశముగా వానిని మనము శ్లాఘింపవచ్చును. ప్రస్తుతము చేయవలసినపని యేమో యాలోచింపుము."

"దేవా! ఆలోచింపుట కేమున్నది? చేయవలసినపని యేమో యీయుత్తరమునందే స్పష్టముగ వ్రాయఁబడియున్నదికదా? ఆందుచేఁ గాలవిలంబనము జరుగదు."

"ఔను సరే! బయలుదేరవలసినవా రెవరు? నీవా? నేనా? లేక మనమిరువురమునా?"

అని యడుగుచుండఁ గుమారదేవుఁడు

"మహారాజా! యెదుటనే యున్ననన్ను మఱచిపోవుచుంటి రేల? ఈస్వల్పవిషయమునందే నేను మీకు మఱపువచ్చితినా?"

"కుమారదేవా! అంతనిష్ఠుర మేదుకు? నిన్ను మఱచిపోలేదు. నీవిషయమై కూడ నాలోచించెదను. ఇంతలో నీవు పోయి, యొకగంటలోఁ బ్రయాణసిద్ధులై యుండవలెనని నూర్గురు సైనికులకు నాయాజ్ఞ నెఱిఁగింపుము. వారందఱు నుత్తమాశ్వికులై యుండవలయును."

అని పలుక వెంటనే కుమారదేవుఁ డచ్చటినుండి బయలుదేరిపోయెను. అప్పుడు రాజు,

"దేవదేవా! నీ వేమందువు? నీవా? నేనా? లేక మనమిరువురమునా?"

"మహారాజా! తమయిష్టమువచ్చినట్లు చేయవచ్చును. అయినను నాకుఁ దోచినసంగతి విన్నవించుకొనెదను. మనతో బయలుదేరుటకుఁ గుమారదేవుఁడు మిక్కిలి పట్టుదలతో నున్నట్లు కనఁబడుచున్నది. ఆరంభమునందే యీ స్వల్పవిషయమునందే మనము వానికోరిక నిరాకరించినయెడల ముందుముందు వానిచేఁ జేయింపవలసిన గొప్పకార్యములకు భంగము రాఁగలదు. తరువాత మీచిత్తము."

"దేవదేవా! నీ వన్నది నిజమే కాని, కుమారదేవుఁడుఁ గూడ బయలుదేరుటకు నేను కొంచెము సంశయించుచున్నాను. ఏదు కనఁగా......"

అని యతఁడు నసుగుచుండ దేవదేవుఁడు నవ్వుచు,

"దేవా! మీరు చెప్ప నక్కఱలేదు. మీయుద్దేశము నేను గ్రహించితిని. ఈప్రయాణ సందర్భములో నొకప్పుడాతఁడు తనమనసు మార్చుకొని రహస్యముగ మనలోనుండి దాఁటివేయునేమో యని మీసందేహము. కాని రుద్రమదేవియం దింతటి యసహ్యాభావమును మీయం దింతటిగౌరవభావమును గలయాతఁ డెప్పుడు నట్టిపనికి సాహసింపఁగలఁడని మీరు నమ్మవలదు. తన జీవితకాల మంతయు నిచ్చటనే వెళ్లఁబుచ్చుటయును, దన ప్రియురాలికి రుద్రమదేవి యొనర్చిన పరాభవమునకుఁ దగినప్రాయశ్చిత్త మొనర్చి తనపగ తీర్చుకొనుటయును నిశ్చయించినట్లు కుమారదేవుఁ డెన్నోమారులు నాతోఁ జెప్పుచు వచ్చెను. నాయందుఁగూడ మీకు నమ్మకము లేనియెడల నే నింకఁ జెప్పజాలను."

"అయ్యో! దేవదేవా! నీయందు నాకు నమ్మకములేనియెడల నాయందు నాకు నమ్మకము లేనట్టులే కదా?"

"ఔనుగదా! మఱి సందేహ మెందుకు? ఇచ్చటిప్రయత్నము లన్నియుఁ జూచుచు మీరుండుఁడు. నేను వానిని వెంట నిడుకొని బయలుదేరెదను. మీరు సెలవిచ్చిన రీతిగా నొకప్పుడాతఁ డట్టిదుష్ప్రయత్నములో నున్నట్లు నాకనుమానము తోఁచిన యెడల వాని నప్పుడే నాకరవాలమున కెరవేసి—"

"వద్దు వద్దు. నీకట్టియనుమానము తోఁచినప్పుడు వెంటనే వానికరచరణములు బంధించి, ఖైదీగాఁ బట్టుకొని, ప్రాణములతోడనే యిచ్చటకుఁ దీసికొనిరమ్ము. ఆపని నేనే చేసెదను. కాని యంతవఱకు రాఁగూడదు."

"ఎన్నఁడును రాదు. మీరే పట్టియపోహ మొందుచున్నారు. అందుచే నే నిట్లు చెప్ప వలసివచ్చినది. మహారాజా! మేము వెంటనే బయలుదేరకున్నయెడఁ దెల్లవాఱునరికి గమ్యస్థానముఁ జేరుకొనలేము."

"ఔను. నీవు వెంటనేపోయి భోజనము చేసి ప్రయాణసన్నాహములో నుండుము. మీరెట్టులైన నాదుర్మార్గుని బట్టితెచ్చిన యెడల—"

"దేవా! తమరేమియు నింక సెలవీయవలదు. రేపుసాయంకాలమునకు రాఁజాలము గాని యెల్లుండి యుదయమగుసరికి—ఆపాతకుని మీపాదములకడఁ బడవేయకున్న నన్ను మీరు దేవదేవుఁడని పిలువవలదు. నన్నింకఁ బురుషులలో గణింపవలదు."

"దేవదేవా! ఆమాట చాలును. నాకు సంతోష మైనది."

అని ఋషికుమారునిఁ జూచి,

"ఓరీ! నీమాట యేమి? మఱల నీవొక్కఁడవే యొంటరిగాఁ బోవుట కష్టము. అందుచే వీరితోడనే కలిసిపొమ్ము."

"చిత్తము. దేవా! చిత్తము. ఆచార్యులవారి సెలవుఁగూడ నట్టులే యైనది. నే నిచ్చట నొక్కక్షణమైన నుండరాదు."

"సరే! దేవదేవుఁడు నీభోజనమును గూర్చి యేర్పాటు చేయఁగలఁడు. వానితోఁ బొమ్ము. ఆచార్యులవారికి వ్రాయవలసిన ప్రత్యుత్తరము నొకయరగంటలో వ్రాసిపంపించెదను."

"చిత్తము."

## 27-వ ప్రకరణము

### తప్పించుకొనెను

"ధన్నా! ఇదిగో చూడు! ఈపరివార మంతయు నాదియే! వీరందఱిని నేనే పోషించుచున్నాను. మాతండ్రి తాతలయాధిపత్యము క్రిందఁ బనిచేసిన వారిందులో ననేకు లున్నారు. వీరందఱు ననేక యుద్ధములలో నారితేరిన వీరాగ్రేసరులు. వెలనాఁటి రాజ్యలక్ష్మి గణపతిదేవుని వరించినది మొదలు వీరును మా కుటుంబమువలెనే యజ్ఞాతవాస మొనరించుచున్నారు. రాజద్రోహశంకచే నుద్యోగమీయకున్నను దేవి నాకు వలసినంత ధన మొసంగుటచే వీరందఱిని బ్రోవు చేసికొని రాష్ట్రాభిమానచిత్తులగు వీరిసాహాయ్యమున నే నింతవఱకుఁ బటుకుడుట శవకాశము కలిగినవాఁడ నైతిని. ఇనుపదండములతో శత్రువులఁ జావమోది యానాఁ డేకవీరాలయమున రుద్రాంబను రక్షించిన వీరపురుషులు వీరే. ఆ దేవిప్రోత్సాహమును వీరిసాహాయ్యమును గలుగునంతవఱకు, నీ యాంధ్రదేశమునందే కాక, హిందూదేశమునం దెచ్చటను నాకసాధ్యమగు కోట లేదని, దృఢముగాఁ జెప్పఁగలను. ధన్నా! యుద్ధానంతరము వఱకు నాకీ యజ్ఞాతవాసము తప్పదని దేవియాజ్ఞ యైనది......"

అని యనేకవిధములఁ బ్రసంగించుచుఁ, దనకిష్టసుఖము లెఱింగించుచు నానాఁడు త్రిపురాంతకదేవుఁడు ధన్నని తన గృహాంతర్భాగమునకుఁ దీసికొనిపోయి యచ్చటఁ జూపవలసిన విచిత్రములను వానికిఁ జూపించెను. ఆయాశ్రమమునందలి మనయాంధ్రవీరకుమారుల ధైర్యసాహసములును, పౌరుషపరాక్రమములును, త్రిపురాంతకునిరాజభక్తియు, దేశసేవాభిలాషయును మొదలగుసంగతులు కనిపెట్టి ధన్నుఁ డవిచ్ఛిన్నానందభరితుఁడై యాశ్చర్యనిమగ్నుఁడయ్యెను. ధన్ను డెఱింగించు క్రొత్తసంగతులు త్రిపు

రాంతకుఁడును, ద్రిపురాంతకుఁ డెఱింగించు క్రొత్తసంగతులు ఛన్నుఁడును నాలకించుచు భవిష్యత్కార్యక్రమమును గూర్చి వా రుభయులు నతిదీర్ఘముగ నాలోచించి, కార్యతత్పరుఁడై యుండినరంగని రప్పించి, వానికిఁ గూడఁ దత్క్రియ నెఱింగించిరి.

ఛన్నుఁ డందుఁ బ్రవేశించినది మొదలు తదాశ్రమసముద్రము వీరభటపుంగవోత్తుంగతరంగసంఘములచే మిక్కిలి యల్లకల్లోలమై మల్లోకములు ముంచునో యను భయము గల్గఁజొచ్చెను. కత్తులు సానపట్టువారును గటారులు గీటువారును, బాకులు నీటెలుఁ బరిశులు మున్నగు రణోపకరణముల సవరించువారు నై యందలివీరభటు లనేకవిధముల యుద్ధప్రయత్నము లొనరించుచుఁ బ్రతిక్షణము నూపిరి సూడకుండఁ బని సేయుచుండిరి. ఒకవంక ఛన్నుఁడు, మఱియొకవంక రంగఁడు, వేఱొకవంక త్రిపురాంతకుఁడును దమతమకార్యములయం దప్రమత్తులై చేయుచుఁ జేయించుచు కడుఁ జతురతతో వర్తించుచుండిరి.

నాఁటిసాయంకాలమునఱకే కాక, రాత్రియంతయుఁ గూడ నయ్యాశ్రమమందలిపరివార మంతయు నెడతెరిపి లేకుండఁ బ్రవర్తించుచుండెను. ఆశ్రమమునకుఁ జిట్టచివర నున్నయశ్వశాలకడఁ గొందఱును, ఆయుధాగారమునఁ గొందఱును జేరి యతిదీక్షతోఁ బని సేయుచుండుటచే వాండఱి భాగమునందలిగదులును, జావడులును, జీడీలును, గేవలమును జనశూన్యములై దీపములు సైతము లేక గాఢాంధకారముతో నిశ్శబ్దముగా నుండెను. ఒకరిద్దఱు సేవకులు ద్వారరక్షకులుగా నియమింపఁబడిరి. కాని దాదాపుగ రెండుజాములరాత్రి యైనంతనే వారుఁ గూడ ముంచుకొని వచ్చుచున్నతమ నిద్దుర నాపుకొనలేక వీథిచావడిలో నొకఁడును దాపికి నున్నపీఁటపై నొకఁడును శరీరములు చేరవైచి నిద్రించుచుండిరి. చీకటి దట్టముగ వ్యాపించియుండుటచేత వారియునికిని బరుండినస్థలములను గుర్తించుట యసాధ్యమే యైనను, గాఢనిద్రాపరవశులై యుండుటచే వారినుండి వెడలుచుండిన గుఱ్ఱుధ్వనివలన రవంత కనిపెట్టుట కవకాశము కలుగుచున్నది.

పైనివివరించినట్లు తద్గృహాభాగ మంతయు నిశ్శబ్దముగ నుండ నాప్రాంతమందలి యొకగదియందుమాత్రము కొంతసేపున కొకవిధమైనశబ్ద ముదయించెను. అంతకంత కాశబ్ద మధిక మగుచు, నాయాసముచే నెవరో నిట్టూర్పులు విడుచుచుండినట్టు లొకమారును, నేదే నొకవస్తువు నెలుకలు పటపట కొఱికి వేయుచుండినట్టు లొకమారును, బలవంతముగఁ ద్రొక్కి త్రెంపఁబడుచుండినట్టు "టుప్పుటుప్పు" మని యొకమారును, బలువిధములుగా వినవచ్చుచుండెను. పరివార మంతయుఁ గార్యాంతరమున నిమగ్నమై

యుండుటచేత నది కనిపెట్టినవా రెవ్వరు నచ్చట లేరు. అయినను, గొంతసేపైనతరువాత ననుమానమున కైన తేకుండ నాచప్పుడు పూర్తిగా మాయమయ్యెను. అట్టిశబ్దమేమియుం మఱల నాగదిలో నుండి వెలువడలేదు. కాని, యాచప్పుడు చల్లారిన కొన్ని నిముసములకు మాత్ర మాగదిలోనుండి యొకమనుష్యవిగ్రహము మెల్లఁగా బయలుదేరి, తడుముకొనుచు నాకటికిచీకటిలో నెచ్చటికో పోవుచుండెను. చీమచిటుక్కు మన్నచోఁ ద్రుళ్లిపడుచు, ద్వారరక్షకుల గుఱ్ఱుధ్వనుల కులికిపడుచు, మాటిమాటికిఁ బెరటి వైపు తొంగితొంగి చూచుచు, నొక్కొక్కప్పుడు నేలఁ దిరుగఁబడుచు మఱల లేచుచు, నాపురుషుఁడు పోవుచుండ నాకస్మికముగ వానిపాదముల కొకగదిగుమ్మము తటాలునఁ దగిలినందునఁ బాప మతఁడు తూలి యాగుమ్మమునందు దబ్బునఁ బడిపోయెను. అట్టు తిరుగఁబడుటయే కాక, యదివఱకే యాగదిగుమ్మములో నెవరో పరుండియుండుటచేత నాపురుషుఁడు పాపము వానిపైఁ జతికిలఁబడ, నిద్రనుండి యతఁడు తటాలునఁ ద్రుళ్లిపడి భయభ్రాంతుఁడై "అఁ—అఁ—ఎవరది? ఎవరది? ఎందుకొఱకు? ఎందుకొఱకు? నన్నుఁ జంపుటకా? నన్నే? నన్నే? అయ్యో! అయ్యో!" అని యాకస్మిక నిద్రాభంగము వలనఁ గలిగిన భయముచేతనో లేక, యంతవఱకు నిద్రలోఁ గాంచుచుండిన దుస్స్వప్నము చేతనో వెఱ్ఱివానివలెఁ గేకలు వేయసాగెను. తోడనే యాతఁ డొక ద్వారరక్షకుఁ డని నిశ్చయించుకొని, వాని మేలుకొనుటవలనఁ దనముందు ప్రయత్నమునకు భంగము వచ్చునని యూహించి యాపురుషుఁడు తటాలున వానిపైఁ గూర్చుండి యఱవకుండ దౌడలు దగ్గఱగా నొక్కి చేతిలోనున్న బాకుతో గుండెలపై గట్టిగా నాలుగైదుపోట్లు పొడిచి యాదిక్కుమాలినవానిని శాశ్వతనిద్రానిమగ్నునిగా నొనర్చి వెంటనే యచ్చటినుండి లేచిపోయెను.

లేచుటయె తడవుగ నతఁడు పూర్వముకన్న నత్యాతురతతో నిటు నటుఁ దిరుగుచుఁ, జేతులతోఁ దడవుకొనుచుఁ బాదములు నేల రాయుచు నడచినడచి కొంతసేపునకత్యంతకష్టముతోఁ దనగమ్యస్థానమగు పీఠిగుమ్మమును జేరుకొనెను. అప్పుడు వాని యాతురతయుం నాందోళనమును ద్విగుణములైనవి. ఆపీఠిచావడిలో నొకద్వారరక్షకుఁడు నిద్రించుచుండినట్టు గుఱ్ఱుచప్పుడువలన నాతఁడు చప్పునఁ బోల్చి చీమకాలంతైనఁ జప్పుడుకాకుండఁ బిల్లివలెఁ గడు నెమ్మదిగ నడుగు లిడుచు వానిపైనుండి మెల్లఁగా దాఁటి గడియలు తీసి పీఠితలుపు తెఱచినయెడల ధ్వని యగునేమో యని సంశయించుచుఁ గొంతవఱ కట్టులే నిలిచిపోయెను. అట్టు తలుపునంటి నిలిచి ప్రేక్షతో నద్దుగడియలను గొంచెము గొంచెముగ దిగలాగుచుఁ, గడుఁ జాకచక్యముతో నెట్టకేల కవాటమును

జెఱచి "బ్రదుకుజీవుఁడా" యని యావలఁబడి, యొక్కనిట్టూర్పు విడిచి, గుమ్మము దాఁటుటయె తడవుగఁ దనపిక్కబలిమి చూప నారంభించెను.

---

## 28-వ ప్రకరణము

### జైనాశ్రమవిధ్వంసము

అట్లు నాఁటిరాత్రియంతయు సమరసన్నాహ మొనర్చి చేయవలసిన యేర్పాటు లన్నియుఁ జేసి, చేయఁగా మిగిలిన యొకటి రెండు కార్యములను గొందఱు సేవకులకు నియోగించి యత్యంతసంరంభముతోఁ ద్రిపురాంతకదేవుఁ డావేకువజామున నే తన ప్రాణప్రియులగు ధన్నుని రంగని వెంట నిడుకొని వీరభటసమేతుఁడై జైనాశ్రమముపై దండెత్తెను. ప్రభువు నియోగించిన కార్యములను నెఱవేర్చుటకును నిత్యకృత్యమునకై వినియోగించు సామగ్రులను వెనుకనుండి పట్టించుకొని వచ్చుటకును నాఁటి వేకువయం దిరువదిమంది సేవకులు మాత్ర మచ్చటనుండి పోయిరి. తక్కిన వీరభటులందఱు నాయుధపాణులై హయారూఢులై తనవెంట నరుదేరఁ ద్రిపురాంతకుఁ డత్యంతవేగమునఁ బ్రయాణముచేసి, మార్గమధ్యమున రెండు మూఁడు మజిలీలు మాత్ర మొనరించి, నాలుగవనాఁ డుదయముననే జైనాశ్రమమును ముట్టడించెను.

ముట్టడించుటయె తడవుగ నావీరభటు లాపురాతనదేవాలయమును నినుపదండములతోడను గునపములతోడను బారలతోడను గభిల్లుగభిల్లున మోది పదినిముసములలోనే నేలమట్టముతోఁ గలిపివేసిరి. పిమ్మట నచ్చటనున్న హనుమద్విగ్రహమును దీసి వేయించి త్రిపురాంతకుఁ డాసొరంగముచుట్టును ద్రవ్వింప నారంభించెను. ఆసొరంగమును నాసోపానపంక్తులనుజూచి ధన్నుఁడు రంగఁడు మొదలగువారందఱు నత్యాశ్చర్యమును వహించి పద్మవ్యూహమువలె దుర్గ్రాహ్యమును దుర్గమమునై యున్నయాజైనుని మర్మగృహమును గనిపెట్టఁగలిగిన త్రిపురాంతకుని ధీవిశేషమును వేనోళ్లఁ గొనియాడసాగిరి. ఇరువదిగజముల మేర నాసొరంగముచుట్టును ద్రవ్వనారంభించినంతనే లోపలినుండి యొకవిధమైన పెద్దకోలాహల మచ్చటివారి కందఱకిని వినరాఁదొడంగెను. పెద్దపెద్దభూమిపెల్లలుఁ బాషాణములు లోనఁ దిరుగఁబడునట్లు లాప్రదేశమును గొంతవఱకుఁ ద్రవ్వినంతనే లోపలిచావడులును జీడీలును జైనులుం దమకంటఁబడుచున్నందున నావీరభటు లెల్లరు మఱింత ప్రోత్సాహమును వహించి యతిసూక్ష్మకాలములోనే యాప్రదేశమంతయుం గుల్లచేసి యత్యంతపరిశ్రమముతోఁ గట్టఁబడిన యాజైనాశ్రమము నొక పెద్ద యగాధమగు గోతివలెఁ గావించిరి.

నాఁటియుదయమున నయ్యాశ్రమాంతర్భాగమునఁ గల జైనుల దురవస్థ మిక్కిలి విచారకరమైనది. మొదట నాలయములో జనసంచారము విశేషముగఁ గలిగినట్లు తమ కనుమానము గలిగినప్పుడే యేదో యుపద్రవము సంభవింపనున్నదని వారందఱు నిశ్చయించుకొనిరి. ఆలయప్రాంతమునుండి యెవరో బాటసారులు నడచిపోవుటచేత మనకిట్టి యనుమానము కలుగుచున్నదని మఱికొందఱు భ్రాంతిపడిరి కాని కొలది నిముసములలోనే గుభిల్లుగుభిల్లు మని యాలయము కూలిపోవుచు వారితప్పుతలంపు తొలగించెను. ఆ మహోపద్రవమును జూచి జైనస్వామి నిశ్చేష్టితుఁడై నోటమాటలేక యొడలెల్ల గడగడ వడక యున్మాదమెత్తినవానివలె నార్తికేకలతో నేమియుం దోచక యిటునటుఁ దిరుగ సాగెను. అట్లు కొంతవఱకుఁ దిరిగి తన జైనభటుల నెల్లర నత్యాతురతతో రణసన్నాహముల నొనర్చి సోపానములనుండి పై కెగఁబ్రాకు శత్రువుల నెదిరించు నట్లు కఠినముగ నాజ్ఞాపించెను. వాని యాజ్ఞానుసారముగ వివిధాయుధముల ధరించి లోనున్న జైనవీరు లెల్లరుఁ బైకి విజృంభింప నెంచిరి కాని పైనుండి పడుచుండిన పాషాణములును భూమి పెల్లలును వారి ప్రయత్నములను నిష్ఫలము లొనరించెను. అంతకంత కా యుపద్రవ మధిక మగుటయే కాక పైభాగమంతయుఁ బూర్తిగఁ ద్రవ్వఁబడినందునఁ జెఱు వింకిన చేఁపలవలె నొకచో దాఁగియుండుటకైన నవకాశము లేక, వడగండ్లవానగతి శత్రువులు వర్షించు బాణవర్షములను రాలవర్షములను సహించి యా జైననికేతనమంతయుఁ గ్రమక్రమముగా నేలపాలు కాఁజొచ్చెను. బహుకాలమునుండి యా జైనస్వామి తనభృత్యులకు నేర్పించిన శస్త్రాస్త్రవిద్యాకౌశలమంతయు నానాఁడేక ఉల్లిగడ్డకైనఁ బనికిరాకపోవుట యేకాక, యాంధ్రదేశమునుగూర్చియుఁ గాకతీయసామ్రాజ్యమునుగూర్చియు నాతఁడు చేసిన యేర్పాటులును పన్నినపన్నుగడలును, యోజించిన కుతంత్రములును, వహించిన పేరాసలును, దేర్చినవ్యూహములును, నాఁటియుదయముతోఁ దుదముట్టిన వని నిశ్చయించుకొని, పాపమాతఁ డూరక గుండెలు బాదుకొని యేడువసాగెను. ఆకూపములోఁ బారిపోవుటకైన వీలులేనందున నింక శత్రువులకుఁ బాదాక్రాంతు లగుటయే కర్తవ్యమని హతశేషులు నిశ్చయించుకొనిరి. అందుకు జైనస్వామిమాత్ర మంగీకరింపక ప్రాణమున్నంత వఱకుఁ బోరాడక తీరదని తనభృత్యులకుఁ గఠినముగ నాజ్ఞాపించెను. కాని వానియాజ్ఞ శిరసావహించువా రెవ్వరు నచ్చట లేరైరి. తమప్రాణములకు భంగముగలుగువేళ భృత్యులు ప్రభులత్యమును బాటింపరుకదా? శత్రువులు తన్నుబట్టి రుద్రాంబ కప్పగింపక మానరనియుఁ నామె వెంటనే చిత్రవధచేయింపక మానదనియు జైనస్వామి నిశ్చయించుకొని తనకింక బలవన్మరణక్లేశము తప్పదని రూఢిపఱచి, దేవిచే బలవంతముగ నురిదీయింపఁ బడుటకన్న వీరమరణమే యుక్తమైనదని వెంటనే తానుఁగూడ ఖడ్గపాణియై బయలు

దేరెను. శత్రుసేనపైఁ బడి కదకొక్కనినైనను దనచేతులతో ఖండించి, తాను ఖండింపఁ బడవలయు నని జైనాచార్యుఁడు విజృంభించెను గాని, ప్రాణభీతిచే వాని యనుచరు లెవ్వరును వానికిఁ దగిన రీతిని దోడ్పడలేదు వారెల్లరును దమతమయాయుధముల దిగ విడిచి, తమ ప్రాణములను శత్రువుల యాధీనమొనరించి, చిత్రప్రతిమలగతి నట్టులే నిలిచి పోయిరి.

సర్వవిధములఁ దనకు లోఁబడిన యనాథులగు నాజైనులను నిష్కారణముగ వధించుట వీరపురుషలక్షణము కా దని యెంచి, త్రిపురాంతకుఁడు వెంటనే యుద్ధ మాపు చేయించి, వారందఱిని ఖైదీలుగాఁ బట్టుకొనవలసినదని తనవీరభటుల కాజ్ఞాపించెను. జైనస్వామిని బ్రాణములతోఁ బట్టి దేవి కప్పగించుటకన్న వాని కింకొక యుద్దేశము లేదు కదా! బహుకాలమునుండి రణవిద్యాపరిశ్రమ మొనరించుచుండిన యాజైనభటు లెల్లరు ఘోరసంగ్రామ మొనరించినఁ గాని తనకు వశులుగారని త్రిపురాంతకుఁడు మొదట భ్రాంతిపడెను గాని, వారందఱు నింతటి పిరికిపంద లని యెన్నఁడు ననుకొనలేదు. తనయాజ్ఞప్రకారము నాయుధముల విడిచి సైనికు లెల్లరు నంతోషాతిశయమున సింహనాదము లొనరించుచుండఁ ద్రిపురాంతకుఁ డచ్చటఁ దాను స్వయముగాఁ జేయవలసిన కార్యభార మేమియు లేకపోవుటచేతను, అంతకన్న నత్యవసరముగ ధన్నునితో మాటాడవలసిన పనియుండుటచేతను, వెంటనే రంగని బిలిచి శత్రువులను గూర్చిన కార్యక్రమమంతయు వాని కప్పగించి తాను ధన్నునితోఁ గూడ దూరముగాఁ బోయి యొక మామిడి చెట్టుక్రిందఁగూర్చుండి యతిరహస్యముగ నేమేమో మాటాడ నారంభించెను. చల్లని యాఁసాలతరుచ్ఛాయ నధివసించి, ధన్నుఁడును ద్రిపురాంతకుఁడును జాల సేపువఱకు నచ్చటనే యత్యంతరహస్యప్రసంగమును గావించుకొనిరి. ఇంతలో నత్యాకస్మికముగ నొకదుర్వార్త వానిచెవిని బడినందున నాదీర్ఘసంభాషణమునకు భంగము కలుగవలసివచ్చెను. గూఢప్రసంగనిమగ్నుఁ డైయుండిన త్రిపురాంతకుఁడు——

“దేవా! త్వరపడవలయును! సిద్ధపడవలయును! క్రొత్తశత్రువులు వచ్చుచున్నారు. క్రొత్తశత్రువులు వచ్చుచున్నారు!” అను పెద్దకేకలును, గోలాహలమును నొక్కమాఱుగఁ దనకు వినవచ్చుటచేతఁ దటాలునఁ ద్రుళ్లిపడి లేచి “ధన్నా! లెమ్ము లెమ్ము.” అని నలువంకలఁ బరికింపసాగెను.



## 29.వ ప్రకరణము

### అన్యోన్యసందర్శనము

హయారూఢులు నాయుధపాణులగు నూర్వురువీరభటులు వెంట నరుదేర నమిత తేజశ్శాలురగు నిరువురురాజకుమారులు కడు జవమున నాయాశ్రమము వంకకు వచ్చుచుండుట త్రిపురాంతకుఁడు కనిపెట్టి, "ధన్నా! శత్రువులు! శత్రువులు!!" అని పలుకుచుఁ దనపరివారముచెంతకుఁ బరుఁగిడ సాగెను. కొంతసేపువఱకు ధన్నుఁడు నిర్ఘాంతపడి యరావచ్చుచుండిన క్రొత్తసైన్యమును జూచి చూచి, యెందుచేతనోయూరక పకపక నవ్వుచుఁ దనపరివారముతోఁ గూడ నూరక తత్తరపడుచుండిన త్రిపురాంతకుని గలిసికొని యిట్లనియెను.

"రాజకుమారా! ఈయార్భాటమంతయు నెందుకొఱకు? అవచ్చుచున్నవారు మన శత్రువులు కారు. ప్రాణమిత్రులు! ప్రాణబంధువులు!"

"ధన్నా! నిజమేనా? వారెవరు? మనశత్రువులు కారా?"

"కారుకారు దేవా! ముందు వచ్చుచుండిన నావీరపురుషు లిరువురిలో నొకఁడు దేవదేవుఁడు. మఱియొకఁడు మీబావమఱఁదియైన కుమారదేవుఁడు."

అని చెప్పఁ గుమారదేవుఁ డను పేరు వినుటయొకడవుగ నా త్రిపురాంతకుఁడు మితిమీరినసంతోషాతిశయమునఁ గెవ్వున నొకకేక వేసి, "ధన్నా! కుమారదేవుఁడా! నిజముగాఁ గుమారదేవుఁడేనా? ఆహా! నేనెంతటియదృష్టవంతుఁడను? ఈదినము మన కెంతగొప్పసుదినము" అని పలుకుచు నావీరపుంగవుఁ డానందబాష్పసలిలధారల మజ్జనమాడుచుండెను. ఇంతలో నానూతనపరివార మంతయు వారల సమీపించినది. సమీపించుటయె తడవుగ "త్రిపురాంతకదేవుఁ డెచ్చట? త్రిపురాంతకదేవుఁ డెచ్చట?" యని యడుగుచు నాయిరువురు వీరపురుషులలో నొకఁడు తటాలున గుఱ్ఱముదిగి వచ్చి యత్యాతురతతోఁ ద్రిపురాంతకుని బిగ్గఱగఁ గౌఁగిలించుకొని, "బావా! నిన్ను బట్టుకొనవలసినదని మాపాండ్యరాజు నన్నును మాదేవదేవుని బంపించినాఁడు." అని నవ్వుచుఁ బరిహాసమాడఁ ద్రిపురాంతకుఁడును బ్రేమాతిశయమున నాతనిఁ గౌఁగిట నిడి "రాజకుమారా! రాజకుటుంబమునకు సంబంధించిన నీయట్టివీరాగ్రేసరునిచే నింతగా గౌరవింపఁబడుటకుఁ దగిన స్థితిగతులు గలవాఁడను గాను. నన్ను నీభృత్యునివలెనే పరిగణింపవలయును గాని, బావా యని సంబోధింపరాదు. కుమారదేవా! నీయట్టికుమారమిత్రుని గోలుపోయినందుకు జేవి పడుచుండిన సంతాపమునకు మేర లేదు. నీకొఱ

కెందఱ యెన్నివిధములఁ బ్రయత్నించిరియో వర్ణింపఁజాలను. దేవదేవానుగ్రహమున మృత్యుంజయునివలె మృత్యుముఖమును దప్పించుకొని నీవు సురక్షితుఁడవై మఱలఁ గాటఁబడుట రుద్రాంబయదృష్టవిశేషము! మాపుణ్యవిశేషము! ఆంధ్రదేశపు భాగ్యవిశేషము!” అని పలుకుటయుఁ గుమారదేవుఁడు చిఱునవ్వు నవ్వుచు,

“బావా! నిశ్చయముగ నేను మృత్యుముఖమునుండి తప్పించుకొనఁగల్గుటకు దేవదేవానుగ్రహమే కారణము. ఆదేవదేవుఁడు నాకుఁ బ్రాణప్రియుఁడు. నాకుఁ బ్రాణబంధువు. ఆతఁ డొనరించిన మహోపకారమునకు దగిన ప్రత్యుపకార మొనరింపలేక నాప్రాణములను, నాహృదయమును నాశరీరార్ధమును వానియధీన మొనరించితిని. అందుచే నేనే యతఁడు. అతఁడే నేను. రాజబంధువుఁడ నైన నేమి? ఐశ్వర్యసంపన్నుఁడ నైన నేమి? ఈసన్మార్గమును జేతకాని యప్రయోజకుఁడ నై నిష్కారణముగ శత్రువులకుఁ జిక్కి మీయందఱికి నిన్నిన్ని కష్టములు కలిగించిన నిర్భాగ్యుఁడనగు నేను; వీరాగ్రేసరుఁడవై, నీపేరు వినినంతమాత్రమున శత్రువుల నెల్ల గడగడలాడించుచు నాఁటినుండియు నేకదీక్షతో నాంధ్రరాష్ట్రమును గూర్చియుఁ గాకతీయ సామ్రాజ్యమును గూర్చియుఁ విపరీతముగాఁ బాటుపడుచుండిన నీయెదుట నిలుచుటకు సిగ్గుపడుచున్నాను.”

అని యింక నేమేమో చెప్పుచుండ నాకస్మికముగ “సిగ్గెందుకు? కుమారదేవా! నీకింతసిగ్గున్నదని నే నిదివఱకు కనుఁగొనలేదు సుమా! మాఱువేషమునఁ బురుషులమని చెప్పుకొను వారికేఁ దప్పుఁ బుట్టువుచేఁ బురుషు లగువారికి సిగ్గు గలుగరాదు.” అను మాటలు వారికి వినవచ్చినందున నిటునటుఁ జూచుచుండ దేవదేవుఁడు వారియెదుటఁ బ్రత్యక్షమయ్యెను. అట్లు ప్రత్యక్షమై త్రిపురాంతకునిపాదములకు నమస్కరించి ముకుళితకరకములుఁడై “దేవా! ఆనాఁ డుత్తరముఖమున క్షమింపఁగోరితిని. నేఁడు స్వముఖమునఁ బ్రార్థించుచున్నాను. నేను జేసినయపరాధమును మన్నించి నన్నాదరింపవలయును.” అని వినయముగాఁ బలికెను. కాని దేవదేవునియందలి స్వరూపరేఖావిశేషముల కత్యాశ్చర్య మొందుచు నిర్ఘాంతపడి చూచుచుండిన త్రిపురాంతకుఁడు వానిమాటల కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. ఈలోపునఁ గుమారదేవుఁడు దేవదేవునిఁ జూచి, “దేవదేవా! ఆసైనికులనుగూర్చి నేను జెప్పినట్టులే యేర్పాటు చేసితివా?” అని యడిగెను. అందు కతఁడు శిర మూపుచు “అట్టులే యేర్పాటుచేసితిని. ఆమూర్వురు సిపాయిలు నీప్రాంతమునకు రాకుండ నచ్చటనే గుడారములు వేసికొని యుండవలయునని కఠినముగ నాజ్ఞాపించియే వచ్చితిని. ఆవిషయమును గూర్చి మఱిసందేహింపఁ బనిలేదు.” అని ప్రత్యుత్తర మిచ్చెను.

అట్లు త్రిపురాంతకదేవుఁడు దేవదేవునియందుఁ గలనిజరూపరేఖావిలాసములఁ గొంతవఱకుఁ జూచి చూచి యొక్క నిట్టూర్పు విడిచి, వానితో నిట్లు ప్రసంగింపఁ దొడంగెను.

"దేవదేవా! చేసిన యపరాధమును మన్నింపు మని నన్ను గోరుచున్నావు. ఒకరిని క్షమించుటకుఁ దగినంతటి స్థితిగతులు సర్వేశ్వరుఁడు నాకొసంగలేదు గాని, యది యట్లుంచి ముం దీమాట చెప్పుము. ఓలంత నీకాపుర మెచ్చట? నీతల్లిదండ్రు లెవరు? నీవు రుద్రాంబకొలువులోఁ బ్రవేశించి యెంతకాల మైనది?"

"దేవా! ఆప్రశ్న లన్నియుం నిప్పు డేందుకు? మనవంటిదీనులకుఁ దల్లియును దండ్రియును సర్వేశ్వరుఁడే! మన మొందిన కష్టములును సుఖములును మనపూర్వప్రసంగములును హాయిగా ముచ్చటించుకొనుదినము ముందున్నది. అట్టి వినోదప్రసంగమున కిది యదనుగాదు. మన మిప్పుడు చేయవలసినకార్యములు పెక్కులున్నవి. వెనుక నుండి శత్రుపరంపరలు తఱుముకొని వచ్చుచున్నవి. లేక, యీపరికే యేకశిలానగరమును ముట్టడించెనో తెలియదు........"

అని యింక నేమేమో చెప్పఁబోవుచుండఁ గుమారదేవుఁడు వాని కడ్డముగా వచ్చి యిట్లనియె.

"త్రిపురాంతకా అన్నిటికన్న ముఖ్యముగ మన మీయంత్రరక్షణమునకాదే చేయవలసిన కార్యము ధన్నుని దేవియొద్దకుఁ బంపించి కొంతసైన్యమును దెప్పించుటయే! అట్లు చేసినఁ గాని మనవలన నేమియుఁ గానేరదు."

"కుమారదేవా! ఈయాలోచనము నాకిదివఱకే జనించినది కాని, నన్ను విశ్వసించి, దేవి సైన్యసాహాయ్య మొసంగునో లేదో యని సంశయించి యూరకొంటిని. దైవానుగ్రహమువలన నిప్పుడు నీవు వచ్చితివి కాఁబట్టి యింక భయము లేదు. వెంటనే ధన్నుని బంపి కొంతబలమును దెప్పింపుము."

"బాగున్నది కాని, ప్రస్తుతము మన కెంతసైన్య మవసర మని నీయభిప్రాయము?"

"అధమపక్షము నాలుగైదువేలసైన్య మైన నుండనియెడల నఖండముగ వచ్చు శత్రుసేనాప్రవాహమును వారింపఁ గల్గుట కష్టము."

"బావా! నీవు చెప్పినది నిజమే? మనమాండలికశత్రువులమాట కేమి గాని, యాదవసైన్యములసంఖ్య రమారమి డెబ్బదివేలకుఁ దక్కువయుండదు."

అని పలికి కుమారదేవుఁడు ఛన్నునిఁ జేరఁజీరి "ఛన్నా! నీవు దేవి కాప్తవర్గము లోనివాఁడవు. అందుచే నీకార్యభారమును నీవే భరింపవలయును. సత్వరముగ నేకశిలా నగరమున కేఁగి, రుద్రాంబను సందర్శించి, యచ్చటిసంగతు లన్నియుఁ సంక్షేపముగా దెలియించి, సైన్యములకొఱకు మేమందఱము నిరీక్షించుచున్నార మని యామెతో విన్నవించి, చతురంగబలసమేతుఁడవై యొకటిరెండుదినములలో నీ విచ్చటఁ జేరుకొనవలసియున్నది." అని యింక నేమోమో చెప్ప యత్నించి, త్రిపురాంతకుని జూచుచు నెందుచేతనో సంశయించి యూరకుండెను. అది కనిపెట్టి దేవదేవుఁడు వెంటనే ఛన్నునిఁ జూచి "ఛన్నా! స్వవిషయమును గూర్చి నేనుఁ గూడఁ గొన్నిసంగతులు దేవికి మనవి చేసికొనవలసి యున్నవి. నీవు కొంచెము దూరము నాతో వచ్చినయెడల నారహస్యములు మనవి చేసికొనెదను." అని పలికి తోడనే ఛన్నునితోఁ గూడ నాప్రదేశము విడిచి దూరముగాఁ బోయెను.

---

## 30-వ ప్రకరణము

### ప్రథమసందర్శనము

మాండలికప్రభువుల కలుక పుట్టించి, దేవగిరియాదవుల కాస కల్పించి, దేశమునం దెల్లకడల నీయల్లరులు కలిగించుచుండిన దుష్టుఁడగు జైనస్వామి, తనపరివారముతోఁ గూడఁ బట్టువడె ననుసంగతి వినినప్పుడు దేవదేవకుమారదేవులకుఁ గల్గిన బ్రహ్మానంద మెంతని వర్ణింపఁగలము? త్రిపురాంతకుని యద్భుతసాహసవర్తనములును, వానిచాకచక్యమును వేనోళ్లఁ గొనియాడి, "త్రిపురాంతకా! ఇన్నిమహోపకారము లొనరించిన నీఋణము దేవి తీర్చుకొనలేదు సుమా" యని మామిత్రు లిరువురును వానిని బహూకరింపఁ జొచ్చిరి. దేవదేవకుమారదేవులసెలవుపైని త్రిపురాంతకుఁడు తనపరివారములోఁ గొంతభాగమును సహాయముగా నిచ్చి యాజైనస్వామ్యాదులను ఛన్నునివెంటనే యేకశిలా నగరకారాగారమునకుఁ బంపివేసెను!

ఆనాఁటియుదయమున నాయాంధ్రరకుమారపరివార మంతయుఁ నానందార్ణవమున నోలలాడుచు, గుడారముల నెలకొల్పుకొని మజ్జనభోజనాదు లొనరించి హాయిగాఁ గాలము గడుపుచుండెను. దేవదేవకుమారదేవు లుభయులు నొకగుడారమునందే విడిసిరి. త్రిపురాంతకుఁడు తనపరివారముతో వేఱొకపటకుటీరమున నివసించెను. సాయంకాలము నాలుగుగంటలవఱకుఁ బ్రయాణాయాసోపశమనమునకై విశ్రమించి, తరువాత దేవదేవకుమారదేవు లిరువురును దమగుడారమున నుచితాసనాసీనులై యుండి త్రిపురాంతకుని

రప్పించి వానితోఁ గార్యక్రమమును గూర్చి ముచ్చటింప సాగిరి. కుమారదేవుని ప్రక్కనే దేవదేవుఁడును, వారియెదుటఁ ద్రిపురాంతకుఁడును, వెంటనే రంగఁడును సుఖాసీను లైరి. ఆగుడారములో సగముభాగమువఱకు నడ్డముగా నొకతెర కట్టఁబడియుండుటచేత నందెవ్వరో ఘోషాస్త్రీ లుండవచ్చునని రంగఁడును ద్రిపురాంతకుఁడును భావించుకొనిరి. కాని కుమారదేవుఁ డవివాహితుఁ డగుటచే దేవదేవునకు సంబంధించినవా రెవరైన నందుండి యుందురని భావించి, సకలవిధముల శరీరమాత్రభేదముగఁ బ్రవర్తించుచుండిన యా యిరువురి పరస్పరస్నేహాతిశయమునకుఁ ద్రిపురాంతకుఁ డత్యాశ్చర్య మొందసాగెను. అట్లు కూర్చుండినతరువాతఁ గుమారదేవుఁడు త్రిపురాంతకునిఁ జూచి, యిట్లు మాటాడెను.

"త్రిపురాంతకా! నీకుఁ జెప్పవలసినసంగతులును, నిన్నడుగవలసినసంగతులు ననేకము లున్నవి. రుద్రాంబకుఁ బ్రబలబాహ్యశత్రువు జైనస్వామి. వాఁడు నీచేఁ బట్టువడెను. ప్రబలగృహశత్రువులైన ప్రతాపదేవుఁడు మాచేఁ బట్టువడెను. ఈసంగతి నీ వెఱుఁగవు కాఁబోలును."

అని పలుకఁ ద్రిపురాంతకు డాశ్చర్యముతో—

"ఏమేమీ? గుమారదేవా! దుష్టుఁ డైనప్రతాపదేవుఁడు మీచేఁ జిక్కెనా? కాదు కాదు. మీరు భ్రాంతిపడి యెవనినో కొఱకట్టియుందురు కాని, యామందభాగ్యుఁ డిదివరకే నాయొద్ద ఖైదీగా నున్నవాఁడు."

'లేదులేదు. బావా! ఆపొరపాటు నీయొద్దనే జరిగియుండును. వాఁడు నీ కెప్పుడు లభించెను? ఎట్లు పట్టువడెను?"

"ఒకనాఁ డతఁ డీ జైనాశ్రమమునుండి వచ్చుచుండఁగా నీప్రాంతమున సంచరించుచుండిన యాగూఢచారులు వానిని బట్టి నాయొద్దకు మోసికొనివచ్చి పడవేసిరి. అతఁడే ప్రతాపదేవుఁడని నాసేవకులలో నొక రిద్దఱుచెప్పిరి కాని, నేనంతమాత్రమున విశ్వసింపక స్త్రీమోహాతిశయమునఁ బిచ్చివాఁడై తిరుగుచుండినవాని కుమారుఁ డగు నాగరాజు—

అని చెప్పుచుండఁగా దేవదేవుఁడు వానినిఁ జూచి—

"ఆర్యా! ఏస్త్రీమోహమున?"

"ఎవతెయో యేకవీరయట! ఆయేకవీర యే యేకవీరయో యని నేనును సందేహించుచున్నాను. అయిన నాసంగతి యిప్పుడెందుకు!—ఆనాగరాజిదివరకే నాయాశ్రమమునఁ జిక్కియున్నందున వెంటనే వానిని రప్పించి యాతఁ డెవఁడని యడిగితిని.

ఆపిచ్చివానిమాటలవలన నాతఁడు ప్రతాపదేవుఁడే యని నిశ్చయించి, నేటివరకును వానిని నాయొద్దనే ఖైదీగా నుంచితిని. కుమారదేవా! అట్టి ప్రతాపదేవుఁడు నీకుఁ బట్టువడుట యెట్లు తటస్థించినది?"

"ఎట్లు తటస్థించినదా? మేము మధురానగరమునుండి వచ్చుచుండఁగా నాతఁ డత్యంత సంభ్రమముతోఁ బరుగుపరుగున వచ్చుచు మార్గమధ్యమున మాకంటఁబడెను. తోడనే యతఁడు ప్రతాపదేవుఁడని మేము గుర్తించి పట్టుకొంటిమి. నన్నుఁ జూచినంతనే యతఁడు నిర్ఘాంతపడి తన యొడలంతయుం గంపింప నే నేసంగతి యడిగినను బ్రత్యుత్తర మీయక మౌనముద్ర వహింపఁజొచ్చెను. నీపనివాఁ డెవ్వఁడును వానిని జూచి యుండక పోవుటచేఁ బిచ్చివానిమాటలు నమ్మి భ్రమపడుచుంటివిగాని, నాకుఁ జిక్కిన వాఁడే నిజమైన ప్రతాపదేవుఁడు."

అని ప్రసంగించుచుండ నంతలో గుడారము వెలుపలినుండి "అయ్యా! మా ప్రభువుగారైన త్రిపురాంతకదేవుఁడుగా రిచ్చట నున్నారా!" అని యెవరో గట్టిగా నడుగుచుండ నది విని త్రిపురాంతకుఁడు "రంగా! చూడు చూడు!! ఆవచ్చినవా రెవరో కనుఁగొనుము" అని చెప్పి పంపించెను. వెంటనే రంగఁడు వెలుపలికిఁ బోయి యచ్చట నిలువఁబడియున్న పురుషునిఁ జూచి—

"వెంకన్నా! నీవా! ఇంతయాలస్యమైన దేమి? ప్రభువుగారు నీకొఱకు క్షణ క్షణము నెదురుచూచుచున్నారు." అని పలుకుచు రంగఁడు వానిని లోనికిఁ గొనివచ్చెను. తోడనే వెంకన్న త్రిపురాంతకునకు మ్రొక్కి కట్టెదుట నిలువంబడ నతఁడు వానితో నిట్లు మాటాడెను.

"వెంకన్నా! మీరందఱును సురక్షితముగ వచ్చినారా? ప్రమాద మేమియుం దటస్థింప లేదు కదా?"

"దేవా! అపరాధము క్షమించినయెడల విన్నవించుకొనెదను. ప్రమాదమే తటస్థించినది."

"ఏమీ! ఏమి తటస్థించినది? చెప్పు చెప్పు! మీలో నెవ్వరికిని బ్రాణభంగము కలుగలేదు కదా? ముం దామాట చెప్పు."

"దేవా! లేదు లేదు. మే మందఱమును సురక్షితముగానే వచ్చినారము. కాని—"

"సరే! అట్లైనయెడల విచారము లేదు. తదితరమైన దేమి జరిగినను దాని నొక ప్రమాదముక్రింద నేను గణింపను. సంగతి యేమో యింక సావకాశముగ నెఱింగింపుము."

"స్వామీ! ప్రతాపదేవుఁడు తప్పించుకొని పాఱిపోయినాఁడు."

"ఆఁ! ఆఁ!—ఎప్పు డెప్పుడు? ఎట్లు తప్పించుకొనెను?"

"దేవా! ఆనాఁటి రాత్రియంతయు మన మందఱమును ప్రయాణసన్నాహములోఁ మునిఁగియుండినసమయమును గనిపెట్టి వాఁ డెట్టులో తనకట్లు త్రెంపుకొని, యా కటికి చీఁకటిలో నెవ్వరికంటఁ బడకుండ మెల్లఁగ దప్పించుకొని పాఱిపోయినట్లు తోఁచుచున్నది? దేవా! ఇంతకన్నఁ జిత్రమైనసంగతి వినుఁడు. ఆపోవువాఁడు మెల్లఁగఁ దన త్రోవనుబోక యొద్దుచేతనో నిష్కారణముగఁ దనకుమారుఁ డైనయాపిచ్చి నాగరాజును గుండెలపై బాకుతోఁ బొడిచి చంపివేసినాఁడు."

"నారాయణ! నారాయణ! దుర్మార్గుఁ డెంతపని చేసినాఁడు? హరహరా! ఎంత పాపాత్ముఁడు! ఎంతకఠినచిత్తుఁడు? వెంకన్నా! మీ రా శవ మేమి చేసినారు?"

"దేవా! మామాసామగ్రు లన్నియుఁ జక్కబెట్టుకొని, మేమాశ్రమమును విడిచి బయలుదేరినప్పుడు కలికములోనికైనఁ గానరాకుండఁ దద్దహనమును బరశురామప్రీతిగావించియే రావలయు నని తమరు మాకు సెలవిచ్చినారు కదా? అందుచే నాగరాజుశవ మచ్చటనే యుంచి యాశ్రమము నంటించినారము."

"పోనిమ్ము. మంచిపనియే చేసినారు. అనాథప్రేతసంస్కారమువలనఁ గోటియాగములఫలమున్నదఁట."

"స్వామీ! తమ రాశ్రమములోనికి దయచేసినయెడల నింకను గొన్నిసంగతులు తమకు వినిపింపవలయును."

అప్పుడు కుమారదేవుఁడు త్రిపురాంతకునిఁ జూచి, త్రిపురాంతకా! ఇప్పుడు మన సందేహము తీరిపోయినదికదా? ఆప్రతాపదేవహంతకుఁడు నీయొద్దనుండి తప్పించుకొని పాండ్యరాజుకడకుఁ బాఱిపోవుచు మాకుఁ బట్టుపడినాఁడు."

"ఔను. ఆపరమచండాలునకుఁ దగిన ప్రాయశ్చిత్త మొనర్పకయే మనము విడువఁగూడదు."

అని పలికి తనకుఁ గొంచెము పనియున్నదని చెప్పి త్రిపురాంతకుఁడు వెంటనే తన యాసనమునుండి లేచి నిలువఁబడెను. వెంటనే వారును లేచిపోయిరి. త్రిపురాంతకుఁడు వారియొద్ద సెలవుపుచ్చుకొని, యొకచేతితో యా గుడారమున వ్రేలాడుచుండిన తెరవంక నిదానించి చూచుచుండ, వాయువశమున నా తెరయుఁ గించుక ప్రక్కకుఁ గొట్టుకొనినంతనే యాలోపల నున్న యొక సుందరకన్యకావిగ్రహము వానికంటఁబడుటకుఁ దటస్థించెను. వెంటనే నూతనదుఃఖలక్షణములతో విలవిలఁబోవుచుండిన త్రిపురాంతకునిఁ జూచి చిఱునవ్వు నవ్వుచు దేవదేవుఁడు గాలిచే నల్లలాడకుండ తెర నెప్పటియట్ల సవరించెను.

## 31-వ ప్రకరణము

### అస్వస్థత

“ఓహో! ఆదివ్యమంగళవిగ్రహమును దత్సహజసౌందర్యలావణ్యాతిశయమును నా హృదయమున నెంతలో నాటినవి? ఆసుందరి యెవతెయై యుండునో? దేవదేవుని భార్యయై యుండునా? ఎందుచేతనో యాతఁడు తనచరిత్ర మేమియు నాతోఁ జెప్పక దాచియుంచినవాఁడు. ఆకన్యకారత్నము వానిసోదరియై యవివాహితయై యున్నచో నేఁ ధన్యుఁడ నగుదును. అయ్యయ్యో! ఏమి నావెఱ్ఱి! సోదరియే యైనయెడల నెవనికో తగినవానికిచ్చి పెండ్లిసేయక యిట్లు తనవెంటనూరూరఁ ద్రిప్పుకొనుచుండునా? కావున నాసుందరి వానియర్ధాంగలక్ష్మియే యై యుండవలయును. అందుచేఁ బరకాంతయగు నామెను గూర్చి నేను దలపోయుట మహాపాపము. కావున నాప్రసంగ మెట్టులైన మఱచిపోవలయును........నిజమే కాని యెట్లు మఱవఁగలను? ఆసుందరి నన్నీక్షింపలేదు కాని నాకంటఁబడిన యాసౌందర్యరాశి యిప్పటికిని నాకన్నుల యెదుట నున్నట్టులే యున్నది. ఆహా! ఆదేవదేవుఁ డెంతటి యదృష్టవంతుఁడు? దేవియొద్ద వాని కేదో గొప్పయుద్యోగ ముండియుండును. అందులో సహజముగా మంచిచాకచక్యము కలవాఁడు. మిక్కిలి రూపసి. యోగ్యమైన యిన్నిసద్గుణము లుండుటచేతనే యేమహారాజకుమారికనో యాతఁడు చేపట్టఁ గల్గెనుగాని, యుండ నూరు లేక, తినఁ దిండి లేక, యుద్యోగరహితుఁడనై యడవుల యందును గొండలయందును దిరుగుచుండు నాయట్టిపరమనిర్భాగ్యున కేతల్లిదండ్రులు తమకన్యక నిచ్చి యామెగొంతుక బలవంతముగఁ గోయఁజూచెదరు? ఒకప్పుడు నేను వివాహమాడఁ బ్రయత్నించినయెడల నే బీదకుటుంబమునకో తగినంత ధనసాహాయ్య మొనర్చి వారి కన్యకను సంపాదింపవలయును గాని మఱియొకవిధమగు నాధారమేమియుఁ లేదు కదా? అట్లు చేసినయెడల నాసమవయస్కులగు దేవదేవకుమారదేవాదులతో నాకెంత తలవంపు? కావున నట్టి తుచ్ఛసౌఖ్యమును కాసింపక వివాహేచ్ఛయే సంపూర్ణముగా విడిచి నా జీవితకాలమంతయు బ్రహ్మచర్యవ్రతములతోడనే గడపెదను. యుద్ధానంతరమున దేవియనుగ్రహమున నాకేదైన నుద్యోగము లభించినయెడల ధనదుపురమునుండి మా ముసలితల్లిని గొనివచ్చి యామె సేవచేయుచు నేకశిలానగరమందే కాలము గడపుచుందును. కుమారదేవుఁడు నాసోదరియం దత్యంతానురాగముతో నున్నవాఁడఁట. వానిచర్యకూడ నట్టులే కనఁబడుచున్నది. కావున నేకవీరను గూర్చి నే నేమియు శ్రమపడ నవసరము లేదు.”

అని త్రిపురాంతకుఁ డనేకవిధములఁ దనభవిష్యజ్జీవయాత్రను గూర్చి తలపోసి కొనుచుఁ దనగుడారమునకు వచ్చి యందొకయాసనముపై నిశ్చేష్టితుఁడై కూర్చుండి

యుండెను. తన ప్రభు వేదో దీర్ఘాలోచనమున నున్నట్లు కనిపెట్టి, వానివెనుక నున్న వెంకన్న యాతని నేమియుం మాటాడింప లేదు. కొంతసేపునకుం ద్రిపురాంతకుండే తన ప్రక్క నున్న వెంకన్నను జూచి,

"వెంకన్నా! చెప్పు! చెప్పు!! క్రొత్తవిశేషము లే మున్నవి?"

"దేవా! నేను వచ్చుచుండంగా నీసమీపముననే నూర్గురు పాండ్యసైనికులు నాకంట బడిరి."

"వెంకన్నా! అప్పుడే నీకంటఁబడిరా? నీ వేమియు వారితో నధిక ప్రసంగము చేయ లేదుకదా?"

"నే నేమియుం నధిక ప్రసంగము చేయలేదు. వా రెవరో చూడవలయునని చెంతకుం బోవునకి వారు మాటాడుకొనుచుండిన మాటలు నాచెవిని బడినవి."

"అలాగా? చెప్పు! చెప్పు! వారి సంభాషణములోని రహస్య మేమిటో నాకు వినిపింపుము."

'దేవా! ఆరహస్యము తప్పక వినవలసినదే! దేవదేవకుమారదేవు లిరువురును దమ ప్రభువును మోసపుచ్చి తమ్ముం గొనివచ్చినారంట! అందుచే నాయిరువురి నెట్టులైన బలవంతముగం బట్టుకొని మరలం దమ ప్రభువునొద్దకుం గొనిపోవలయునని కొందఱును—ఎవ్వనినైన నొకసైనికుని రహస్యముగ మధురానగరమునకుం బంపి యీవృత్తాంతము తమ ప్రభువునకుం దెలియంజేయవలసియున్నదని కొందఱును—ఈపరివారముపైం దిరుగంబడుటకు మనము నూర్వురమును జాలమా యని మఱికొందఱును దమలోం దామ గుసగుస లాడుకొనుచుండిరి. అందుచే మనము జాగ్రత్తపడవలయు నేమో యని తలంచుచున్నాను."

"వెంకన్నా! నిశ్చయముగ నీవు మాకు మహోపకార మొనర్చితివి. ఒకవిధముగా నీ యధిక ప్రసంగము మాకు లాభించినదని చెప్పవచ్చును. ఈసంగతి దేవదేవకుమారదేవులకుం దెలియంజేసి, తగినయేర్పాటు గావించెదను. నీవింకం బొమ్ము."

అని పలికి త్రిపురాంతకుండు వెంటనే వానికి సెలవిచ్చి తా నచ్చటినుండి లేచి పోయెను.

ఆయనంతరక్షణముననే త్రిపురాంతకుండు తనపరివారముకడ కేంగి, యాయుధపాణులగు నిన్నూర్గురు వీరభటుల నొకయరగంటలో సిద్ధముచేయించి, వారిని వెంటనిడుకొనిపోయి పాండ్యసైనికులు నివసించియున్న గుడారములను ముట్టడించెను. ఆవృత్తాంతము విని దేవదేవకుమారదేవు లిరువురు నచ్చటికిం బరుగునం జని సంగతి యేమని త్రిపురాంతకు నడుగ నతండు వెంకన్నవలనం దాను వినినక్రమ మంతయుం వారి కెఱింగిం

చెను. వారును బాంద్యసైనికుల దురాలోచనముల కాగ్రహించి, త్రిపురాంతకుఁడు చేసిన యుపాయమునకు మిక్కిలి సంతసించిరి. కాని యదివఱకే వారిలో నొకఁడు రహస్యముగ మధురానగరమునకు బయలుదేఱి యుండు నను ననుమానము వారిమువ్వురిని మిక్కిలి బాధించుచుండెను.

ఆగూఢారములచుట్టును త్రిపురాంతకుఁడు తనవీరభటులను గడుభద్రముగఁ గాపుంచి, తనసెలవు లేకుండ నొక యీఁగయైనను లోనికిఁ బోవుట కాని పైకివచ్చుట గాని జరుగరా దని కఠినముగ శాసించి, చీఁకటిపడుచుండఁ దనకుటీరమునకు విచ్చేసెను. సాయంకాలమునుండియుఁ బూర్వపుఁజకచకలు గాని చుఱుకుఁదనము గాని లేక త్రిపురాంతకుఁడు కడుమందముగనే సంచరించుచుండెను. భోజనమునైతము సరిగా నొనర్పక యెవ్వరితోడను మాటాడక, మాటిమాటికిఁ దనలో నేమేమో దీర్ఘాలోచన మొనర్చుచు త్రిపురాంతకుఁడు తనయనుచరులకందఱికిఁ గ్రొత్తగాఁ గన్పట్టుచున్నందున, నట్లుండుటకుఁ గారణ మేమని వెంకన్నయు, రంగఁడు మొదలగువారును వాని నప్పు డప్పు డడుగుచు వచ్చిరి గాని, యతఁడు చిరునగవుతో వారి నావలకుఁ బొమ్మనుచుఁ దగినసమాధాన మేమియుఁ జెప్పలేదు. నాఁటిరాత్రి పండ్రెండుగంటలవఱకు నిద్ర లేక సంతాపిత హృదయుఁడై శయ్యపైఁ గూర్చుండుచుఁ బరుండుచు లేచుచు నిటునటుఁ దిరుగుచుఁ గడపి తుద కెట్టులో నిద్రించెను.

ఇంతలోఁ దెల్లవాఱెను. త్రిపురాంతకు డప్పుడే మేల్కాని దైవప్రార్థన మొనర్చి, శయ్యపైఁ గూర్చుండినంతనే చేతి నొకమూటతో వెంకన్న వానికిఁ బ్రత్యక్షమయ్యెను తోడనే త్రిపురాంతకుఁడు వానిని జూచి నవ్వుచు—

"వెంకన్నా! నిద్దురకన్నులతో లేచి నీమొగము చూచితిని. నేఁడు నాకేమైన నసంతృప్తి కలిగినయెడల నిన్నుఁ జావఁగొట్టెదను జాగ్రత్త."

"దేవా! లాభము కలిగినయెడల నాకుఁ బారితోషిక మిప్పించెదరా? అదికూడ సెలవిండు."

"ఆహా! తప్పక యిచ్చెదను. కాని నీచేతిలోనిమూట యేమి?"

"స్వామీ! నేఁటియుదయమున నామొగము చూచినందువలన మీకుఁ గలిగినలాభ మీమూటయే. దీనిని మీరు పరిగ్రహింపుఁడు."

అని పలుకుచు నతఁ డామూట వానియొడిలోఁ బడవేసెను. తోడనే త్రిపురాంతకుఁడు దానిని విప్పి చూడ నందు బంగారుజరీపనులతోఁ దళతళలాడుచు మహారాజకుమారులు ధరింపవలసిన విలువలేనికట్టుదుస్తులు వానికంటఁ బడెను తోడనే యతఁ డాశ్చర్యచేతస్కుఁడై వెంకన్నను జూచి,

"వెంకన్నా! ఇవి నీకెక్కడనుండి వచ్చినవి? ఎవరికొఱకు?"

"దేవా! ఆసంగతి విన్నవించుకొనెదను. చిత్తగింపుఁడు. నేఁటి ప్రాతఃకాలముననే, నేను లేచి, యోగక్షేమము లరయవలయునని దేవదేవ కుమారదేవులగుడారమునకుఁ బోయి యుంటిని."

"వెంకన్నా! కొంపమునిఁగినట్లు నీవంత ప్రొద్దుననే లేచి వారిగుడారమున కేల పోవలయు? వారియోగక్షేమములబాధ్యత నీ కెందుకు? పనిలేనియెడల నూరక యొకచోఁ గూర్చుండుటకు నీకుఁ దోఁచదుకాఁబోలు? సరే! తరువాత నేమైనది?"

"నేను బోవునరి కచ్చట నేమో గుసగుసలాడుకొనుచుండిన దేవదేవకుమారదేవు లిరువురు నన్నుఁ బిలచిఁ యీమాటను నాకందిచ్చి రహస్యముగా నాచెవిలో "ఓయీ! యీవదలివస్తులను ధరించి, యొకమారు దయచేయవలసియున్నదని మీప్రభువుతోఁ జెప్పుము" అని చెప్పి నన్నిచ్చటికిఁ బంపించిరి. తమరు త్వరగా రావలసినదని యున్నదఁట."

"వెంకన్నా! కాలోచితకృత్యముల నిర్వర్తించుకొని, నే నిప్పుడే వారిదర్శనమున కేఁగెదను గాని యీవస్తులనుమాత్రము నేను ధరింపలేనోయి! అయినను సంతోషపూర్వకముగ వారొసంగినవస్తువును దిరస్కరించుట కూడదు. కావున నీమూట నా పెట్టెలోఁ బడవేయుము."

"దేవా! అట్లు కాదు. తమ రీవస్తులను ధరించినచోఁ గన్నులపండుగగాఁ జూడవలయునని నేను ముచ్చటపడుచున్నాను. కాఁబట్టి తమరు ధరింపక తప్పదు."

"ఛీ! దౌర్భాగ్యుఁడా! నీకుఁ గన్నులపండుగ కావలయునా? అధికప్రసంగము చేయక వెంటనే నేను చెప్పినట్లు చేయుము."

"దేవా! తమ రీవస్తులను ధరించుట కంగీకరింపలేదని వారితో మనవిచేసి యిప్పుడే వచ్చెదను. సెలవా?"

"ఓరి నిర్భాగ్యుఁడా! నీకు బుద్ధిలేదా యేమి? నాతోఁ జెప్పకుండ నీపైని నీవా గుడారమున కేఁగినచో నేమి చేసెదనో చూడు!"

"చిత్తము. తమ రేమిచేసినను జేయవచ్చునుగాని, మీ రీవస్తులను ధరింపనియెడల నా సంగతి వెంటనే తమ కెఱింగింపవలసియున్నదని వారిరువురును నాకు సెలవిచ్చియున్నారు. ఆమీఁద మీచిత్తము. మీరు వీనిని ధరింపనియెడల వారు స్వయముగా వచ్చి ధరింపఁజేసెదరఁట."

"వెంకన్నా! గట్టిచిక్కే తెచ్చితివే! మంచియుపకారమే చేసితివి! ఛీ! ప్రొద్దుననే లేచి నీమొగముఁ జూడఁగూడదు."

"నిజము దేవా! నిజము! నా మొగము చూచినవారి కెట్టిస్థితియే ప్రాప్తమగుచుండును."

అని పలుకఁ ద్రిపురాంతకుఁడు వానిని జూచి నవ్వుచుఁ గాలోచితకృత్యములు నిర్వర్తించుకొనుటకై లేచెను.

---

## 32-వ ప్రకరణము

### "నేను దేవదేవుఁడను గాను"

నిర్వర్తితకాల్యకృత్యుఁడై తన ప్రభువు బయలుదేరువఱకును వెంకన్న వాని వెంటనే సంచరించుచుండెను. తలఁచిన కార్యమును, బట్టినపట్టును కొనసాగువఱకు విడిచిపెట్టని మొండితనముగల వెంకన్న యన్నఁ ద్రిపురాంతకునకు మక్కువ యెక్కువ. పట్టి మొండితనమే కాని, తక్కినవారివలె లేశమును గడుసుఁదనము లేని యమాయకుఁ డని జాలిపడి యతఁడు వానికిఁ జనవొసంగి యాదరించుచుండును. ఆనాఁటి యుదయమున వెంకన్న పోరు భరింపలేకయే త్రిపురాంతకుఁ డావస్తులను ధరించుట కంగీకరించె నని చెప్పవచ్చును. అదియును గాక, వానిని దాను దాల్పనియెడల దేవదేవకుమారదేవు లిరువురును దన్నుఁగూర్చి దురభిప్రాయ మొందెద రనియును, మనసు చిన్నవుచ్చుకొనెద రనియును నెంచి తన కణుమాత్రమైన నిష్టము లేకపోయినను ద్రిపురాంతకుఁ డావస్తులను ధరించి బయలుదేఱెను. జరీకమ్ముల యాకుపచ్చని పట్టుషరాయియును, జలతారుపనులచేఁ జిత్రింపఁబడిన పసుపుపచ్చని పట్టు అంగీయును, ధగధగలాడు గులాబిరంగు పట్టుపెష్ఠాయును దాల్చి దక్షిణహస్తమునఁ గల లోకభీకరమగు ఖడ్గరాజము చూపరుల కన్నులకు మిఱుమిట్లు గొలుప, భూలోకమున నవతరించిన లక్ష్మీకుమారుఁడో యన వీరాగ్రసరుఁ డగుమన త్రిపురాంతకుఁడు తన గుడారమునుండి వెడలి దేవదేవకుమారదేవుల గుడారమును సమీపించెను. చూచుటకు వేయికన్నులైనఁ జాలని యింతటి గంభీరాకారమును, నింతటి సౌందర్యాతిశయమును, దమ ప్రభువునందుఁ గలవని, యిన్నాళ్ళకుఁ బోల్చుకొనఁ గల్గితి మని, యాతనియనుచరు లెల్లరు వానిని జూచి తమలోఁ దాము ముచ్చటించుకొనసాగిరి. అందుచేతనే వేషభాషలని పెద్దలవాడుక.

అట్లు గుడారమును సమీపించి త్రిపురాంతకుఁడు తటాలున లోనఁ బ్రవేశించి, యచ్చటఁ దనకంటి కెవ్వరును గానరానందున దేవదేవకుమారదేవులు లోపల నున్నా రని యూహించి, చెంతనున్న యొక యాసనముపై నధివసించి, "కుమారదేవా! కుమార

దేవా! అని రెండుమూఁడుసారులు పిలిచెను. తోడనే ప్రక్కను వ్రేలాడుచుండిన కటకవాటమును దొలఁగించి, తొలినాఁటి సాయంసమయమున నాతఁడు చూచిన కన్యకావిగ్రహము తటాలున వాని కట్టెదుటకు వచ్చి నిలువంబడి సుందరమందహాస రుచులు వానిమొగముపైఁ బ్రసరింపఁజేయుచు, "మనోహరా! కుమారదేవుఁ డింతసేపు వఱకు నిచ్చటనే యుండెనుగదా? మీతోఁ జెప్పకుండ నెచ్చటి కేఁగెను?" అని పలికెను. అట్లు తన కట్టెదుటకు వచ్చి నిలిచిన యాభువనమోహనస్వరూపమును జూచినతోడనే సహజపౌరుషపరాక్రమవంతుఁ డయ్యును త్రిపురాంతకుఁడు వెలవెలఁబోవుచు, నించుక శరీరకంపము నుదయింపఁ, జిఱుచెమటల నొడలెల్లఁ జెమ్మగిల్ల నోటమాట లేక చిత్రప్రతిమాకారమును ధరించి యుండెను. ముల్లోకముల జయింపఁగల ప్రతాపవంతున కైనను మాయాశక్తిమయం బగు నొక్కస్త్రీస్వరూపమును జయింపఁగల్గుట దుర్ఘటము కదా! ఈశ్వరసృష్టియందలి వైచిత్ర్యములో నిదియే ముఖ్యమైనది!

అట్లు త్రిపురాంతకుఁడు కొంతవఱకుఁ దన్మోహనాకారసందర్శన వివర్జితచేష్టుఁడై యుండి, పిదప నించుక ధైర్యము వహించి, యారాజకన్యామణితో నిట్లు ప్రసంగించెను.

"సుందరీ! నీమాటవలన నీవు దేవదేవునియర్ధాంగివలెఁ దోఁచుచున్నావు. కాని.—"

అని యింక నేమో చెప్పఁబోవుచుండ నామె నవ్వుచు—

"ఔను. నామాటలవలన నేను దేవదేవునియర్ధాంగివలెఁ గనఁబడుచున్నాను. మీ స్వరూపమువలన మీరీ మహేశ్వరికిఁ బ్రాణవల్లభునివలెఁ గనఁబడుచున్నారు. అబ్బా! ఏమి కోలాహలము!"

"సుందరీ! ఇది కోలాహలము గాదు. నేను జెప్పఁబోవునదికూడ నదియే! నాస్వరూపమును జూచి నీవు మోసపోవుచుంటివి గాని, నేను దేవదేవుఁడను గాను. నాపేరు త్రిపురాంతకదేవుఁడు. ఈశ్వరసృష్టివిశేషమున మే మిరువురము నేకాకారులమై జనించితిమి."

"మనోహరా! ఇది యొక్కటియే కాదు. ఈశ్వరసృష్టియందు పలువిశేషము లున్నవి. మీస్వరూపమును జూచి నేను మోసపోలేదు గాని, యానాఁడు మీరు పల్కిన మాటలను నమ్మికొనినందుల కిట్టిమోసమును గల్గుచున్న నదియే చాలును. దేవదేవాభిధానమును విడిచి, మీ రీత్రిపురాంతక నామధేయమును నేఁడే ధరించుకొంటిరా యేమి? అయిన నేమి? మీరు దేవదేవు లైనను త్రిపురాంతకదేవు లైనను నేను మహేశ్వరిని గావచ్చును గదా!"

ఆమాటలకుఁ ద్రిపురాంతకుఁడు నవ్వుచు—

"సుందరీ! గట్టిచిక్కు తటస్థించినది. నాస్వరూపవిశేషము నామాటలను నిన్ను విశ్వసింప నీయకున్నది. నే నేమి చేయఁగలను. కొంచెము సేపువఱకు నీవట్టిన తిభ్రమమును గట్టి పెట్టినయెడల దేవదేవుఁడు వచ్చినంతనే నీసందేహము నివృత్తి కాఁగలదు. వారెవ్వ రును లేనప్పుడు నే నీగుడారమునఁ బ్రవేశించి మహాపరాధ మొనర్చితిని. నన్ను క్షమింపుము."

"అపరాధమా ? క్షమింపవలయునా? రామరామ! ఎంతయమాయికము! దేవదేవుఁడు వచ్చినంతనే నాసందేహము తీరుననుచున్నారా? సరే బాగున్నది. ఒక్క స్వరూపము గల యిరువురుపురుషు లున్నప్పుడు—ఒక స్వరూపము గల యిరువురుస్త్రీలు గూడ నుండవచ్చును గదా? అందుచే దేవదేవుని వరించినమహేశ్వరి వేఱు త్రిపురాంతకుని వరించిన మహేశ్వరి వేఱు. మేమిరువురము నొక్కటియే యాకారము కలవారము. ఈయుక్తికి మీరేమి సమాధానము చెప్పఁగలరు!"

"మహేశ్వరీ! నే నంతయుక్తిపరుఁడను గాను. కాని నన్నిదివఱ కేమహేశ్వరియును వరింపలేదు. అందుచే —"

అని యింక నేమేమో చెప్పఁబోవుచుండఁ దటాలున కుమారదేవుఁ డాగుడార ములోఁ బ్రవేశించుటచేత వారి సంభాషణమునకు భంగము జనించెను. తోడనే మహే శ్వరియు నాపటకవాటమును దాఁటి లోనికిఁ బోయెను. కుమారదేవుఁ డట్లు ప్రవేశించిన తోడనే చిఱునవ్వు నవ్వుచు—

"బావా! యిచ్చట నేమి చేయుచున్నావు?"

"ఏమియును లేదు గాని దేవదేవుఁ డెచ్చట నున్నాఁడు?"

"దేవదేవుఁడా ? గుడారములోఁ గూర్చుండి ప్రియురాలితో ముచ్చటలాడు కొను చున్నాఁడు."

అమాటలు తెరచాటుననే నిలువఁబడియున్న మహేశ్వరి విని నవ్వుచు—

"అన్నయ్యా! మీరాయన నీపైనిదేవదేవా యని పిలువకుఁడు. త్రిపురాంతకుఁ డని పేరు మార్చుకొనినారఁట."

"అలాగా! అమ్మాయీ! నా కాసంగతి తెలియదు. గడియ కొకపేరు, గడియకొక వేషము వీనికి సైజములు కాఁబోలు."

అని త్రిపురాంతకునిఁ జూచి మఱింత నవ్వుచు—

"బావా! చాలుఁ జాలు! ఇంక లెమ్ము. చేయవలసినకార్యము లనేకము లుండఁగా నిచ్చటఁ గూర్చుండి పరిహాసము లాడుచుంటివా?"

అని పలుకుచు వానిచేయి పట్టుకొని గుడారమువెలుపలికిఁ దీసికొని పోయెను. ఇరువురును గలసి పాండ్యసైన్యముకడకుఁ బోవుచుండఁగాఁ ద్రిపురాంతకుఁడు కుమార

దేవునితో నేమో చెప్పట కుద్యమించెను. కాని, యింతలో దేవదేవుఁ డచ్చటికి వచ్చి వారిని గలసికొనుటచేతఁ దాను మాటాడఁ దలచినయంశమున కది యదను గాదని యూరకుండెను. దేవదేవుఁ డచ్చటికివచ్చి వారిరువురినిఁ జూచి నవ్వుచుండఁ, గుమార దేవుఁ డేదో కనుసంజ్ఞ చేసి మందహాసమును మాన్పించెను. అప్పుడు దేవదేవుఁడు త్రిపురాంతకునిఁ జూచి—

"దేవా! మన మిప్పుడు చేయవలసినకార్య మేమో మీరూహించినారా?"

"నే నేమియు నూహింపలేను. మీ రెట్లు చెప్పిన నట్లు చేసెదను."

"నేఁడో రేపో పాండ్యసైన్యములు వచ్చు నని నా కనుమానముగా నున్నది. అందుచే మన మీనూర్గురు ఖైదీల నెంతకాలము కాచుకొని యుండఁగలము. కావున వీరి యొద్ద నున్న నాయుధపరంపర గైకొని విడిచి పెట్టుటయే యుత్తమ మని తోఁచుచున్నది. మీ రేమందురు?"

"ఆయుధపరంపర గైకొనవచ్చును గాని, పాండ్యరాజువచ్చువఱకు మాత్రము వీరిని విడిచి పెట్టఁగూడదు."

అని మాటాడుకొనుచు వారు మువ్వురు నా ప్రదేశమును సమీపించిరి.

---

## 33-వ ప్రకరణము

### భవిష్యత్ప్రయత్నము

ఆయుధములను వాహనాదులను దమస్వాధీన మొనర్చుకొనుటయే కాక, ఖైదీగాఁ బట్టువడిన ప్రతాపదేవునిఁ గూడ నచ్చటనుండి వేరుచేసి, కుమారదేవాదులు తమపరివార మున కప్పగించిరి. ఏక్షణమునఁ బాండ్యరాజు సైన్యములతో వచ్చి పైఁబడునో యను ననుమానముచే, నా మువ్వురు రాజకుమారులును బ్రతిక్షణమును బరివారముతోడ యుద్ధ సన్నద్ధులయియే యుండుచుండిరి. ఏకశిలానగరమునకు ఛన్నుఁడు బయలుదేరినది మొదలు మూఁడు నాలుగుదినములవఱకు దేవియొద్దనుండి ప్రత్యుత్తరముగాని, సైన్యముగాని రాలేదు. దేవదేవకుమారదేవు లిరువురు నీవిషయమునుగూర్చియే యామూఁడు నాలుగు దినములును దీర్ఘముగ నాలోచించుచు, సాంగ్రామికప్రయత్నములలోఁ దమకన్న పది రెట్లుగ నెక్కువ యనుభవము గల త్రిపురాంతకునితోఁ గార్యక్రమమునుగూర్చి యాలోచింపసాగిరి. కాని, తనమనసునకుఁదగినంత స్వస్థతలేనందున నొకప్పుడువారి ప్రశ్నల కేదో యొక సమాధానము చెప్పుచుండుటయు, మఱియొకప్పుడు మీసెలవుప్రకారము నడచుకొనవలసినవాఁడనే కాని, యంత దీర్ఘాలోచనపరుఁడను మాత్రము కా నని ప్రత్యుత్తర మిచ్చుటయుఁ ద్రిపురాంతకుఁడు జరుపుచు వచ్చెను.

ఒకనాటిసాయంకాలమునఁ ద్రిపురాంతకుఁడు తనగుడారమున నొంటరిగఁ గూర్చుండి తనలో నేమో యాలోచించుకొనుచుండ, దేవదేవుఁ డచ్చటఁ బ్రవేశించి కట్టెదుట నిలిచి నమస్కరించెను. త్రిపురాంతకుఁడును వానిని సుఖాసీను నొనరించి, విశేషమేమి యని యడుగ దేవదేవుఁడు వానితో నిట్లు ప్రసంగించెను.

"ఆర్యా! విశేషము లేవియును లేవు. నేఁటికి రెండుమూఁడు దినములక్రిందట మేము లేనప్పుడు తమరు మాగుడారములోఁ బ్రవేశించి—"

అని యింక నేమో చెప్పఁబోవుసరికి, త్రిపురాంతకుఁ డాకస్మికముగఁ జెల్లవోయి, మహాపరాధము చేసినవానివలె నిటునటుఁ జూచుచు వెలవెలఁ బోవ సాగెను. అది కనిపెట్టి దేవదేవుఁడు—

"తమ కీయాశ్చర్యమేల? నాప్రియురాలే నాతోఁ జెప్పుచున్నది. ఆమె యబద్ధమాడునది కాదు—"

"దేవదేవా! అబద్ధమని నేను చెప్పలేదు. నావలన నట్టియపరాధము జరిగినమాట వాస్తవమే! త్వరగా రమ్మని కబురంపుటచేత మీ రిరువురును గుడారములో నుందురనియే భావించి తటాలున నేను లోనఁ బ్రవేశించితిని."

"ఔను. దయచేయవలసిన దని మీకుఁ గబురంపించితిమి గాని యాకస్మికముగఁ బాండ్యసైన్యమునొద్దకుఁ బోవలసివచ్చుటచేత వెంటనే మిమ్ము దర్శింపలేక పోయితిమి."

"దేవదేవా! అందుచేతనే యింతపని వచ్చినది. ఆకారవిశేషమువలననే కాక, మీ రొసంగినదుస్తులవలనఁ గూడ మహేశ్వరి నన్నుఁ జూచి పూర్తిగా భ్రమపడి మోసపోయినది. అంతియె కాని, యీశ్వరసాక్షిగ నే నెట్టి దురుద్దేశమును వహింపలేదు. ఈవిషయములో నన్ను విశ్వసింపవలసిన దని వినయముగఁ బ్రార్థించుచున్నాను."

"దేవా! మీయందు నాకట్టి దురుద్దేశ మేమియును లేదు. మహేశ్వరి మీయం దంత యనురాగముతో నుండ మీ రేల యామెను బరిగ్రహింపఁగూడదు? నే నింక నామెను వివాహ మాడలేదు కదా?"

"రామ! రామ! దేవదేవా! నేను మూర్ఖుఁడను గాను. కేవల మోహాంధుఁడను గాను. వివాహము కాకపోయినను నీవు చేపట్ట నెంచిన కన్యకను గన్నెత్తియైన నే నీక్షింపవచ్చునా? తప్పు! తప్పు! నీ వట్లనఁగూడదు."

"నిజమే కాని, మీయాకారము చూచి మోసపోయియో లేక మఱేకారణముచేతనో, మీయందు మోహబుద్ధివహించిన మహేశ్వరిని జేపట్టుట నా కింక నిష్టము లేదు. కావున క్షమింపవలయును. మీ రామెను దయతోఁ బరిగ్రహించినచో సంతోషమే! లేనియెడల నే నామెను విడిచిపెట్టుచున్నాను."

"దేవదేవా! నీ వింకను బాలుఁడవు. లోకానుభవము లేనివాఁడవు. అందుచే లోక మేమని నిందించునో యని జంకక యట్లు తొందరపడుచున్నావు. పాప మామహేశ్వరి యెవ్వతెయో కాని, యేపాప మెఱుఁగని యామెను నీ వట్లు విడిచిపెట్టినయెడల దిక్కులేనిదై యాదీనురాలు ఇంతకును గారకుండ నగు నాయం దుసురు మని యెంత యేడ్చునో కదా? అబ్బాయీ! ఆమహాపాతకమును నా మెడకుఁ జుట్టవలయు ననియా నీప్రయత్నము? ఇఁక నెన్నఁడు మీగుడారమునకు నేను రాను. జరిగిన దానిని బాటింపక నన్ను మన్నింపుము."

"దేవా! ఆమహాపాతకము మీమెడకుఁ జుట్టుకొనకుండ మీ రామహేశ్వరి నేల పరిగ్రహింపరాదు?"

అని పలుకుటయుఁ ద్రిపురాంతకుఁ డేమో ప్రత్యుత్తర మీయ నుద్యమించుచుండఁ దటాలున కుమారదేవుఁడుఁ గూడఁ బరుగుపరుగున వచ్చి యాగుడారములోఁ బ్రవేశించెను. దేవదేవ త్రిపురాంతకదేవు లిరువురును దమసంభాషణ మంతతో నాపివేసి, యత్యాతురతతోఁ బరుగెత్తి వచ్చిన కుమార దేవుని మొగముపైపు చూడసాగిరి. అప్పుడఁ బ్రశ్నించుటయె తడవుగఁ గుమారదేవుఁడు నిట్టూర్పులు విడుచుచు "త్రిపురాంతకా! త్రిపురాంతకా! శత్రువులు వచ్చుచున్నారు. మన మింకఁ ద్వరపడవలయును." అని యాతురతతోఁ జెప్పెను. తోడనే యతఁడు త్రుళ్లిపడి కుమారదేవునితో నిట్లు ప్రసంగించెను.

"కుమారదేవా! మన మనుకొనినట్లు పాండ్యరాజే వచ్చుచున్నవాఁడా? ఈసంగతి నీ కెట్లు తెలిసినది?"

'మన మంపించినగూఢచారులు వచ్చి యిప్పుడే నాతోఁ జెప్పినారు. పాండ్యరాజు దాదాపుగఁ బదునైదువేలసైన్యముతో జయలుదేఱి మన పైపునకే వచ్చుచున్నాఁడఁట! తెల్లవారుసరికి మనలను సమీపింపవచ్చునఁట. ఇంక మనకుఁ గర్తవ్య మేమో నిర్ణయింపుము."

"కుమారదేవా! నాసైనికులందఱు నించుమించుగ నేనూర్గురికన్న మించియుండరు. ఎంతటిరణనిపుణులైనను బహిరంగప్రదేశమున వీరిని వెంట నిడుకొని పదివేల సైన్యము నెదిరించుట యించుక కష్టసాధ్యము. ఏమి చేయవలయును? ఏకశిలానగరమువంక మన మంపినగూఢచారు లింకను రాలేదుకదా?"

"ఏదీ? వారిజాడ యింకను గానరాలేదు."

"కుమారదేవా! మన మిప్పుడు క్రొత్తగాఁ జేయవలసిన యుద్ధప్రయత్నము లేవియును లేవు. ప్రతినిమిషమును మనసైనికులు యుద్ధసన్నద్ధులయియే యుండుచున్నారు.

శత్రుసైన్య మెంత యున్నను మనము నిర్భయముగా నెదిరింప మనుకొందము. కాని, మనసామానులను మహేశ్వరినిమాత్రము జాగ్రత్తగా రక్షించుట కుపాయ మాలో చింపవలసియున్నది. ఏమి? నిజమేనా!"

"నిజమే! నీవు కేవలమును మహేశ్వరీధ్యానరతుండవై యుండుటచేతఁ జక్కనియుపా యము నీకు స్ఫురింపకున్నది. అందుచేత నా కొకసాధనము తోడకట్టుచున్నది వినుము. ఇప్పుడు నాలుగైదుగంటలకన్న నెక్కుడు వేళ గాదు. తురంగారోహణ మున నిపుణుండైన యొకచారుని మన మిప్పు డేకశిలానగరమునకుఁ బంపినయెడల నతఁడు రాత్రి భోజనపువేళకుఁ బూర్వమే దేవిని దర్శింపఁగలఁడు. దేవియుం నొక గంటకాలములో సైన్యములను సిద్ధముచేయించి, యుద్ధమునకు పండ్రెండుగంటలకుఁ బంపించినను రేపుదయమే డెనిమిదిగంటలకు మన కందఁగలవు. అంతవరకు జరుగ కుండ మార్గమధ్యమున నే దేవి పంపించినసైన్యములు మనచారున కెదురుపడవచ్చు నని నాకు ధైర్యము తోఁచుచున్నది."

"కుమారదేవా! అట్లు నెదురుపడినయెడల మన మదృష్టవంతులమే! కాని కీడెంచి మేలెంచవలయును గదా? రేపుదయమునకుఁ గూడ దేవిసైన్యములు మన కందనిచో మన మేమి చేయవలసియున్నదో మొదటఁ జెప్పుము."

"అన్నా! బావా! మహేశ్వరిని గూర్చినభయము నిన్ను మిక్కుటముగ బాధించు చున్నది. ఆమె కెట్టియాపదయుం రాకుండఁ గాపాడుభారము నేను వహించు చున్నాను. కావున నీ సందేహమును విడిచి లేచి రమ్ము."

అందు కేమియుం బ్రత్యుత్తర మీయక త్రిపురాంతకుఁడు మోము వాచుకొని యూరకుండెను.

---

## 34వ ప్రకరణము.

### ఆంధ్రవీరుల సమరోత్సాహము

భక్తివిశ్వాసములును, దలఁచినకార్యమునందు మిక్కిలి పట్టుదలయుం గలవాఁ డగుటచే వెంకన్నయే నాఁటిసాయంకాలమున రుద్రమదేవియొద్దకుఁ బంపఁబడుటకుఁ ద్రిపురాంతకాదులచే నిర్ణయింపఁబడెను. వానివెంట శైవీయైన ప్రతాపదేవుని, మహే శ్వరిని, సామానులను భద్రముగా నేకశిలానగరమునకుఁ బంపివేయవలయు నని మొదట వారు భావించిరి గాని, యట్లు పంపినయెడల వెంకన్నకుఁ గొంతపరివారమును సాహాయ్య ముగా నీయవలసియున్న దనియుం, మొదలే స్వల్పమైయున్న తమసైన్యములో నింకను దగ్గించినయెడల శత్రువుల నెదుర్కొనుట దుర్ఘట మనియుం నూహించి కుమారదేవాదు

లట్లు చేయలేదు. సైన్య మత్యంతావశ్యకమై యున్న దనియు, నుత్తరక్షణమునఁ బంప కున్నఁ బెక్కుచిక్కులు తటస్థించు ననియు, నెంతమాత్రమును జాల మొనర్పరాదనియు మొదలగుసంగతులతోఁ గుమారదేవుఁడు రుద్రమదేవికి వ్రాసియిచ్చిన యుత్తరమును గైకొని, వెంకన్న తురంగారూఢుఁడై నాఁటిసాయంకాలముననే యేకశిలానగరమునకు బయలుదేరెను.

నాఁటిరాత్రి త్రిపురాంతకాదులు తమపరివార మంతటితోఁ గూడఁ బెందలి కడనే భోజనము లొనరించి, స్వకార్యనిర్వహణమునం దప్రమత్తులై సంచరింపఁ జొచ్చిరి. తమతమ యాయుధములను వాహనాదులు నెవరికి వారు సిద్ధ మొనరించుకొని సైనికు లందఱు నత్యుత్సాహముతో శత్రువులకొఱ కెదురుచూచుచుండిరి. పాండ్యసైనికులు నిరాయుధులై యుండుటచే వారివలనఁ దమ కెట్టి ప్రమాదమును గలుగనేర దనియు, నింక వారిగుడారములచుట్టును దమవీరభటులను గాపుంచుట యనవసర మనియు, నవసర మైనను దమ కట్టియవకాశము లేశమును లే దనియు నెంచి కుమారదేవాదు లానూర్వురను విడిచిపెట్టి యిష్టమువచ్చినయెడకుఁ బొమ్మనిరి. బ్రతుకుజీవుఁడా యని వారును దత్ప్రదేశమును విడిచి యెందేనియుం బోయిరి. ఆనాఁటి రాత్రియంతయు నిద్ర యెట్టిదో యెఱుఁగక యావీరరాజకుమారులు మువ్వురును దత్ప్రాంతమం దంతట వాహనారూఢులై సంచరించుచుఁ జీమ చిటుక్కుమన్న శత్రుసైన్యము వచ్చుచున్నట్లు భావించి త్రుళ్లిపడుచుఁ దెల్లవాఱుజామువఱకును గడపిరి.

నిశాసమయము గడచిపోవుచున్నకొలఁదిని దమతమ హృదయాందోళనములును రణోత్సాహమును నంతకంత కధికమగుచుండుటచేఁ దెల్లవారుజామైనంతనే దేవదేవాదులు శత్రువులు వచ్చి తమపైనిఁ బడుచున్నట్లే భావించి, పూర్వముకన్న నెక్కుడు చుఱుకుఁదనమును జాగరూకతయుం వహించి, తమసైన్యమునకు భద్ర మని హెచ్చరిక కూర్ప నారంభించిరి. అఖండముగ వెలుగుచుండిన యచ్చటి కరదీపికలకాంతిలో నా మామిడితోఁటలో గుడారములచుట్టును దిరుగుచుండిన త్రిపురాంతకుఁడు తనకేమో యనుమానము తోఁచినందున, దమలో నేవిషయమునుగూర్చియో దీర్ఘముగ నాలోచించుచుండిన దేవదేవకుమారదేవులయొద్దకుఁ పరుగునఁ బరుగెత్తుచు వచ్చి యిట్లు ప్రసంగింప నారంభించెను.

“కుమారదేవా! విను! విను! దూరమునుండి యేదో జనులయలుకుడు నాకు వినవచ్చుచున్నది. ఏమి? ఔనా? లేదా?”

“త్రిపురాంతకా! లేకపోలేదు. మేము గూడ నావిషయమునుగూర్చియే యాలోచించుచున్నాము. అయలుకుడు స్పష్టముగానే వినవచ్చుచున్నది. శత్రుసైన్యమే వచ్చుచున్నయెడల నాశబ్ద మంతకంత కధికమై మనకు మఱింత స్పష్టముగా వినఁబడ

వలసియుండెను. కాని యాగంటసేపైనను నది యొక్క రీతిగానే యున్నది. ఒకవేళ నాయకులకుఁడు మనము విడిచిపెట్టిన నూర్వురుపాండ్యసైనికులై యుండును. ఈరాత్రి గడపి తెల్లవాఱినంతనే బయలుదేఱిపోవలయు నని యూహించి, వారీ చుట్టుప్రక్కలనే యెచ్చటనో బసచేసికొని యుండియుందురు."

"కుమారదేవా! అట్లనుకొనుటకుఁ గూడ వీలులేదు. ఆ వెలుఁగు దేవో మహోపద్రవకర మైనదియే కావలయును. ఇది నిశ్చయము."

అని పలికి, త్రిపురాంతకుఁడు తనయుపమానము తీరనందునఁ గొంచెము ముందు నకుఁ దనగుఱ్ఱమును నడపించి ప్రక్కకుఁ దొంగితొంగి చూచుచు" దేవదేవా! కుమార దేవా! చూడుఁడు! చూడుఁడు! ఈకటికచీఁకటిలోఁ గనుచూపుమేరనుండి యేదో చిన్నదీపమువలె మెఱయుచు నాకంటఁ బడుచున్నది!' అని యాతురతతోఁ బలికి నంతనే, వారిరువురును గూడ నాతనిని సమీపించి యా ప్రక్కకు పరిశీలింపసాగిరి అప్పుడు మెఱుగుడుపురుగువలె నొకచిన్నవెలుతురు మిణుకుమిణుకుమనుచు, వారికంటికిఁ గాన వచ్చుచుండెను, అది మెఱుగుడుపురుగే యని మొదట వారు భ్రాంతిపడిరి; కాని, యంతకంత కావెలుఁ గధికమై తమకు మఱింతస్పష్టముగఁ గానవచ్చుచుండి నందున వారు దీపపుఁగాంతియే యని నిశ్చయించుకొనిరి. వేలకొలఁదిగ కరగిపికాకాంతులు కానరా నందున నాచిన్నివెలుతురు శత్రుసేనాగమనచిహ్నము మాత్రముకాదని దేవదేవాదులు పోల్చుకొని యావంకకే నిదానించి చూచుచుండఁ గొంతసేపున కావెలుగు గుర్తించుట కనుకూలమగునట్లుగా వారిని సమీపించెను. అందువలన, నొకచేతియందు దివిటియును, రెండవచేతియందుఁ గరవాలమును గళ్లెమును గైకొని, తురంగారూఢుఁడై యొకపురుషుఁడు మామిడిచెట్లమధ్యనుండి పరుగునవచ్చుచున్నట్లు వారు వెంటనే కనిపెట్టి. యా ముప్వురును వాని కెదురుగా బరుగెత్తసాగిరి. అది చూచి యావచ్చుచున్నపురుషుఁడు దూరమునుండియే "కుమారదేవా! త్రిపురాంతకదేవా! నన్నుఁ జంపివేయకుఁడు. నేను మీశత్రువుఁడను గాను. వెంకన్నను. వెంకన్నను!" అని బిగ్గరగఁ గేక లిడుచు వారిని గలిసికొనెను. అట్లు కలిసికొని వారు తన్నేమియుఁ బ్రశ్నింప నవసరము లేకయే. వెంకన్న నిట్టూర్పులు విడుచుచు, "ఓవీరపురుషులారా! రెండు! రెండు! త్వరపడుఁడు! దేవి పంపించినమనయైదువేలసైన్యములకును, పాండ్యరాజుతో వచ్చినపదివేలసైన్యములకును నీసమీపమునందే ఘోరసంగ్రామము జరుగుచున్నది. మొట్టమొదట మనసైన్యములే మీపైఁబడవచ్చుచుండిన పాండ్యసేనల నడ్డగించినవి. ఈయైదువేలసైన్యములకును గుమార దేవత్రిపురాంతకదేవుల నాయకులుగా నియమింపవలసిన దని దేవి ఛన్ననితో సెలవిచ్చె నఁట! మాండలికరాజసైన్యములును, దేవగిరియాదవసైన్యములును గలిసి దాదాపుగ మూఁడులక్షలశత్రుసైన్యము లొకటిరెండుదినములలో నేక శిలానగరమును ముట్టడింప వచ్చుచున్న వని గూఢచారులవలనఁ దెలియవచ్చుటచేతఁ దత్ప్రయత్నములయందుఁ

బూర్తిగ నిమగ్నమైయున్న రుద్రాంబ మనకుఁ ద్వరగా సైన్యసాహాయ్యమొనర్పఁజాలక పోయినది. ఇప్పుడైనను గార్యము మించిపోలేదు. ధన్యుఁడొక్కఁడె నాయకుఁడై మనసైన్యముల నడపించుచున్నాఁడు. రండు! రండు! ఆలస్యము వలదు." అని పలికినంతనే కుమారదేవ త్రిపురాంతకదేవులు వెంకన్నవలన సంగతు లన్నియుం విని, సంభ్రమాయత్తచిత్తులై సూర్వ్వరుభటులతో దేవదేవు నాగుడారములయొద్దఁ గాపుంచి తక్కిన సైన్యముతోఁ దడవుసేయక వెంటనే యచ్చటినుండి పరువెత్తసాగిరి.

అట్లు పరువెత్తుచు నామామిడితోఁటను విడిచి రమారమి యొకమైలుదూరము గడచినంతనే విశాలమగు నొకమైదానమున గాఢాంధకారమునందుఁ గరదీపికాకాంతుల సాహాయ్యముతో ఘోరసంగ్రామ మొనరించుచుండిన యుభయసైన్యములను నావీరకుమారశేఖరులు చూచిరి. చూచుటయె తడవుగ నావీరకుంజరులిరువురును దమపరివారముతోఁ గూడ రెప్పపాటునఁ బాండ్యసైన్యసరోవరమధ్యంబునకు విజృంభించి యల్లకల్లోలమొనర్పుచుఁ గ్రీడావిహార మొనర్ప నారంభించిరి. ఆంధ్రవీరశేఖరులు సాహసకళాధురంధరులు నగుకుమారదేవ త్రిపురాంతకదేవు లిరువురును దమకు నాయకులై వచ్చిరనువార్త వినినంతనే దేవిసైన్యములకుఁ గల్గిన సంభ్రమమును రణోత్సాహము నెంత వర్ణింపఁగలము!

## 35.వ ప్రకరణము.

### భయంకరసంగ్రామము

అపరిమిత సేనాసమన్విత మగుస్వామిద్రోహమాండలిక రాజమండలము సాహాయ్యముగాఁ ద్రిలింగసామ్రాజ్యశృష్టాయత్తస్వాంతుఁడై యాంధ్రదేశమునకు దీర్ఘశత్రువైన దేవగిరిప్రభువు మహాదేవరజు, మొత్తముపై దాదాపుగ మూఁడులక్షలసైన్యముతో దండెత్తి వచ్చి, యేకశిలానగరదుర్గమును ముట్టడించెను. తీర్థయాత్రనుండి తిరిగి వచ్చినది మొదలుగ యుద్ధరన్నాహములయందుఁ బూర్తిగ నిమగ్నయై, స్వామిద్రోహుల శిక్షించి, యాంధ్రరాజ్యమును నిశ్శత్రుకముగ నొనర్ప దేవి విశ్వప్రయత్న మొనర్చుచుండె నని చెప్పవచ్చును. కుమారదేవునియునికినిగూర్చి నిజమైన సమాచారము తనకుఁ దెలియనంతవరకు నామె యుద్ధప్రయత్నములలోఁ గొంచెముగ నశ్రద్ధవహించెను గాని, యాతఁడు సజీవుఁడై యుండుటయేకాక శత్రుమధ్యమునుండి తప్పించుకొనివచ్చినాఁడనుసంగతి ధన్నునివలన విని నంతనే యామెకుఁ గల్గిన బ్రహ్మానందమును, రణోత్సాహమును వర్ణనాతీతములు.

మాసమునినములకుఁ బూర్వమే దేవి, తన్ను భక్తివిశ్వాసములతో సేవించు సామంతభూకాంతుల కెల్లరకు యుద్ధసంసిద్ధులగునట్లు లాజ్ఞాపించి, యేకశిలానగరమునఁ గూడఁ దత్ప్రయత్నములను జాలవఱకుఁ బూర్తిగావించెను. ఆమె యాజ్ఞానుసారముగఁ

మంత్రులును, సేనానాయకులును, సరదారులును సత్యంతరణోత్సాహమున రాత్రింబవళ్లు నిద్రాహారములు లేకుండఁ బనిసేసి, సమరసన్నాహ మతిజాగరూకతతో నిర్వర్తించిరి. రుద్రాంబ యేకశిలానగరమునకుఁ జుట్టును గంటకకోటను గట్టించెను. దీనికి లోతట్టున మట్టికోటను గట్టించెను. దీనిచుట్టును గొప్పయగడ్తను ద్రవ్వించెను. భూమికోటకు గవనులు 8 యుండు, దిడ్డు 18 యుండు, పుట్టకోటకు గవనులు 4 ను, దిడ్డు 6 యుండు, రాతికోటకు, లోతట్టున రాతిసోపానములును బెట్టించి, అలంగముమీఁదఁ దనబంధువర్గములోని వీరభటుల నుండ నియోగించి, తక్కిన బంధువర్గమునంతటిని రాతికోటకు లోతట్టున నున్న యిటుకకోటలో నుండ విధించెను. కొమ్మ 1 కి నిద్దఱును, బురుజు 1 కి నేబదుగురును, దిడ్డి 1 కి నూర్వురును, గవను 1 కి నేనూర్వురును, వీరభటులను గాపువెట్టెను. ఆయేర్పాటులను, రుద్రాంబ ధైర్యసాహసములను జూచి, గుండెలు బాదుకొనుచు, దేవాసురులకైన నీయేకశిలానగర దుర్గమును భేదించుట యశక్య మశక్య మని ప్రజ లెల్లరుఁ జెప్పుకొనుచు వేనోళ్ల శ్లాఘించుచుండిరి. స్త్రీయయ్యు సహజమగు భీతిలేశమును లేక, వీరపురుషోచితమగు వేషమును ధరించి, మహిషాసురమర్దనివలెఁ జూపరులకు భీకరాకారయై నియమితస్థానముల సేనానాయకుల భద్రముగఁ గాపుంచి, మొత్తమ్మునై నున్నలక్షసైన్యమునకును దానే నాయకురాలై రుద్రాంబ స్వయముగానే నడిపించుచుండెను. కాని, యసంఖ్యాకము లయినసైన్యములతో వచ్చినమహాశూరశిఖామణి యగుమహాదేవరాజుకోటను ముట్టడించి, పదునాలుగుదినములవఱకు మిక్కిలి పట్టుదలతో ఘోరసంగ్రామ మొనరించి, యధికప్రయాసముతో నెట్టులెట్టులో దుర్గము చుట్టును గట్టఁబడినకంటకకోట మొదలగు మూఁడునాలుగుకోటలను బూర్తిగ నిర్మూలము గావించి యేకశిలానగరప్రాకారకుడ్యములకు సమీపించి వానిని దాఁకఁ గల్గెను.

పదునైదవనాఁ డుదయమున నుభయపక్షములకును బూర్వముకన్న ఘోరసంగ్రామ మారంభించెను. వెలమలు కమ్మలు రెడ్లు పద్మనాయకులు మున్నగు నాంధ్రవీరకుమారుల ప్రతాపానలకీలికామాలికల మ్రగ్గి యాపదునాలుగుదినములలోఁ దనసైన్యసర్వస్వమున నించుమించుగ సగముభాగము నశించిపోయినను, నింక నొక్క ప్రాకారము భేదించినచోఁ గోటలోఁ బ్రవేశింపవచ్చు నను పేరాసగొని, యంతవఱకుఁ దా నొనర్పఁగల్గినదానిని దలంచుకొని, ప్రోత్సాహము వహించి పట్టినపంతమును విడక, యొకటిరెండు దినములలోఁ ద్రిలింగసామ్రాజ్యపీఠముపైఁ దాను బట్టాభిషిక్తుఁ డగుటయో లేక, యేకశిలానగర కారాగారమున బంధింపఁబడుటయో జరుగవలసియున్నదని దేవగిరిప్రభువు దృఢముగా నిశ్చయించుకొనెను. వానియాజ్ఞానుసారముగ యాదవసైన్యములు ప్రాణాశ విడిచి, విజృంభించి, గుభిల్లు గుభిల్లునఁ బ్రాకారములను బగులఁగొట్ట నారంభించెను. పైనుండి యాంధ్రవీరులు వర్షించునగ్నివర్షములను బాణవర్షములను,

శిలావర్షములను, లేశమును సరకుసేయక, ప్రాకారముచుట్టు నగాధమైయున్న యగడ్తను బూడ్చివేయువారును, నిచ్చెనలపై బై కెగబ్రాకువారును, గోటద్వారములఁ ద్రవ్వనుద్యమించువారునై యాదవవీరు లెల్లరు దమతమధైర్యసాహసముల వివిధగతులఁ బ్రకటించుచుండిరి. అట్టి భయంకర సంగ్రామ మొనర్చుచు మధ్యాహ్నము పండ్రెండుగంటలగు సరికిఁ గోటచుట్టునున్న కందకము సగము పూడ్చివేయుటయే కాక, యాదవసైన్యము ఉత్తరద్వారమును బూర్తిగఁ దమ స్వాధీన మొనర్చుకొనఁగలిగెను.

ఈయుపద్రవము లన్నియుఁ జూచి దేవి కించిద్భీతివహించి, బొంగరమువలెఁ గోటబురుజులపై సంచరించుచు నందందుఁ గలసేనానాయకులను సైనికులను బ్రోత్సాహపఱచుచు "లెండు ! లెండు ! వెనుదీయకుఁడు ! శత్రువుల యార్భాటములు మితిమీరుచున్నవి. మీదుర్గమును, మీరాజ్యమును, మీప్రజలను మీరు కాపాడుకొనుఁడు. ఆంధ్రవీరులు పిరికిపందలగు యాదవులను సైన్యము నెదిరింపఁజాలనియసమర్థు లని శాశ్వతాపయశమును బొందకుఁడు! తుచ్ఛసౌఖ్యముల కాసింపక, ప్రాణముల లక్ష్యింపక, పౌరుషప్రధానులై యాంధ్రసామ్రాజ్యమో ! వీరస్వర్గసామ్రాజ్యమో ! యభిలషింపుఁడు!" అని పలుకుచు హెచ్చరింపఁ జొచ్చెను. అంతలో విడువక రుద్రాంబ, కవినీలను రప్పించి, బురుజులపై కెక్కించి, పలనాటివీరచరిత్రమునందలి వీరరసస్ఫురితకథావిధానములను వారిచే మనోహరముగఁ బాడింప నారంభించెను.

"మముఁజూడునాయఁడా ! మాబావకొలంది, మముఁజూడు బ్రహ్మన్న మాశౌర్యపటిమ
సింధురంబులమీఁదఁ జెన్నుగా దుమికి, కుంభస్థలంబులు క్రుంగఁజేసెదము
కొదమసింగంబులఁ గూలఁ ద్రోచెదము, గండభేరుండాల ఖండింతు మలుక
వాయువుఁ బోసిక పడి నాపఁ గలము, జాతవేదునిఁ బట్టి చమిరి వైచెదము
ఘనసముద్రముఁ జొచ్చి కలఁగఁ జేసెదము, కుంభినిఁ గాళ్లతోఁ గ్రుంగఁదన్నెదము
కులగిరులైనను గొట్టి వైచెదము, గురిజాలనేలెడు కువలయేశ్వరునిఁ
గొలపగకై పట్టి క్రొవ్వణఁగించి, చలమున విడువక చంపఁగాఁగలము.
... ... ... ... ..."

మొదలుగాఁ గల పలనాటివీరుల కథాభాగములును దేవిప్రోత్సాహవచనములును విని శరీరములు పులకరింప, ధైర్యసాహసములు రెట్టింప, నింక నొక్కరిపుసైనికునేనిఁ బ్రాకారమును దాఁటనీయమని కేకలువేయుచు, నాంధ్రవీరు లెల్లరు నొక్కమాఱుగ విజృంభించి, యొక్కయరగంటకాలములో శత్రుసేనలఁ బీనుఁగుపెంటలుగాఁ గావించిరి. ఉత్తరద్వారము శత్రువులయధీనమైన దనుసంగతి తనకుఁ దెలిసినంతనే రుద్రమదేవి, కమ్మసేనానియగు నాగచమూపతిని, వెలమసేనానియగు రుద్రమనాయకుని దక్షిణమున నైదువేలసైన్యముతో నచ్చటకుఁ బంపించి, వారిస్థానమునఁ దనయుల్లుఁడైనయన్నమదేవుని నియోగించెను. భీమార్జునులవలె నావెలమ కమ్మసేనాను లిరువురును,

నుత్తరద్వారమును సమీపించి, నేలయీనినలీల వేలకొలఁది మూగిన యచ్చటిశత్రుపరం పరల నీక్షించి, దేవి తమకుఁ జేతులనిండఁ బని కల్పించిన దని సంతసింప సాగిరి. ఇంచు మించుగ మూఁడువంతులు శత్రుసైన్య మాయుత్తరద్వారముకడనే కాచియున్నదని చెప్పవచ్చును. అచ్చటఁ బ్రవేశించినతోడనే రుద్రమనాయకనాగచమూపతు లిరువురుఁ దమరణకళాకౌశలమును బ్రదర్శించుచు, నిసుక వేసినరాలకుండ మూగినరిపులమూకల క్షణకాలములో నిటునటుఁ బెదరఁగొట్టి, యాద్వారముఖభాగమును నిశ్శత్రుకముగా నొనరించిరి. సలసలఁ గ్రాగుతైలవర్షమున మలమలమాడి, యగ్నివర్షమున దహింపఁబడి శిలావర్షమున నుక్కుడక్కై, శరవర్షమున రూపుమాసి, యుత్తరద్వారముఖోన్ముఖ మైన శత్రుమండలమంతయుం నతిస్వల్పకాలమున ననేకవిధముల విధ్వంస మయ్యెను.

ఉత్తరద్వారమును విడిచి, జయాభిలాష విడిచి శత్రుసైన్యమంతయుం నిట్లు లల్ల కల్లోల మొందుచుండ గోరుచుట్టుపై రోకటిపోటుకరణి నింతలో మఱియొకయుప ద్రవము తటస్థించెను. నిశాతశరపరంపరల మిటిమీరి వర్షింపుచుఁ దళతళలాడు ఖడ్గ రాజములఁ గంటఁబడినవారి నెల్ల ఖండించుచు యమదండముల వంటిభయంకరములగు నినుపదండములతో నొక్కొక్కమారనే యొక్కొక్క ప్రేటునఁ జావ మోదుచు నాకస్మికముగ వేలకొలఁది నూతనవీరులు వెనుకనుండి పరుగుపరుగున నచ్చి యాదరణ రంగమును మఱింత బీభత్సముగాఁ జేసిరి. ముందువైపునుండియు, వెనుకనుండియుఁ గూడఁ దామొక్కరీతిగా నాశనము కాఁబడుచు, నేమి యుపాయమునుఁ దోఁపక యెవ్వరి నెదిరించుటకు వీలులేక హతశేషులగు యాదవసైనికు లెల్లరుం దమప్రభువు నాజ్ఞకొఱ కెదురుచూచుచుండిరి.

---

## 36.వ ప్రకరణము

### పరస్పరాశ్లేషములు

రెండుప్రక్కల శత్రుసైన్యములు దాకి ప్రచండగతిఁ బోరాడుచుండినను నెట్టులో సహించి సహించి, మధ్యాహ్నము మూఁడుగంట లగునప్పటికి మహాదేవరాజు జయమునుగూర్చిన తనస్థైర్య మంతయుం సంపూర్ణముగ విడిచి సిగ్గుచేఁ దలయెత్తు కొనలేక సంధికార్యమును సూచించుపతాకమును మాత్రము పై కెత్తించెను. ఉత్తర ద్వారముపై నున్నబురుజుపైనుండి యాపతాకమును జూచి, దేవి వెంటనే యుద్ధము నాపవలసినదని తనసేనానాయకుల కాజ్ఞాపించి, సంధిషరతులను గూర్చి యాలో చించుటకై వెంటనే కొలువుకూటమునకు హాజరు కావలసినదని రుద్రమనాయ కుని, నాగచమూపతిని, నన్నమదేవుని, శివదేవయ్యను బిలువఁబంచి, తానుఁ గూడ మెల్లఁగా నచ్చటినుండి బయలుదేరెను. రుద్రమదేవి యాబురుజుపై నుండి క్రిందికి దిగి వాలుస్తై దడుగు లిడునప్పటికి, రక్తధారాసిక్తమగు కరవాలము కేలఁ దాల్చి నిట్టూర్పుల

విడుచుచుండిన యొక సుందరరాజకుమారవిగ్రహము పరుగుపరుగున నామె వెనుకనుండి వచ్చి, కలుసుకొని, ముందరికిఁ బోయి, యడ్డముగా నిలిచి యామెపాదములకు సాష్టాంగ నమస్కారము లొనరించెను. ఆస్వరూపమును జూచి, దేవి యానందాతిశయమున రెండు మూఁడు నిముసములవఱకు నోటమాటలేక, పాదములపై నుండి తటాలున లేవనెత్తి కౌఁగిలించుకొని, "నాయనా! నాబంగారుకొండా! నాచిన్నికుమారా! నిన్నెంతకాలమునకుఁ జూడఁ గంటినోయి! తండ్రీ! కుమారదేవా! ఆపాండ్యరాజహతకుఁడు నిన్నుఁ గఠినశిక్షల బాధింపలేదు కదా? ధన్నుఁడు చెప్పినసంగతులవలన నీ కచ్చట నెట్టి యాపదయుం జనింపలేదనియే తెలిసికొని మిక్కిలి సంతసించితిని. నాయనా! ఎవఁడో దేవదేవుఁడఁట! పాండ్యరాజును మోసపుచ్చి నిన్ను రక్షించిన యాపుణ్యపురుషుఁ డెచ్చట నున్నవాఁడు?" అని మితిమీరిన యాతురతచే వాని నెన్నియో ప్రశ్నలడుగుచుండఁ గుమారదేవుఁడు నవ్వుచు—

"దేవీ! నిన్ను విడిచినదిమొదలు నాచిత్రకథయంతయు నీకుఁ గడువినోదముగ వినిపింపవలెనని నే నింకను ననుకొనుచున్నాను. కాని యీవిషయమంతయుం ధన్నుఁడు నీకిదివఱకే యెఱింగించెనా?"

"ఔను కుమారా! మొన్న సైన్యములకొఱకు నీపంపించినధన్నుఁడు నాకడకువచ్చినప్పుడు నే నానాఁటి రాత్రియంతయు నిద్రలేక నీవిచిత్రచరిత్రమంతయు వానివలన విని మిక్కిలి సంతసించితిని. ఆదేవదేవుఁడు నిజముగా మనపట్ల దేవదేవుఁడే! ఆతనిఋణము మన మెట్లు తీర్చుకొనఁగలమో తెలియదు. దేవదేవుఁడు పాండ్యరాజపుత్రికయైన మహేశ్వరిని వరించి తెచ్చుకొనినాఁడఁట! వారికిరువురకును మనమే స్వయముగా వివాహోత్సవమును గావింతము. ఆతఁడు కోరినయెడల వానికి నాయొద్ద మంచి యుద్యోగ మిచ్చెదను. ఇంకను మనము చేయవలసినయుపకార మేమైనయున్న యెడలఁ జెప్పుము. తప్పక చేసెదను."

"దేవీ! నీవన్నట్లు మన మెంతచేసినను వానిఋణము దీర్చుకొనలేము. వాని సంగతి యట్లుండనిమ్ము. దేవదేవుఁడేకాక, మనము ముఖ్యముగ నాలోచింపవలసిన రెండవవాఁడు త్రిపురాంతకదేవుఁడు............"

"నాయనా! సందేహమేమి? నాఁటనుండియుం నొక్కరీతిగ మనకాకతీయ సామ్రాజ్యమునుగూర్చి యాతఁడు పొందినకష్టములును, మనకొనరించిన మహోపకారములును, మఱచుటకు నేను విశ్వాసఘాతుకురాలనుగాను. వానిని నాకన్నకుమారునివలె నిఁక మీఁదఁ జెంతనిడుకొని పోషించుచుందును."

"అత్తా! నీ సెలవులేనిదే నగరులోఁ బ్రవేశించుటకు సందేహించుచుఁ ద్రిపురాంతకుఁ డీ యుత్తరద్వారమువలనే తనపరివారముతో నున్నవాఁడు"

"ఆఁ—ఆఁ—త్రిపురాంతకుఁడు గూడ నీతోడవచ్చినాఁడా? లోపలికి వచ్చుటకు సందేహించుచున్నాఁడా! సరే! వానికిప్పుడే కబు రంపించెదను."

అనిపలికి, సమీపముననే యున్న యిరువురు సేవకుల కాకార్యభారమును నియోగించి, పరివారముతోఁగూడ త్రిపురాంతకుని దీసికొనిరావలసినదని సెలవిచ్చిపంపించి,

"అబ్బాయీ! పాప మొక్క విషయములోమాత్రము నేను త్రిపురాంతకున కసంతృప్తి కలిగింపవలసివచ్చునేమో యని విచారించుచున్నాను."

"అత్తా! ఏమేమి? అదియేది?"

"కుమారా! పాపము వాని చెల్లెలైన యేకవీర నేఁటికెంతోకాలమునుండి, యెచ్చట వెదకించినను నేమైనదో మాయమై కానరాకున్నది. త్రిపురాంతకుఁడును, వాని ముదుసలి తల్లియుఁ, దమచేతులతో నామెను సాకప్పగించిసారు. ధన్నుఁడుమాత్ర మామె కేమియుం భయములేదని యెందుచేతనో ధైర్యముగాఁ జెప్పుచున్నాఁడు. కారణమేమో తెలియదు."

ఆమాటలకుఁ గుమారదేవుఁడు పకపకనవ్వుచు—

"అత్తా! ఏకవీరపై నీకింతయభిమానము జనించినదేమి?"

"కుమారా! నాయభిమానముమాట కేమి కాని, నీయనురాగ మేమైనది? ఆమెకానరాకున్నదని విచారించుటకు మారుగ నీకీన వ్వేట్లువచ్చినది. క్రమక్రమముగా నీకామెపై ననహ్యముపుట్టియుండును. ఔను నిజమే! నీవుమాత్రము బుద్ధిమంతుఁడవు కావా? ఏవిషయమునందును మనకు సాటికాకికన్యకను వివాహమాడఁగోరెదవా?"

అని ప్రసంగించుచు దేవి కుమారదేవునితోఁగూడఁ దనకొలువుకూటమును సమీపించి యందుఁ బ్రవేశించి సింహాసనాసీన యయ్యెను. కుమారదేవునిఁ జూచినతోడనే యచ్చటివారి కందఱికిని నందు ముఖ్యముగా నన్నమదేవునకుఁ గల్గినసంతోష మింతింత గాదు. అతఁడు తన మద్దుకమ్మునిఁ జూచినంతనే తటాలునఁ గౌఁగిలించుకొని యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని యెన్నియో ప్రశ్నలడుగుచు నెంతయో యాతురత వహింపఁ జొచ్చెను. కుమారదేవుఁడు వానిప్రశ్నలకు సదుత్తరము లిచ్చుచుఁ బ్రక్కకుఁజూచి "దేవీ! అదుగో త్రిపురాంతకదేవుఁడు!" అని తటాలునఁ బెద్దకేక వేసెను. దేవియు సభ్యులు నాతురతతో నావంక విలోకించుచుండఁ ద్రిపురాంతకుఁ డాకొలువుకూటమునఁ బ్రవేశించి దేవికినమస్కరించి కట్టెదుట నిలువ, రుద్రాంబ నవ్వుచు వానిని గూర్చుండ నియమించి—

"త్రిపురాంతకా! నీవుచూపిన భక్తివిశ్వాసములును, నీధైర్యసాహస విశేషములును మిక్కిలి ప్రశంసనీయములు. సంతోషపూర్వకముగ నీయిష్టమువచ్చిన యుద్యోగమునఁ బ్రవేశించి నీవు మాయొద్దనే యుండవచ్చును."

"తల్లీ! మహాప్రసాదము. తమరు దయతో నొసంగు నెట్టియుద్యోగమైనను నేను సంతోషపూర్వకముగఁ బరిగ్రహించి, తమ్ముసేవించుకొను చుండును."

"త్రిపురాంతకా ! జైనాశ్రమమును నీ వెట్లు కనిపెట్టఁగల్గితివి?"

'తల్లీ ! పాండ్యరాజుకడనుండి యీపావమల్లుఁడను నొక సేనాని యొక్క యుత్తరముతో జైనాశ్రమమునకుఁ బోవుచు మార్గమధ్యమున నాకంటఁ బడెను. తోడనే నేను వాని ననుమానించి, సమీపించి, ప్రసంగించి, నేనుఁగూడ జైనస్వామిశిష్యుఁడనే యనిచెప్పి నమ్మించి, నాయాశ్రమమునకుఁ గొనివచ్చి, జైనాశ్రమప్రదేశము తెలిసికొనినవాని వలెనే యాతనితోఁ బ్రసంగింప నారంభించితిని. ఆప్రసంగములో వానిమాటలయందు జైనాశ్రమచిహ్నములు నేను గుర్తెఱిఁగి, యామందభాగ్యుని దుదముట్టించి వానియొద్దనున్న యుత్తరమును దీసికొని వానివేషముతో బయలుదేరి జైనాశ్రమమును బ్రవేశించితిని."

అని త్రిపురాంతకుఁడు మొదటినుండియుఁ దనపడిన ప్రయాసము లన్నియు తెలిసింప దేవియు నన్నమదేవాదులును వానిసంగతియంతయు విని ముక్కుపై వ్రేలిడుకొని యాశ్చర్య మొందసాగిరి. ఇంతలో "కుమారదేవా ! కుమారదేవా!" అని వెలుపలినుండియే బిగ్గరగఁ బిలుచుచు దేవదేవుఁడు మహేశ్వరీసమేతుఁడై వెంకన్నయు రంగఁడును దన్నుఁగొల్చుచుండ నాఁగొలువుకూటమునఁ బ్రవేశించి, "కుమారదేవా! ఖైదీలను గారాగారమునకుఁ బంపివేసితిని. ఇంక మనము చేయవలసినదేమున్నది?" అని దేవిని జూడకయే పలికెను. తోడనే కుమారదేవుఁడును దటాలున లేచి వానిచేయిపట్టుకొని నవ్వుచు "దేవీ ! ఆర్తత్రాణపరాయణుండును, మదీయప్రాణరక్షకుఁడును నగు దేవదేవుఁ డీతఁడే ! వీనిప్రాణప్రియయగు మహేశ్వరి యీమెయే" అని పలుక రుద్రాంబ సభ్యులందఱితోఁ బాటుగ వారిరూపసంపదలకుఁ దానుఁగూడ మిక్కిలి యాశ్చర్యపడుచు నుచితాసనాసీనులఁ గావించి, యందు దేవదేవునితో—

"అబ్బాయీ ! నీవేనా దేవదేవుఁడవు! మాకుమారదేవునిరక్షించిన పుణ్యాత్ముఁడవు నీవేనా? తండ్రీ ! నీఋణము నే నెట్లుతీర్చుకొనఁగలనో చెప్పుము."

'అమ్మా ! మీరట్లుసెలవిచ్చుట ధర్మముగాదు. నేను చేసినమహాకార్య మేమియుంలేదు. నేను నిరంతరమును మీపాదసేవకుఁడనే. నన్నువిడిచి మీరీమహేశ్వరి నాదరింపుఁడు." అనిపలికెను. అందుకు రుద్రాంబ నవ్వుచు, మహేశ్వరిని జూచి, చెంతకుఁ బిలిచి, వీఁపు పైఁ దట్టుచు,

"అమ్మాయీ ! మహేశ్వరీ ! నీవు మాదీర్ఘశత్రువుఁ డైనపాండ్యరాజు పుత్రికవే యయ్యును, మాదేవదేవునివరించినకారణమున మాబంధువర్గములోఁ జేరినదానవైతివి. నీమూలమునను దైవానుగ్రహముచేతను, నీమీఁదఁ గాకతీయపాండ్యవంశముల కన్యోన్యస్నేహభావములుగలుగునని యనుకొనుచున్నాను."

"దేవీ ! మాపాండ్యవంశమున కంతటిమహాభాగ్యముగల్గునని తోఁచదు. అయినను గారాగారమునన్నున్న మాతండ్రిని రక్షించి—"

అని మహేశ్వరి మఱుమాటాడ లేక కన్నీరుగార్చుచు నూరక నిలబడం జొచ్చెను. అదిచూచి దేవి యాశ్చర్యముతో—

"ఏమేమీ? మహేశ్వరీ? మీతండ్రి మాకారాగారమున నున్నవాఁడా?"

అనియడుగ దేవదేవుఁడు.—

"దేవీ! తమరంపించిన సైన్యసాహాయ్యమునఁ బాండ్యసైన్యములఁ బోకార్చి పాండ్య రాజును బట్టుకొని, మనకుమారదేవ త్రిపురాంతక దేవులు తీసికొనివచ్చినారు"

"అలాగునా? అట్లైనయెడల నే నిప్పుడే పాండ్యరాజును బిలిపించి, సామవాక్యములఁ బ్రసంగించి, వానిని సన్మార్గపరునిగాఁ గావించెదను. మహేశ్వరీ! అంతకన్న నీకేమికావలయును? నీవు నీప్రియుండైన దేవదేవునితో హాయిగా—"

అని యేమో చెప్పుచుండ దేవదేవుఁడు—

"దేవీ! క్షమింపవలయును. మహేశ్వరికి నే నొక్కఁడనే ప్రియుండను గాను. త్రిపురాంతకుఁడుఁగూడ"

"ఆఁ-ఆఁ-త్రిపురాంతకుఁడుఁగూడ నీమెనే వరించెనా? ఔరా త్రిపురాంతకా! మీరిరువురును గలసియే యీమహేశ్వరిని బెండ్లాడెదరా యేమి? అయినను దప్పు లేదులే! శరీరములే భేదములుగాని, మీస్వరూపములు రెండును నొక్కటియే కదా?"

అని హాస్యపూర్వకముగఁ బలుక దేవదేవుఁడు—

"దేవీ! త్రిపురాంతకుని యాశ పోఁగొట్టుట ధర్మముగాదు. కావున మీరట్లే కటాక్షింప వలయును."

"దేవదేవా! నీ వింతటికష్టమునపడి సంపాదించుకొనిన యీదివ్యమంగళవిగ్రహమును నీవు విడిచిపెట్టెదవా!"

"దేవీ! విడిచిపెట్టలేకయే మిమ్మింతగాఁ బ్రార్థించుచున్నాను. పరులపాలుగానీక, నే నధికప్రయాసతో సంపాదించుకొనిన సుందరవిగ్రహమును నాకే యిప్పించి, మీరు న్యాయమును బరిపాలింపవలయును."

"దేవదేవా! ఇప్పుడు కాదను వా రెవ్వరున్నారు? అట్లే చేసెదను."

"దేవీ! అట్లైనయెడల నేను మిమ్ము విశ్వసింపవచ్చునా?"

"తప్పక విశ్వసింపవచ్చును."

"తల్లీ! ఇది మోసముగాదుకదా?"

"మోసముచేయుటకు నీవు నాకు శత్రువుఁడవా?"

"తల్లీ! నే నత్యాయాసమున సార్జించుకొనిన సుందరవిగ్రహుఁడగు కుమారదేవుఁ డింక నాధనమైనట్టులేకదా?"

"కుమారదేవుఁడా! దేవదేవా! కుమారదేవునిఁ బెండ్లాడెద ననుటకుఁ నీ వేకవీరవు కావే?"

"దేవీ! ఎట్లు కాకుందును ?"

"అట్లైన నీవేకవీరవేనా ?"

"ఔను."

---

## సమాప్తి.

పాఠకమహాశయులారా ! మనకథావిధాన మింతతో ముగిసినది. ఏకవీరయే దేవదేవుఁ డయ్యె నని తెలిసినంతనే రుద్రమదేవి మహానందభరిత యై యామెను గౌఁగిలించుకొని యనేకవిధముల బహూకరింపఁ జొచ్చెను. తనమనోహరునకై యన్నివిధములఁ గష్టపడి శత్రువులనుండి విడిపించి తెచ్చుకొనిన యేకవీరను జూచి జాలిపడి యాశ్చర్యపడి యామెను దనతమ్మునకిచ్చి తప్పక పెండ్లిచేయవలయునని యన్నమదేవుఁడు పలుక రుద్రాంబయుం నందుకు మనస్ఫూర్తిగ సమ్మతించెను. ఏకవీర తానుచేసిన మోసమును క్షమించి తన్నాదరింప వలయుం నని మహేశ్వరినిఁ బ్రార్థింప, నామె త్రిపురాంతకుని జూచి నవ్వుచు నట్లుప్రార్థింప నవసరము లేదని ప్రత్యుత్తరమిచ్చెను. దేవి యొనర్చిన బోధన వలనఁ బాండ్యరాజు బుద్ధితెచ్చుకొని యప్పటి నుండియుం నామెకాప్తుఁడును మిత్రుఁడును బంధువుఁడు నై మెలఁగుచుండెను. ఏకవీరాకుమారదేవులకును, మహేశ్వరీ త్రిపురాంతకదేవులకును బాండ్యరాజుసమక్షముననే దేవి యత్యంత వైభవముతో వివాహోత్సవములఁ గావించెను. కుమారదేవత్రిపురాంతకదేవు లిరువురును దేవి యనుగ్రహమున నామె సేనావారమునకెల్ల ముఖ్యనాయకులైరి.

దేవగిరిరాజు పశ్చాత్తాపచిత్తుఁడై దేవియాజ్ఞానుసారముగ నామెకుఁ గోటి ద్రవ్యంబు లపరాధమిచ్చుకొని శరణు వేఁడి, నిజరాజధానికిఁ బోయెను. అప్పుడు రుద్రమదేవి తనదేశమునకును, మహాదేవరాజు దేశమునకును, సరిహద్దున జయస్తంభములను బాతించి వానిపై శాసనములను వ్రాయించి, యేఁబదిలక్షలహొన్నులను దనసైనికులకుఁ బంచిపెట్టెను.

జైనస్వామికిని దక్కినజైనులకును గూడ నామరణాంతకారాగారనివాసశిక్ష విధింపఁబడెను. బలవంతముగఁ దానే చేతులారఁ దన కుమారుని, జంపుకొనుటయుఁ దాను చేసిన రాజద్రోహములును దలంచుకొనుచుఁ బ్రతాపదేవుఁడు కారాగృహమునందే పిచ్చియెత్తి కొన్నిదినములకు నపకీర్తిశేషుఁడయ్యెను.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951.

| ప్రతి 1-కి | రూ. | అ. |
| --- | --- | --- |
| వీరాంగనలు | 0 | 12 |
| రేచుక్క—పగటిచుక్క—కథ | 0 | 4 |
| సత్యసేనవిజయము | 0 | 6 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు | 0 | 6 |
| నల ,, | 0 | 8 |
| సావిత్రి ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, | 0 | 6 |

## జీవితములు.

| | | |
| --- | --- | --- |
| శ్రీలాలాలజపతిరాయిజీవితము | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము | 0 | 3 |
| బాలగంగాధరతిలకుచరిత్రము | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడే ,, జీవితము | 0 | 2 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | 1 | 0 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము | 0 | 4 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, | 0 | 4 |
| శ్రీవేమనయోగిజీవితము | 0 | 4 |
| దాదాభాయినౌరోజీచరిత్ర | 0 | 2 |
| మహమ్మదుజీవితము | 0 | 4 |
| శ్రీకరంచంద్ గాంధిజీవితము, ప్రతిమతో | 0 | 12 |
| నెపోలియన్ చక్రవర్తిచరిత్రము | 0 | 4 |
| సోదరినివేదితజీవితము, ప్రతిమతో | 0 | 2 |
| శ్రీమైక్వారుగారిజీవితము | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర | 0 | 4 |
| లార్డ్‌క్లైవుజీవితము | 0 | 8 |
| స్వామిరామతీర్థజీవితము | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | 0 | 3 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
| --- | --- | --- |
| అబిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | 0 | 4 |
| శాలివాహనచరిత్ర | 0 | 3 |
| శ్రీతుకారామస్వామిచరిత్రము | 0 | 6 |
| శ్రీసమర్థరామదాసస్వామి చరిత్రము | 0 | 6 |
| గౌతమబుద్ధుని జీవితము | 0 | 4 |
| శ్రీచిత్తరంజనదాసుజీవితము | 0 | 4 |
| అలీసోదరులజీవితము | 0 | 4 |
| రామదాసుచరిత్ర, ప్రతిమతో | 1 | 8 |

## నవలలు.

| | | |
| --- | --- | --- |
| సీతారామము | 1 | 4 |
| అస్తమయము, నవల | 1 | 5 |
| ఐవన్హో ,, | 0 | 8 |
| సుజనరంజని ,, | 0 | 8 |
| విజ్జలదేవి ,, | 1 | 8 |
| ఉన్మాదిని ,, | 0 | 6 |
| రాధారాణి ,, | 0 | 6 |
| దుర్గేశనందిని ,, | 1 | 0 |
| కపాలకుండల ,, | 1 | 0 |
| లక్షణ ,, | 1 | 0 |
| టిప్పుసుల్తాన్ ,, | అచ్చు | |
| లీల ,, | 0 | 6 |
| రాజర్షి ,, | అచ్చు | |
| తారాబాయి ,, | 1 | 4 |
| దిలారామ ,, | 1 | 4 |
| మనోహరి ,, | 1 | 4 |
| వీరబాల ,, | 0 | [illegible] |
| ఆనందమఠ ,, | 1 | [illegible] |
| లాలాబాయి ,, | 0 | [illegible] |
| రోషినార ,, | 0 | 1[illegible] |

